# గజపతిరాజుల
# తెలుగు సాహిత్య పోషణము

(ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి
బహుమతిని పొందిన గ్రంథము)

రచయిత :

బులుసు - వేంకటరమణయ్య, పి. ఓ. ఎల్.,

[భూతపూర్వ గ్రంథాలయాధికారి, ఫోర్టు సంస్కృత లైబ్రరీ,
విజయనగరము
అలంకార శాస్త్రపరిశోధకుడు,
కాశీ హిందూ విశ్వవిద్యాలయము]

ఆంధ్రోపాధ్యాయుడు
హిందూ - థియలాజికల్ హైస్కూలు, మదరాసు-1.

ప్రకాశకులు :

బాలసరస్వతీ బుక్ డిపో,
విద్యావిషయ ప్రచారకులు
6. సుంకురామచెట్టి వీధి, మద్రాసు - 1, కర్నూలు.

1964 [వెల రూ. 5-00

# ముందుమాట

విజయనగరమున విద్యాభ్యాసము చేయుచున్న కాలము నందే విజయనగరప్రభువుల వదాన్యతనుగూర్చియు, వాఙ్మయ పోషణమునుగూర్చియు పెక్కు గాథలను వింటిని. ఆ మహారాజుల పోషణమున వెలువడిన కొన్ని గ్రంథములను కళాశాలాగ్రంథాలయములోఁ జూచితిని. కళాశాలలో విద్య పూర్తియైనపిదప ఆ ప్రభువులనుగూర్చి యొక గ్రంథమును వ్రాయవలెనను సంకల్పము నాకు విద్యార్థిదశలోనే కలిగినది.

కాలేజీలో చదువు పూర్తియైన కొలఁది నెలలలో శ్రీ మహారాజుగారి కోటలోని సంస్కృతగ్రంథాలయమున సంవత్సరకాలము లైబ్రేరియనుగా పనిచేయు మంచి యవకాశము లభించుటచే, ఆ సమయమున నా సంకల్పము దృఢపడినది, అచట పనిచేయునపుడు ప్రత్యేకముగ ప్రభువుల యాదరము పొందిన ముద్రితాముద్రిత గ్రంథములను పరిశీలించి, కావలసిన విషయములను సమకూర్చుకొనఁగలిగితిని. కాని పిదపఁ జాలకాలము దీనింగూర్చి ప్రయత్నింప నవకాశము కలుగలేదు. ఒకప్పుడు ఆదర్శమహాపురుషులంగూర్చి "దీపకళికలు" అను నొక ఉపవాచకముకు వ్రాయు సందర్భమున, అందు "శ్రీ ఆనందగజపతి" మహారాజుగారినిగూర్చి మాత్రము వ్రాయఁగలిగితిని. కాలము గడచినకొలఁది వాఙ్మయమున వేఱు విధమునఁ గృషి

చేయుచుండుటయే తటస్థించినది కాని విజయనగరప్రభువులను గూర్చిన గ్రంథమును రచించు నవకాశము కలుగకపోయినది.

కొన్ని నెలల క్రిందట ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి వారు ఉత్తమగ్రంథములకు బహుమతులను ప్రకటించుచు, గ్రంథరచనకు నిర్ణయింపఁబడిన విషయములలో "విజయనగర సంస్థానము—ఆంధ్రవాఙ్మయపోషణ" అనుదానిని స్వీకరించిరి. ఈ ప్రకటనను చూచినవెంటనే, వెనుక సంకల్పించిన గ్రంథమును వ్రాయు నుత్సాహము కలిగినది. ఈ విషయమును కొందరు మిత్రులకుఁ దెలుపఁగా, వారు ఎక్కువగా ప్రోత్సహించిరి. వారి ప్రోత్సాహమునే ఆధారముచేసికొని ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారములో ఉపలబ్ధములైన కొన్ని గ్రంథములను పరిశీలించితిని. వేసవి నెలవులలో విజయనగరమునకును, పరిసరప్రాంతములకును పోయి గ్రంథసంపాదనకయి యత్నించితిని. నాకు కావలసిన పుస్తకములు చాలవఱకు లభించినవి. పిదప రచనాప్రణాళికను నిర్ణయించుకొని, యేతద్గ్రంథరచనకుఁ బూనుకొంటిని. విజయనగరప్రభువులు సంస్కృతవాఙ్మయమును పోషించుటకును అపారమగు ధనమును వెచ్చించుటవలన, అట్టి గ్రంథములను తెలిసినంతవఱకును స్వల్పవివరణములతో "అనుబంధము"లో పేర్కొంటిని.

ఈ గ్రంథము సమగ్రమని చెప్ప సాహసింపను. ఇందుఁ జేరని గ్రంథము లుండవచ్చును. కాని, యిప్పటివఱకు ఉపలబ్ధములై నవానింగూర్చియైన ఆంధ్రలోకమునకుఁ దెలుపఁ

గల్గినందులకుఁ గొంత తృప్తి కలుగకపోలేదు. ఇది యాంధ్రుల యాదరణ నే మాత్రము పొందఁగలిగినను నా ప్రయత్నము సఫలము కాఁగలదు.

ఏతద్గ్రంథరచనకుఁ బ్రోత్సహించి, పూజ్యులు శ్రీ పప్పు-పేరయ్యశాస్త్రిగారు (P.O.L) పెక్కువిధముల సహాయమొన ర్చిరి. ప్రియమిత్రులు శ్రీ కరి - నారాయణాచార్యులుగారును, వారి పుత్రులు చిరంజీవి కస్తూరిసామిగారును కోరిన గ్రంథముల నొసఁగిరి. వీరందరికిని నా యభివందనములు!

దీనిని తమకుఁ గృతిగా స్వీకరించుటకు దయతో నమ్మ తించిన ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు, విజయనగరంరాజా సాహెబ్‌వారు శ్రీ పి. వి. జి. రాజుగారి కనేకధన్యవాదములు!

ఈ పుస్తకము వెలువడుటకు హితైషులు బాలసరస్వతీ బుక్ డిపో యజమానులు శ్రీ టి. బాలనాగయ్య సెట్టిగారును, వెలన్ ముద్రణాలయాధిపతులు శ్రీ జి. భావనారాయణగారును ఎంతో తోడ్పడిరి. వారికిఁగేలోడ్పు.

'ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి' వారి ప్రకటనమ్మే వెలువడనియెడల ఈ గ్రంథ మింత శీఘ్రముగ రచియింపఁ బడి యుండదు. కావున దీని రచన కవకాశము కల్పించిన అకాడమివారి కనేకధన్యవాదములు!

—బులుసు - వేంకటరమణయ్య

# ఆధారగ్రంథములు

ఈ గ్రంథమును వ్రాయుటలో నాకు, విషయసూచికలోఁ జెప్పఁబడిన గ్రంథములతో పాటు క్రింది పుస్తకములు కూడ తోడ్పడినవి. ఆయా గ్రంథకర్తలకు కృతజ్ఞతాపూర్వకాభివందనములు.

1. ఆదిదము-సూరకవి జీవితము

   శ్రీ ఆదిదము-రామారావుగారు.

2. కళింగ సంచిక :

   సంపాదకులు : శ్రీ రాళ్లభండి-సుబ్బారావుగారు.

3. తెలుగు విజ్ఞాన సర్వస్వము :

   మూఁడవ సంపుటము-తెలుగు సంస్కృతి.

4. నానారాజ సందర్శనము :

   శ్రీ తిరుపతి వేంకటకవులు.

5. విజయనగరదర్శిని :

   సంపాదకులు :— శ్రీ గురజాడ-సూర్యనారాయణమూర్తిగారు.

6. శ్రీరామతీర్థ చరిత్రము :

   శ్రీ గంటి-సూర్యనారాయణశాస్త్రిగారు.

7. సంవత్సరాది సంచికలు :

   ఆంధ్రపత్రికా సంపాదకవర్గ సంపాదితములు.

8. వివిధ వ్యాసములు :

   ఇవి కాక నేను రచించిన "దీపకళికలు" అను పుస్తకములోని 'ఆనందగజపతి' ప్రభుని చరిత్రయు, "ఆంధ్రకవిసప్తశతి"లోని వివిధ కవుల చరిత్రలును ఉపయోగపడినవి.

# విషయసూచిక

పుట

ఈ గ్రంథము

విజయనగరం రాజా సాహెబ్ వారును

ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు నగు

శ్రీ పి. వి. జి. రాజుగారికి

శ్రీవారి యనుమతితో

అంకిత మొనర్పఁబడినది.

# 1. గజపతిరాజుల వంశవృక్షము

విజయనగర సంస్థాన ప్రభువులగు గజపతిరాజుల వంశవృక్షమును నిర్ణయించుటకు కొన్ని గ్రంథము లాధారములయి ఉన్నవి. అవి – శ్రీకృష్ణవిజయము, ఉషాభ్యుదయము, విష్ణుభక్తి సుధాకరము, కూర్మపురాణము అనునవి. వీనిలో కూర్మపురాణము శ్రీ ఆనందగజపతి మహారాజు గారి కాలములో రచింపఁబడినది. పయి గ్రంథము లన్నింటి యందును ఈ వంశక్రమ మొక్కరీతిని లేదు. ఒక్కొక్క గ్రంథమున నొక్కొక్క తీరున ఉన్నది. సుప్రసిద్ధచరిత్ర పరిశోధకులును, కవిజీవిత గ్రంథకర్తలును అగు శ్రీ గురుజాడ–శ్రీరామమూర్తిగారు పయి గ్రంథముల నన్నింటిని పరిశోధించి, కూర్మపురాణమునందలి వంశవర్ణనము నాధారము చేసికొని వంశవృక్షమును తయారుచేసి శ్రీకృష్ణవిజయమునఁ జేర్చిరి. ఆ వంశవృక్షము చాల విపులముగా నీయఁబడినది. రాజ్యపాలకుల నామములు ఎక్కువగా సూచింపఁబడినవి. కావున ఎవ్వరెవ్వరు రాజ్యమును పాలించిరో, ఎవరి యనంతర మెవ్వరు రాజ్యమునకు వచ్చిరో తెలిసికొనుటయు కష్టసాధ్యమే! అందువలన పయి గ్రంథ

ములన్నింటిని పరిశీలించి, సంస్థానప్రభుత్వమును నిర్వహించినవారినే ప్రధానముగా గ్రహించి యీ వంశవృక్షము చూపఁబడుచున్నది.

ఈ వంశవృక్షమును నిర్ణయించుటకు గజపతిరాజుల వంశమునకు సంబంధించిన చరిత్రాంశములే ఆధారములు. ఆ విషయములు కూర్మపురాణమున వివరముగాఁ గాన వచ్చుచున్నవి, ఆ గ్రంథమునందలి చరిత్రాంశములు, కార్మైకిల్ దొరగారు కూర్చిన విశాఖపట్టణముజిల్లా వృత్తాంత సంగ్రహముయొక్క ఆంధ్రానువాదము ఇందు మిక్కిలి యుపకరించినవి.

గజపతిరాజుల వంశస్థులలో సమాననామము కల ప్రభువు లనేకు లున్నయెడల, వారిపేర్ల చివఱ ప్రథమ, ద్వితీయాది క్రమమును సూచించుచు అంకెలు వేయఁబడినవి. సాధారణముగ పురుషసంతతియొక్కయు, రాజ్యాధికారమును పొందినవారియొక్కయు నామములే యిందు గ్రహింపఁబడినవి.

# వంశ వృక్షము

[కూర్మపురాణములోని పీఠికనుబట్టి తెలియు వంశవృక్షము]




జగన్నాథరాజు
అన్నమరాజు
కృష్ణమరాజు II
వెంకటపతిరాజు
ఆనందరాజు I
విజయరామరాజు I
సీతారామచంద్ర రాజు
ఆనంద రాజు II
విజయరామరాజు II
విజయరామరాజు III
నారాయణ గజపతి
విజయరామ గజపతి I


అప్పలకొండయాంబ
నారాయణ గజపతి
ఆనందగజపతి
విజయరామ గజపతి II
అలక్ నారాయణ గజపతి
విజయానంద గజపతి
విజయరామ గజపతి III
విశ్వేశ్వర గజపతి
విద్యాదేవి
ఊర్మిళాదేవి
ఆనందగజపతి
అశోకగజపతి
సునీతికుమారి

# 2. గజపతిరాజుల వంశచరిత్ర

విజయనగర సంస్థాన ప్రభువులు గజపతిరాజులుగా ప్రసిద్ధికెక్కియున్నారు. వీరి నామము చివఱ 'గజపతి' అను పదము కానవచ్చుచుండుటయే దీనికిఁ గారణము. వీరి పూర్వులపేర్ల చివఱ 'వర్మ' అనిగాని 'రాజు' అనిగాని యుండుచు వచ్చెను. 'గజపతి' నామము ఉత్కళదేశమును పాలించు ఓఢ్రరాజులకే ఉండినది. కాని, యీ వంశీయులలో నొకప్రభువు ఉత్కళ గజపతిరాజును జయించి, యతని బిరుదము తీసికొనినప్పటినుండియు విజయనగర పాలకులకు 'గజపతి' బిరుదనామము సంక్రమించినది. నాఁటినుండి నేఁటి వఱకును విజయనగర సంస్థానాధిపతులు గజపతిరాజులుగా వ్యవహరింపఁబడుచున్నారు.

విజయనగర ప్రభువులు సూర్యవంశ క్షత్రియులు. శ్రీరాముని సంతతివారు. ఈ వంశస్థులే తొలుత ఉత్తర హిందూస్థానములోని ఉదయపుర రాజ్యమునకుఁ బాలకులయి యుండిరి. ఈ విషయమే కూర్మపురాణమున-

క. 'ఆ సంతతివా రుదయపు
రీసింహాసన గతోదరీకృత నిఖిలో
ర్వీ సామ్రాజ్య ధురంధరు
లై సముదీర్ణ ప్రతాపులై సెలసి రిలన్.'

అని చెప్పఁబడి యున్నది.

ఈ వంశస్థులలో విజయభూపతి సాటిలేని పరాక్రమ శాలి. ఇతఁడు దిగ్విజయార్థియై బయలుదేరి యయోధ్యను జయించి, అటనుండి దక్షిణాపథమునకు మార్గము పట్టెను. ఈ విజయభూపతి దక్షిణభారతములోని బిజాపుర ప్రాంతమున విజయనగరమును కట్టించెనని కూర్మపురాణమునఁ జెప్పఁ బడినది. అయ్యదియే విజయపురమయి క్రమముగా బిజాపురము—బిజాపూరు అయి యుండెనేమో! ఈ విజయభూపతికే బుద్ధవర్మ యను నామాంతర ముండినట్లు పయి గ్రంథమునందే చెప్పఁబడినది. కాని, శ్రీకృష్ణవిజయమునందు తొలుతనే —

చ. 'శ్రీ శుభ శాంబలాశి హిమ
భానుఁ డనూన వసిష్ఠగోత్రజో
ద్యాన మహా మహీరుహ స
మాన విరాజిత కల్ప భూరుహం
బానత లోకరక్షకుఁ డ
హంకృతిమత్పరభూమిభృత్తమో
భానుఁడు బుద్ధవర్మ యను
పార్థివముఖ్యుఁడు గల్గె మేదినిన్.'

అని యుండుటంబట్టి బుద్ధవర్మ విజయభూపతికంటె వేఱు వ్యక్తి యని తోఁచకమానదు.

విజయభూపతి ఉదయపుర రాణాల వంశమునకుఁ జెందినట్లు క్రీ. శ. 1888 లో ఉదయపురపు రాణా విజయ నగర ప్రభువైన నారాయణగజపతి మహారాజులుంగారికి వ్రాసిన యీ క్రింది జాబువలన స్పష్టపడుచున్నది.

## 'రాజాజీ శ్రీ గజపతీ ఉచ్చైనారాయణ ఏతాన్.




శ్రీరామజీ

ఏకలింగజీ—

సిద్ధశ్రీ బనారస్ శుభస్థానమందు, లోకప్రసిద్ధమగు సర్వోపమలకూ తగిన రాజాజీ శ్రీ గజపతి ఉదయ నారాయణజీవారికి—ఉదయపురము నుంచి సవాయసింగు వ్రాయుచున్నారు. నమస్కారములు. యిక్కడ సమాచారము – శ్రీవారి కటాక్షవీక్షణవల్ల కుశలం. సదా తమకు మంచి అవుగాక. అందువల్ల మాకు మిక్కిలి సుఖముగా నుండును. తమరు వ్రాసిన యుత్తరము అందినది. అందుల సంగతులు బోధఅయినవి. రాజా విజయభూప్ వారివద్దనుంచీ వంశపుకోవ విడినది. ఇది బాపాజీ రావల్ వారి కాలముకంటె ప్రాచీనకాలమై యున్నది. అయోధ్యలో రాజ్యం చేయుచుండు కాలములోనిది. కావున వంశము కలిసినది. ఇక వివాహ సంబంధముల విషయమైతే—రఘూలా, చవ్వాణ, కచవాహా, సోలంకీ, పుంవార, చావడా, భాటీ—యీ స్థలములలో నుండు సామంతుల వంశములతో మా దర్బార్ లో వివాహసంబంధములు జరుగుచు నుండును గనుక వారితో తమరును అట్టి సంబంధములు చేసుకోవచ్చును. ఇందుకు సంశయము యేమీ వుంచనక్కరలేదు. తమరు నిశ్చయముగా యిక్కడి పిల్లలై యున్నారు. అది మాకు బాగా తెలియును. తమరునూ సంతోషించవలెను. తమరు తరుచుగా వ్రాయుచు నుండవలెను. తక్కిన సమాచారము అన్నిటిని పురోహిత్ సూర్యనారాయణశాస్త్రి తెలియ పరుచుకొనుచున్నారు. సంవత్ 1894 కార్తిక శుద్ధ 3 క్రీ. శ. 1838."

పయి లేఖ శ్రీ నారాయణ గజపతిప్రభువు కాశీనగరములో నివసించుచుండినపుడు వ్రాయఁబడినది.

బుద్ధవర్మవంశమున మాధవవర్మ జన్మించెనని కూర్మపురాణమునఁ గలదు. కాని, శ్రీకృష్ణవిజయమున, మాధవవర్మ బుద్ధవర్మ పుత్రుఁడే యని చెప్పఁబడియున్నది.

క. 'భువనవర్ణితుఁడైన యా బుద్ధవర్మ
పుత్రుఁ డుచరిత్రుఁ గాంచె నమిత్రజైత్రు
నిజమనోంబుజ నిహిత త్రినేత్రుఁ గులప
విత్రు మాధవవర్మ పృథ్వీకళత్రు.'

[శ్రీకృష్ణవిజయము—పీఠిక 74 ప.]

మాధవవర్మ గొప్ప తపశ్శాలి. ఇతఁడు దుర్గాసాక్షాత్కారమును పొంది యా దేవి యనుగ్రహమువలన ఏడు గడియలకాలము తన రాజ్యమునఁ గనకవర్షము కురియునట్లు చేసెనని ప్రసిద్ధి కలదు. దీనినే శ్రీకృష్ణవిజయమునందలి

క. 'శాలివాహన శకవర్షముల సంఖ్య
దనరఁగ నేనూట పదునాలు (1514) గైననాఁడు
ధర్మనియతికి మాధవవర్మ మెచ్చి
కనకవర్షంబుఁ గురియించెఁ గనకదుర్గ.'

అను పద్యము వ్యక్తము చేయుచున్నది.

మాధవవర్మ గౌతమీ, కృష్ణానదుల నడుమఁ గల విజయవాటిలోఁ గోటను గట్టి, యది తనకు రాజధానిగా రాజ్యమును పాలించెను. ఈ మాధవవర్మ కుమారుఁడు దేవవర్మ. ఇతనికి శైలమదేవియందు చిక్కభీమవర్మ యను

కుమారుఁడు జన్మించెను. తల్లినిబట్టి యితనికి "మైలమభీముఁ" డనుపేరు ప్రసిద్ధమయ్యెను. చిక్కభీముఁడు మహాపరాక్రమశాలి. సాటిలేని ధైర్యసాహసములు కలవాఁడు. చరిత్రప్రసిద్ధుఁడు. ఇతఁడు పిడుగు పడుచుండఁగా, సాహసమున, దానిని నఱికినట్లు "పిడుగు నర్కిన చిక్కభీమావనీపతి" యను నొకపద్యభాగమువలనఁ దెలియుచున్నది. ఇతఁడు బలవంతుఁడును, ధైర్యశాలియు నగుటచే 'చిక్కభీముఁ' డను పేరు కలిగి యుండవచ్చును. బంధువు లితనిని ముద్దుగా 'చిక్కభీముఁ' డని పిలుచుటచే నీ నామ మేర్పడినదని శ్రీ గురుజాడ - శ్రీరామమూర్తిగారు వ్రాసిరి. 'చిన్న' అను నర్థమునందు 'చిక్క'పద ముపయోగింపఁబడి యుండవచ్చుననియు నూహింపవచ్చును. ఇతఁ డనేకభండనములలోఁ బ్రచండుఁడయి యుండుటంబట్టి 'భండనభీముఁ' డనియును, ఏరువ యను దుర్గమును పాలించుటవలన 'ఏరువభీముఁ' డనియును నామాంతరములు పొందియుండెను.

ఈ చిక్కభీముఁడు తన విరోధి యగు భల్లాణరాజు నోడించి, కనికరించి పిదప విడిచిపెట్టెను. కాని, మఱికొంత కాలమున కా భల్లాణుఁడే తన పైకి రాఁగా, ఆతనితో యుద్ధము చేయ నొల్లక యితఁడు తన శరీరమును తానే మూఁడు తునుకలుగాఁ జేసికొనెననియు, అందువలననే భీమునికిని, ఇతని వంశస్థులకును 'పరిచ్ఛేదు' లనెడి పౌరుషనామము కలిగెననియు నొక యైతిహ్యము కలదు. ఇతఁడు పిడుగును నఱికిన కర్తని వేములవాడ భీమకవి——

చ. 'గరళ ప్రమద్ద లోహ, మవగాఢ మహాశనికోట్లు సమ్మెటల్,
హరినయనాగ్ని కొల్మి, యురగాధిపుకోరలు పట్టుకార్లు, ది
క్కరటి శిరంబు డాలు, అయకారుఁడు కమ్మరి, వైరి వీర సం
హరణ గుణాభిరాముఁడగు మైలమ భీమన ఖడ్గసృష్టికిన్.'

అని యద్భుతముగా వర్ణించి యున్నాఁడు. ఆ కత్తి విజయనగరమున శ్రీ పూసపాటివారి సంస్థానమున భద్రముగా నున్నట్లు తెలియుచున్నది.

చిక్కభీముని యనంతరము అమలరాజునామము ప్రసిద్ధమై యున్నది. అమలరాజు చిక్కభీముని కుమారుఁడని కూర్మపురాణమునందును, చిక్కభీముని వంశీయుఁడని శ్రీకృష్ణవిజయమునందును కలదు. ఇతఁడు తమ సూర్యవంశపురాజులకు నివాసభూమి కాఁదగిన 'పూషవాటి' అను నగరమును కొండపల్లి సీమలో నిర్మించి, యచటనే యుండి రాజ్యము పాలించుచుండెనఁట! ఆ పూషవాటియే క్రమముగా జనుల వాడుకలో 'పూసపాటి – పూసపాడు'గా మారెను. ఈ విషయము కూర్మపురాణమునం దీ క్రింది పద్యభాగములో వివరింపఁబడినది.

సీసపాదము–'పూషవంశ్యుల వాసభూమిగాఁ దగ నొక
పూషవాటి యనంగఁ బొలుచు పురము,
గీ. కొండపలి సీమ నొవరించి యుండెనందు;
పామరోక్తుల నది పూసపా డనఁదగె.'

అమలరాజునకుఁ బిదప వీరి వంశము పూసపాటి వంశముగాఁ బ్రసిద్ధమైనది. ఈ యమలరాజునకుఁ బిదప అయ్యపరాజు, తమ్మిరాజు అనువారు రాజ్యమును పాలించిరి.

పిదప రాచిరాజు రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు సుప్రసిద్ధుఁడు. ఇతఁడు 'చాళుక్య వీర రాజ్య స్థాపనాచార్య' బిరుదము వహించి యుండెను. చాళుక్య రాజ్యమును మరల స్థాపించుటవలన నీ బిరుదము లభించెను. ఇతఁడు ప్రౌఢ దేవరాయలకు మిత్రుఁడు. అతనివలన సమ్మానముల నందెను. దామెరవంశప్రభు వగు తమ్మన్న దొరను జయించి. యతనివలన కప్పము గైకొనెను. మ్లేచ్ఛులను జయించి, అనేక దుర్గములను స్వాధీనము చేసికొనెను. ఇతనికి 'మన్నె సుల్తాను, మాళవాధిపతి శిరశ్శూలుఁడు, సహకార బాంధవుఁడు' – అను బిరుదములు కూడ నున్నవి. ఇతని కాలము 15-వ శతాబ్ది మధ్యభాగమైనట్లు తెలియు చున్నది.

రాచిరాజునకు మువ్వురు కుమారు లుండిరి. వారు– తిప్పరాజు, తమ్మిరాజు, కృష్ణమరాజు అనువారు. వీరిలో తిప్పరాజునకు మన్యసుల్తా నను బిరుదుండెను. రెండవ కుమారుఁడగు తమ్మిరాజు సుప్రసిద్ధుఁడు. ఇతఁడు నందపురి యొద్ద ఉత్కళ ప్రభువగు వీరప్రతాపరుద్రగజపతి నోడించి, యతని 'గజపతి' బిరుదమును లాగికొనెను. ఇతని కాలము నుండియే విజయనగర ప్రభువులు గజపతిరాజులుగా ప్రసిద్ధులైరి.

గజసేనలను గొట్టుటవలన ఈతనికి గజపతి బిరుదము లభించినట్లు ఉషాభ్యుదయములోఁ గలదు. కాని, నందాపుర ప్రభువులు కటకరాజవంశస్థు లగుటవలన, వారిని జయించి యీ బిరుదమును సంపాదించెనని చెప్పిన,

'అవిచలితముల నంచపురపు శైలమునొద్ద
మర్దించి గజపతి మాన్యుఁ డయ్యె.'

అను కృష్ణవిజయములోని విషయమే యథార్థమని గ్రహింపవలెను. కూర్మపురాణాదులందు నీ విషయమే కలదు. ఈయన పెక్కు సేనలను కూర్చుకొని పోయి వెల్లముకొండ దుర్గమును సాధించెను. లగ్గలుపట్టి శ్రీరంగ రాజుకొండను జయించెను. ఓడపల్లి యను చోట జరిగిన యుద్ధములో శత్రుసైన్యములు పటాపంచ లగునట్లొనరించి, దాని నగరమును స్వాధీనపఱచుకొనెను. త్రిభువనీరాయ బిరుదాంకితుఁడగు రావు సింగమనీనితో 'పెదవీడు' అను నగరము సమీపమున యుద్ధముచేసి యాతని నోడించెను. తనతో యుద్ధము చేసి యోడిపోయిన బాహాదిఖాను శరణు వేడఁగా, దయదలచి కాపాడెను. ఈ యంశము లన్నియును శ్రీకృష్ణ విజయమునందలి

'ధూర్తసైన్యములతోఁ బోదివి వెల్లముకొండ
సాధించె నిశ్శంక సాహసమున,
ఘట్టించి లగ్గలఁ బట్టించి చేకొనెఁ
బ్రబలుఁడై శ్రీరంగరాజుకొండ,
బలియుఁడై యోడపల్లిఁ జైకొనియె వి
పక్షులందఱు పటాపంచలుగను,
త్రిభువనీరాయ బిరుద ప్రదీప్తు రావు
సింగని జయించెఁ బెదవీటిచెంతఁ బోదివి,
కలన శరణన్న బాహాదిఖానుఁ గాఁచె
రాచభూపాలు తిమ్మ ధరావరుండు.'

అను పద్యభాగము తెలియఁజేయుచున్నది.

పయి పద్యములోఁ జెప్పఁబడిన బాహాదిఖానుఁ డెవ్వఁడో తెలియరా లేదని శ్రీ గురుజాడ - శ్రీరామ మూర్తిగారు వ్రాసిరి. తమ్మిరాజు బహదుల్లాఖాను నోడించి, పిదపఁ గాపాడినట్లు కూర్మపురాణమువందుఁ జెప్పఁబడినది.

రావువారి వంశావళిని వివరించు 'వాసవదత్తా పరిణయము' నం దీ తమ్మిరాజు ప్రస్తావన కలదు. ఇతఁడుదయపుర పురాణాల వంశములోనివాఁడనియు, ఇతనికి మాధవవర్మ యను నామాంతర మున్నదనియు నా గ్రంథము వలనఁ దెలియవచ్చుచున్నది. తమ్మిరాజు మహా విద్వాంసుఁడనియు, సమస్త శాస్త్రముల నెఱిఁగినవాఁడనియు కూర్మ పురాణమునుబట్టి తెలియుచున్నది.

తమ్మిరాజు పుత్రుఁడగు రాచిరాజు కూడ తండ్రి వలెనే సుప్రసిద్ధుఁడు. ఇతఁడు కలకేశ్వరునివలన కేతవరమను పట్టణముఁ గైకొని, దానినే తన రాజధానిగాఁ జేసికొనెను. ఇయ్యది కృష్ణానదీతీరమున నున్నది. ఇతఁడు సర్వకాలము తన యెడమకాలికి 'బారహా మన్నె గండ పెండేరము'ను ధరించియే యుండెనఁట!

ఇతఁడు వీర ప్రతాపరుద్ర కాలీనుఁడని కొందఱును, శ్రీకృష్ణదేవరాయల తోడియల్లుఁడని కొందఱును చెప్పుదురు. ఈ రాచిరాజు 'నవభారత' మను కావ్యమును రచించినట్లు 'విజయనగర దర్శిని' అను పుస్తకములోఁ జెప్పఁబడి యున్నది. రాచిరాజు గ్రంథమునకు కృతిభర్త కాని, కృతికర్త కాఁడు. ఇతనిం గూర్చిన విషయము లన్ని

యును శ్రీకృష్ణవిజయమునందలి క్రింది పద్యమువలనఁ దెలియ నగును.

సీ. 'నవభారతాఖ్యాన నవ్యకావ్యమునకు
        నాయకుఁడయ్యె నే నరవరుండు,
కటకేశ్వరునిచేతఁ గని కేతవర మాత్మ
        పురముగాఁ జేసె నే భూవరుండు,
నిలిపె బాహారమన్నె నృపగండపెండేర
        మెప్పుడు డాకాల నే నృపతిమౌళి,
యఖిల సద్గుణవతి యక్కమాంబాదేవి
        ప్రాణేశుఁడయ్యె నే పార్థివుండు,

గీ. ప్రథిత గజపతిరాజ వీరప్రతాప
రుద్రతనయాధినాయకారూఢ తమ్మి
రాజ జనకతఁగాంచె నే రాజతిలక
మతఁడలరు తమ్మివిభు రాచయప్రభుండు.'

ఈ రాచవిభునకు సంతానమున్నట్లు కానరాదు. ఇతని సోదరుఁడగు తిప్పరాజు కుమారుఁడు, ఇతని యనంతరము రాజ్యాధికారమును పొందినట్లు తెలియుచున్నది. తిప్పరాజు కుమారుఁడు కృష్ణరాజు మిక్కిలి ప్రసిద్ధిని పొందెను. కృష్ణరాజు పెక్కు దానధర్మము లొనరించెను. బ్రాహ్మణుల కనేకాగ్రహారములు దానము చేసెను. రుక్మిణీ పరిణయమను ప్రబంధమును కృతిపొందెను. ఈ విషయములు శ్రీకృష్ణ విజయములోని క్రింది పద్యమున వివరింపఁబడినవి.

సీ. 'తనయులఁ గాంచె సు త్తమ వధూమణులందు,
ధనము నిక్షేపించె ధర్మయుక్తి,
నగ్రజన్ములకు మహాగ్రహారము లిచ్చె,
నర్హ వైఖరి వివాహములు చేసె,
భాసుర రుక్మిణీ పరిణయాఖ్య ప్రబం
ధమునకు నాయకత్వము వహించె,
వితతాంబు పూరపూరిత తటాకంబులు
సుద్యానములు నిల్పె నుర్వియందు,

గీ. నరులకుఁ గోర్కెలొసఁగెఁ బ్రత్యర్థులైన
దండిమన్నీలఁ దలచూపకుండఁ దఱిమె,
భువిని కీర్తుల విలసిల్లెఁ బూసపాటి
రాచభూపాలకుని కృష్ణరాయ నృపతి.'

ఈ పద్యమునఁ జెప్పఁబడిన రుక్మిణీ పరిణయ ప్రబంధమునకుఁ గృతికర్త యెవ్వరో తెలియదు.

ఈ కృష్ణభూపాలుని యనంతర మితని పుత్రుఁడగు గోపాల ప్రభుని మనుమఁడు తమ్మిరాజు సుప్రసిద్ధుఁడు. ఈతఁడు విద్వత్కవిపోషకుఁడే కాక స్వయముగా విద్వత్కవి. ఇతఁడు శ్రీకృష్ణవిజయ మను ప్రబంధమును బెజవాడలోని కనకదుర్గ కంకితముగా రచించెను. ఈ తమ్మి భూపాలుఁడును, ఇతని సవతి యన్నయగు అన్నమరాజును రాజ్యమును పాలించినట్లు తెలియుచున్నది. ఈ 'అన్నమరాజు'ను 'చక్రవర్తి' యని తమ్మి భూపాలుఁడే శ్రీకృష్ణ విజయమునఁ జేర్కొనెను. అన్నమరాజు ప్రశంస ఉషాభ్యుదయమునందును

సీ. 'ఘుమఘుమామోదసంకుల ఫుల్లమల్లికా
స్వచ్ఛగుచ్ఛమ్ముతో సరసమాడి,
లోలపయోధికల్లోల జాలాభీల
కోలికాపాలి నుయ్యాలలూఁగి,
శరదాగమారంభ సంపూర్ణ పూర్ణిమా
స్ఫురితచంద్రికలతోఁ బొందుచేసి,
దిక్కాంతినీమహోద్దీప్త సత్ప్రభాభార
హారతారకలలో నసఁగి పెనఁగి,

గీ. పొలుచు నెవ్వాని యశోరామ భూరికీర్తి,
యతఁడు త్రైలోక్యరాయ వేశ్యాభుజంగ
సంగరాంగణ విజయ నిశ్శంకబిరుద
బాహుబలకేళి యన్నభూపాలమౌళి.'

అని కలదు. ఈ యన్నమరాజే ప్రధాన శాఖలోని వాఁడై యుండవచ్చును. ఇతఁడు, కృష్ణానదీ తీరములో నున్న కేతవరము రాజధానిగాఁ బశ్చిమరాజ్య మేలు చున్నట్లు కానిపించును.

విజయనగరము సంస్థానమునందలి పాకీఖత్తు (యథార్థ పత్రము) లలో – పూసపాటి సీతారామచంద్ర మహారాజు తమ్మిరాజును పెంచుకొన్నట్లున్నది. ఈ సీతారామచంద్రు లను గురించిన వృత్తాంతము – కటకపుర ప్రభువులతో బంధుత్వమును నెరపిన బసవరాజుగారి చరిత్రలోఁ గాన వచ్చుచున్నది. ఈ సీతారామచంద్రులు పశ్చిమమునుండి తూర్పునకు వచ్చి కళింగదేశములోఁ జేరియున్న విజయ నగర రాజ్యమందలి కుమిలి, భోగాపురము మున్నగు

పరగణాల నేలుచుండిరి. ఈయన దత్తపుత్రుఁడగు తమ్మిరాజు విజయనగర సంస్థానమునకుఁ బ్రభువయ్యెను.

"అన్నమరాజునకు సీతారామరాజను నొక పుత్రుఁడు కలిగెను. కాని కొంచెము కాలము రాజ్యము చేసి యతఁడు మరణించెను. అందువలన నతని పిత్రార్జితమగు రాష్ట్రము కూడ తమ్మిరాజునకే స్వాధీనమయ్యెను. కాని, తమ్మిరాజు కళింగదేశమును విడిచి కృష్ణానదీతీరమునకుఁ బోయి యుండని కారణమున ఆ రాష్ట్రము న్యాక్రాంతమై యుండును. ఈ వంశస్థులకు విజయనగర రాజ్యమే మిగిలినది." ఈ యంశము శ్రీ గురుజాడ - శ్రీరామమూర్తిగారి వ్రాఁతవలనఁ దెలియుచున్నది.

తమ్మిభూపాలుని రాజ్యవైభవ మీ క్రింది రీతిని వర్ణితము.

సీ. శ్రుతులందు నధికవిశ్రుతులందు సర్వేసు
పర్వవర్గంబు లాశీర్వదింపఁ,
గృతులందు ఘనచమత్కృతులందుఁ గవివరుల్
మృదుల కావ్యంబుల మేలు దెలుప,
మతులందు సకలసమ్మతులందు మంత్రులు
వివిధకార్యస్థితుల్ విన్నవింప,
నతులందుఁ గౌతుకోన్నతులందుఁ బరరాష్ట్ర
పతులు సేవాకాంక్షఁ బరిచరింప,

గీ. భటులు బిరుదాంకపఠనారభటులు వీర
భటులు శాత్రవభంజనోద్భటులు పోస్య

పటులు పరతోమఁజాదిలంపటులు చటుల
నటులు సుర అమ్మహేంద్రుఁ గన్నటులు కొలువ.

.........................................

సీ. చంద్రాననా కరచామరద్యుతులఁ ద
ద్దరహాసరుచులను దడఁబడంగ,
ప్రణతారిమకుటహారప్రభల్ పదనఖ
చ్ఛాయలు నిర్విశేషత వహింప,
ధర్మపాంచాలికా ప్రకరంబు సేవక
ప్రమదాజనంబు నైక్యము భజింప,
బహుళకర్పూరదీపప్రభల్ జనవస్త్ర
ధాళధళ్యమున భేదంబు నొంద

గీ. కడిఁది వేల్పులు భజియింపఁగా సుధర్మ
యందు వసియించినట్టి పురందరుండె
యితఁడనుచు నద్భుతాంభోధి నీఁదు మనుజు
లెన్నఁ గొలుగమ్మన నున్న వేళ.'

ఈ తిమ్మభూపాలునికి రఘునాథరాజు, మాధవవర్మ అను నామాంతరము లుండినట్లును, ఇతఁడు గోలుకొండ నవాబువద్ద సరదారుగా ఉండి, కుమిలి, భోగాపురములను కొలువకుఁ దీసికొని రాజ్యము పాలించుచుండినట్లును, ఇతని యనంతరము ఇతని కుమారుఁడైన సీతారామచంద్రుఁడు రాజ్యాధికారమును స్వీకరించి కుమిలి రాజధానిగా పాలన సాగించుచుండినట్లును 'విజయనగరదర్శిని' లోఁ గలదు. సీతారామచంద్రరాజే తిమ్మరాజును దత్తపుత్రునిగా గ్రహించెనో, లేక తిమ్మరాజునకే యితఁడు కుమారుఁడో తెలియ

కున్నది. అన్నమరాజపుత్రుఁడగు సీతారామరాజే యీ సీతారామచంద్రుఁడని 'శ్రీరామతీర్థ చరిత్ర'లో నున్నది. శ్రీకృష్ణవిజయమున నితనిఁగూర్చి

'సీ. ఆసేతుసీతాచలాంచితఖ్యాతి నా
యగ్రజుండైనట్టి యన్ననృపతి
.............................
ఘనగుణాభిరాముఁ గాంచె సీతారాముఁ
డను కుమారుఁ గాంచనాద్రిధీరు.

క. సితపక్షచంద్రువైఖరిఁ
బ్రతిదినమును వృద్ధిఁగాంచు భాగ్యవిశేష
న్నతుఁడై సీతారాముఁడు
మతిమంతుఁడు చారుకీర్తి మహిమన్ వెలసెన్.'

అని చెప్పఁబడి యున్నది, ఇతఁడు చక్రవర్తిగాఁ బరిగణింపఁబడి, పెక్కు మంది రాజులను సామంతులుగా నొనర్చుకొని, పెక్కు విజయములు గ్రహించి యనన్యసామాన్య పరాక్రమశాలి యని పేరొందెను. ఈ మహారాజుఁ గూర్చి శ్రీరామతీర్థ చరిత్రలో నిట్లున్నది —

"శ్రీ అన్నంరాజా మహారాజావారి కుమారులగు శ్రీ సీతారామచంద్రమహారాజావారు, 1672_1676 సం॥లో జయపురమును పాలించిన విశ్వంభరదేవునకును, 1676_1681 సం॥ నున్న మల్లికీ మర్దనదేవునకును, 1681_1684 సం॥ లోని హరిదేవునకును సమకాలీనులై యుండి, విశేష బలపరాక్రమములు కలిగి 1686_వ సంవత్సరమువరకు కమిలికోటలో నుండి పాలించుచుండిరి. ఈతఁడు విష్ణుభక్తుఁడు, సుస్ఫురద్రూపి, చాల కాలము రాజ్యమును పాలించినవారిలో నొకఁడు. ఈతఁడు అధిక బలో

న్నటు:డై పొట్నూరు మున్నగు సీమలనే గాక జయపురమునందలి గాడిగడవరకును గల రాజ్యము నంతటిని యాక్రమించ నిశ్చయించుట చేత జయపురాధీశ్వరుడగు విశ్వంభరదేవు తన రాజ్యసంరక్షణార్థము కురుపాముకు వైరిచక్ర అను బిరుదముతో సన్యాసి దొరకును, మేరంగికి శత్రుశల్య అను బిరుదముతో జగన్నాథ దొరకును, మక్కువను అరిచర్ల అను బిరుదముతో నొకనికిని, పాచిపెంటను దక్షిణకవాట దుర్గరాజు బిరుదముతో త్యాడి తిమ్మన్న దొరకును. ఆండ్రను ప్రతాపరాయ బిరుదముతో కిమ్మూరివారి జ్యేష్ఠునకును, రామభద్రపురమును రణభీమ బిరుదముతో కిమ్మూరివారి కనిష్ఠునకును, చెముడును రణసింహబిరుదముతో నొక్కనికిని, పాలెమును పాత్రాధికారముతో జోగికిని, పోరామును పాడురాయబిరుదముతో దీనబంధునకును, రేగులవలసను మంగరాజు బిరుదముతో హరిహరరాయనికిని, కోడూరును ప్రాడ్వివాక బిరుదముతో వాసిరాయనికిని, శంబర, బొండపల్లెలను ధరాఖండలబిరుదముతో పీతాంబరమణిరాయనికిని. కలహండిని యుగసాయి బిరుదముతో కల్యాణ రాజకుమారునకును, ఖడియాలను కుమారపురీమహాపాత్రునకును, సవ్వా గడను నీలకంఠేశ్వరునకును యొసంగి జమీలనేర్పరచినట్లు జయపుర చరిత్ర చెప్పుచున్నది ఇంతియేగాక మాడుగుల కృష్ణభూపతి తన కనిష్ఠుడగుటచేత నతనికి ప్రతిగ మూకావారికి గానతులాశంభు భూపతి యను బిరుదముతో మాడుగుల నొసగెను. ఈ జయపురాధీశ్వరు డగు విశ్వంభరదేవు కమిలిపురాధీశ్వరునితోను, శ్రీకాకుళ ఫౌజు దారునితోను కలహించుచుండెను. సీతారామచంద్రరాజు అదను చూచు కొని జయపురరాజ్యములోని కొంతభాగము నాక్రమించెను. సీతారామ చంద్రుని ప్రతాపము, కీర్తి గోలుకొండ దాటి ఢిల్లీవరకు వ్యాపించినది. 1687 సంవత్సరమున ఔరంగజేబు గోలుకొండపై దండెత్తి వచ్చి, గోలుకొండనవాబును ఖైదుచేసిన సమయమది! ఆ సమయముననే తన సర్దారులలో ముఖ్యులును, బలవంతులును నగు శ్రీ పూసపాటి సీతా రామచంద్రరాజు మహారాజావారికి 'జుల్ఫికార్' అను రెండంచులు గల

కత్తిని యారంగజేబు బహుమానముగ నిచ్చెను. ఆ కత్తి యిప్పటికిని శ్రీ పూసపాటివారి ధర్మసంస్థానమున కలదు. దాని చిహ్నమే విజయనగరకోటబురుజు జెండాపై చిత్రింపబడినది. అప్పటి శ్రీకాకుళ ఫౌజుదారుడు ముస్తఫా ఖులీఖానుడు శ్రీ పూసపాటి మహారాజులయెడల సగౌరవముగ ప్రవర్తించకపోవుటచేత శ్రీ సీతారామచంద్ర మహారాజావారు 1691 సంవత్సరమున శ్రీకాకుళముపై దండెత్తి ఖానుని బూర్తి నోడించిరి ........పై నుదాహరింపబడిన అనన్యసామాన్య బలపరాక్రమశాలురగు శ్రీ సీతారామచంద్ర మహారాజావారు 1650-1693 సం॥ వరకు కుమిలి కోటలో నుండి రాజ్యమును పాలించిరి."

[శ్రీ గంటి - సూర్యనారాయణశాస్త్రిగారి శ్రీరామతీర్థచరిత్ర పుటలు 12-14]

సీతారామచంద్ర రాజుగారికి అన్నంరాజు, తమ్మిరాజు అని యిరువురు కుమారులుండిరంట ! సీతారామచంద్ర రాజుగారు 1693-వ సంవత్సరమున కీర్తిశేషులు కాగా, అన్నంరాజుగారు రాజ్యమునకు వచ్చి పరిపాలన సాగించుచు, రాజమహేంద్రవరము సర్కారులోని తొఱ్ఱిగడ్డవద్ద జరిగిన యుద్ధములో మరణించిరి. తరువాత తమ్మిరాజుగారు మూడేండ్లు మాత్రమే రాజ్యము చేసి మరణించిరి.

తమ్మిరాజుగారికి సంతానము లేదు. ఆయన తమ జ్ఞాతివర్గములోని గోపాలరాజుగారి కుమారులగు ఆనంద రాజుగారిని దత్తపుత్రునిగా గ్రహించిరి. ఆ యానందరాజు గారి జ్యేష్ఠసోదరులు వెంకటపతిరాజుగారు. అన్నగారియెడల ఆనందరాజుగారికి భక్తి, గౌరవము మిక్కిలి యెక్కువగా నుండెను. ఇరువురును విద్వత్కవులు. వెంకటపతిరాజుగారు 'ఉమాభ్యుదయము' అను ప్రబంధమును రచియించిరి,

ఆనందరాజుగారు 'నవరామాయణ' మను ప్రబంధమును రచించినట్లు

'ఆనందనృపతి చిదానందమూర్తియై
రామునిపై భక్తి రాజిలంగ
శ్రుతిపద్యము మనోహరముగ శోభిల నవ
రామాయణంబను రమ్యకృతిని
రచియించి యర్పించె రామచంద్రునకు.'

అను కూర్మపురాణములోని పద్యభాగమువలనఁ దెలియుచున్నది.

ఈ యానందరాజుగారు సర్కారులను తన యన్నగారిపేరనే నిర్ణయించి, యాయననే పరిపాలకునిగా నేర్పఱచి, తా నాయనకు దివానుగా నుండి రాజ్య వ్యవహారములను జూచికొనుచుండిరి. ఆనందరాజుగారు చిన్న చిన్న రాజ్యములను పెక్కింటిని జయించి తమ రాజ్యమును వృద్ధిపఱచిరి. ఈయన మన్యములను జయించుటవలన హైదరాబాదు నవాబు 'మన్నె సుల్తాన్' బిరుదు నొసంగి ఈయనను గౌరవించెను.

శ్రీ వెంకటపతిరాజుగారు విజయనగరమునకు సమీపమునఁ గల కొట్టాము అను గ్రామమును 'వెంకటపతిరాజపురము' అను పేరితో అగ్రహారముగాఁ జేసి బ్రాహ్మణులకు దానము చేసిరి. శాలివాహన శకవర్షములు 1687 అగు శ్రీ మన్మథనామసంవత్సర వైశాఖ శుద్ధ 15 సోమవారమున ఈ దానము చేయఁబడినది. ఆ దానశాసనమున నీ క్రింది శ్లోకములు కానవచ్చుచున్నవి.

'శ్రీమాన్ వేంకట భూపతిః శ్రితనిధిః శ్రీ పూసపాట్యన్వయః
స్మార్తేభ్యో నిఖిలార్థవిద్భ్య ఉరుధీః శ్రీవైష్ణవేభ్యో దదౌ,
చత్వారింశత మంశ మూర్జితతమం కొట్టాము సంజ్ఞం పురం
కృత్వా వేంకటరాజపట్టణమితి ప్రఖ్యాత మూర్త్యాం సదా.
ఏకైవ భగినీ లోకే సర్వేషా మపి భూభుజామ్,
న భోజ్యా న కరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా.
స్వదత్తా దుహితా చైవ పితృదత్తా చ సోదరీ,
అన్యదత్తా చ మాతా స్యా ద్విప్రదత్తా వసుంధరా.'

తన కనిష్ఠ సోదరుఁడును, రాజ్యాధికారియు నగు ఆనందరాజు యువకుఁడై యున్నందున, అతనికి మంచి యనుభవము లభించువఱకును వెంకటపతిరాజుగారే ఆధిపత్యము వహించి రాజ్యపాలనమును సాగించుచుండినట్లును, ఆనందరాజుగా రన్ని విధముల సమర్థులైన పిదప, రాజ్యాధికారము నాతని కప్పగించి, తాము కొట్టాము (వెంకటపతి రాజపురము) నకుఁ బోయి, అచ్చటనే తమ జీవిత శేషమును గడపినట్లును కొన్ని చరిత్రములవలనఁ దెలియుచున్నది.

ఆనందరాజుగారు కుమిలిలో నుండియే రాజ్యమును పాలించుచుండిరి. అక్కడ వీరి కొక మట్టికోట యుండెడిది. ఈయనకుఁ దఱచుగా మహమ్మదీయులతోఁ బోరాటములు సంభవించుచుండెడివి. అందువలన భద్రతకయి విశాలమును, అత్యున్నతము నగు నొక రాతికోటను ప్రస్తుతపు విజయనగర మున్న స్థలములో నిర్మింపవలెనని నిశ్చయించి, తన్నిర్మాణమును 1712-వ సంవత్సరముననే ఆనందరాజుగారు ప్రారంభించిరి. దీని శంకుస్థాపనము విజయ సంవత్సర

విజయదశమి జయవారమున జరిగినదంట ? కాని, యీ దుర్గ నిర్మాణము పూసపాటి వారి పూర్వులే 1717-వ సంవత్సరములో [illegible] ప్రారంభము చేసిరి. తర్వాత ఈయన కుమారులగు విజయరామ గజపతిరాజుగారి కాలములో దుర్గ నిర్మాణము [illegible] విజయనగర [illegible] పట్టణ మేర్పడినది.

ఈ విషయమై [illegible] కార్మైకేలు దొరగారి 'విశాఖపట్టణ మండల వృత్తాంత సంగ్రహము'లో నిట్లున్నది-

“[illegible] కాలము రాజ్యము చేసిరి. రాజరిక [illegible] విడచి ప్రస్తుత విజయనగరపట్టణమున్న ప్రదేశమునకు వచ్చి ప్రతికోణమునందున నొక పెద్ద బురుజుగలిగి, చతురస్రాకారముగ శిలానిర్మితమగు నీ కోటను గట్టించిరి. ఈ దుర్గము ప్రారంభించు సమయమందు జయశబ్దాలగు నయిదు విజయ శబ్దములు సమకూడిన ట్లాలోచించినటుల తెలియవచ్చినది. అనగ — [illegible], విజయనగరము, 1713 సం॥ తో సమమగు విజయ సంవత్సరమునందు దసరాలో విజయదశమి జయవారంనాడున పునాదులు వేయుటయు జరిగినది.”

[శ్రీ విజాపురపు - వెంకట కోదండరావుపంతులుగారి తెలుగు తర్జుమా పుట 502]

పయి వ్రాంత నాధారము చేసికొని 'అడిదము - సూరకవి జీవితము'ను రచించిన శ్రీ అడిదము - రామా రావుగారు “...ఈయన యనంతరమున నానందరాజుగారు పరిపాలనమునకు వచ్చిరి. ఈయన పుత్రులు విజయరామ రాజుగారు బహు ప్రసిద్ధపురుషులు! ఈయన సామంత దొరలను గెలిచి, వారి దేశము లాక్రమించుకొని మన్నె

సుల్తాను బిరుదంది, పోట్నూరినుండి తన పేరిట విజయనగర మను పేరం బరగిన యూరికి రాజధానిని మార్చుకొని 1712-వ సంవత్సరమునకు సరియైన విజయ సంవత్సర విజయ దసమీ జయవారమునాఁడు కోట కట్టుటకు శంకుస్థాపనము చేసెను." (మా. పుట 42) అని వ్రాసి యున్నారు.

కాని, 1712-వ సంవత్సరమునకు ఆనందరాజుగారు జీవించియే యున్నారు. నుఱి అయిదేండ్లకుఁగాని ఆయన కీర్తిశేషులు కాలేదు. ... కోట శంకుస్థాపన యీయన వల్లనే జరిగియుండవలెను. చరిత్రాంశముల నెఱుఁగని జనుల వాడుకనుబట్టియు, తాము విన్నదానింబట్టియు, కార్నేకిల్ దొరగారు పయికథని వ్రాసి యుండవచ్చును. తర్వాతి చరిత్రకారులు కొందరు గతానుగతికముగ ఆ వ్రాఁతనే ప్రమాణముగా గ్రహించి కూడ నుండవచ్చును.

వెంకటపతిరాజుగారికి సీతారామరాజను కుమారుఁడుండెను. ఆనందరాజుగారి కుమారుఁడు విజయరామరాజు. వయస్సులో సీతారామరాజు పెద్ద. విజయరామరాజు మిక్కిలి చిన్నవాఁడు. ఆనందరాజుగారు తన కుమారుఁడు రాజ్యమును పాలింప సమర్థుఁడు కాఁడని తలఁచి, అన్నకుమారుఁడగు సీతారామరాజునకే తన మరణమునకు ముందు రాజ్యాధికారము నిచ్చెను. ఈతఁడు సార్వభౌముఁడని ప్రసిద్ధి చెందినట్లు 'విష్ణుభక్తి సుధాకరము' నందలి క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. 'అచ్యుతకృష్ణ ప్రపయ్య ననుజన్ముఁడైనట్టి
వేంకటపతి మహావిభుఁడు ఘనుఁడు
సుజనబుధావనపరాక్రమాఢ్యుఁడు కృపా
పరుఁ డుమాభ్యుదయ ప్రబంధముఖ్య
సంతానవిసరలాంఛనుఁ డతఁ గొట్టెము
పల్లెల కేశరాజాఖ్యు కూతురైన
రాజమాంబా పతివ్రతయందుఁ గాన సార్వ
భౌమ సీతారామ పార్థివేంద్రుఁ.'

ఈ సీతారామరాజుంగూర్చి 'శ్రీరామతీర్థ చరిత్ర ము'నం దీ క్రిందివిధముగ వ్రాయఁబడినది.

“ఆనందరాజ కుమారులగు శ్రీ విజయరామరాజు గారు కాలుగుటచేతను, శ్రీవేంకటపతి మహీపతి కుమారులగు శ్రీ సీతారామ సార్వభౌములు కుంభిళాపురమున రాజ్యపాలనము చేయ నారంభించిరి. ఈ సార్వభౌముఁడు విశేష వినయ విధేయతలు గలిగి, కులదేవత యగు బెజవాడ శ్రీ కనకదుర్గా మహాదేవియందు సదా తమ మనఃకంజము నుంచి, భక్తి కైంకర్యములను జేయుచు, ఆత్మ సాక్షాత్కార ప్రయత్నమున నుండుచుండిరి. ఈయన మహా తపశ్శాలియే గాక సత్యసంధుఁడై యుండెను. ఈ సీతారామ సార్వభౌముడు తన స్నానోదకముచే నొక బ్రాహ్మణునికిఁ గలిగిన కుష్ఠువ్యాధిని పోఁగొట్టినట్లు యీ క్రింద నుదహరించిన విష్ణుభక్తి సుధాకర గ్రంథ పద్యము చాటుచున్నది.

శా. శాతాసిం బరుఁ ద్రుంచు కైవడి నిజస్నానార్ద్ర వస్త్రోదక
ఖ్యాతిం గుష్ఠరుజార్తి నార్తి గడపెన్; ధాత్రీవల్లభుల్ సాటియే ?

శ్రీతస్వీధవు(డేమొగాక ! యన ధాత్రీమండలంశేలె, నా
సీతారామనృపాలు నెన్న(దరమే శ్రీవేంకటాధీశజాన్."

ఈ సీతారామరాజుగారు యుద్ధమునకు( బోయి నప్పుడు కిమిడిదేవువారి సఖ్యమును పొందిరి. వారివల్ల కొంత భూమిని పుచ్చుకొనిరి. ఆ కాలమున శ్రీకాకుళములో మకాము చేసియున్న నిజాము నవాబు మంత్రి యీ సీతారామరాజుగారి శక్తిసామర్థ్యములను గుర్తించి కొన్ని పరగణాలను కౌలున కిచ్చెను.

ఆనందరాజుగారి కుమారు(డు విజయరామరాజు రాజ్య కార్యనిర్వహణ దక్షు(డైన పిదప, సీతారామరాజు గారితోపా టత(డును, నిజాము నవాబువలన పట్టాలను పొంది అధికారము జరుపుచుండెను. కాని, వీ రిరువురికిని అభిప్రాయ భేదములు కలిగినందున విజయరామరాజు రహస్యోపాయమున సీతారామరాజుగారిని జంపించెనని శ్రీ గురుజాడ - శ్రీరామమూర్తిగారు శ్రీకృష్ణవిజయ పీఠికలో( దెలిపి యున్నారు. కాని, సీతారామరాజుగారు యుద్ధములో ప్రతాపగిరి దుర్గాధ్యక్షునివలన సంహరింప( బడిరని కూర్మ పురాణమున( గలదు. సీతారామరాజుగారి మరణానంతరము విజయరామరాజుగారు ఆ సోదరుని పుత్రు(డును, రెండేండ్ల బాలు(డును అగు ఆనంద గజపతి రాజును మిక్కిలి ప్రేమతో( జూచుచుండిరి. కావున, శ్రీరామమూర్తిగారి వ్రాత సత్యదూరమై యుండవచ్చునని తో(చుచున్నది. ఆయనకు( గూర్మపురాణము ప్రమాణ గ్రంథము కూడ.

[illegible] రాజ్యమునకు వచ్చువఱకును [illegible] కలిగిన రీతులం గానవచ్చుచున్నవి. [illegible] రాజ్యమునకు వచ్చినప్పటినుండియుం గల [illegible] కాన్మైకిల్ దొరగారు వ్రాసిన [illegible] జిల్లా వృత్తాంత సంగ్రహము'లో [illegible] రాజ్యమునకు వచ్చువఱకును గల వృత్తాంత [illegible] —

[illegible] సంవత్సరములో రచియింపఁబడినటుల [illegible] శ్రీకృష్ణవిజయమను ప్రబంధమువలన వశిష్ఠ, [illegible] గోత్రములు గల నాలుగు తెగల రాజులు, క్రీస్తుశక [illegible] సంవత్సరమునకు సరియగు శాలివాహనశకముయొక్క [illegible] సంవత్సరములో మాధవవర్మగారితోఁగూడ తెలింగణానికి వచ్చినారని [illegible] ఈ మాధవవర్మగారు తమ వంశమునకు మూలపురుషులని విజయనగరమువారు తెలియజేయుచున్నారు. [illegible] శ్రీ విజయనగరమహా రాజావారిని తమ ప్రభువులుగ భావించుచున్నమాట నిజము.

౩. ఈ రాజపుత్రులు కాలక్రమమున నొక చిన్నరాజ్య మేర్పరచు [illegible] కృష్ణాప్రాంతమందు బెజవాడలో నివసించిరి. కులబరగా, బీదరు అను పట్టణములలో దక్కనుదేశపు బామానీరాజులు (వీరు తురుష్కులు) దొరతనము నేర్పాటుచేసికొనుటవలనను, అందుమూలమున వరంగోలను పట్టణము రాజధానిగా గల ప్రాచీన తెలుగు రాచరిక మంతరించుట వలనను, వీరి యునికితనమున కేమియు లోపము కలుగలేదు. కాని తెలింగాణాదేశములో నుండెడు తక్కిన ముఖ్యులగు జమీందారులతో పాటు వీరును గోలకొండలో కుతుబుషాహి రాజవంశమునకు మూలపురుషుడగు సుల్తాను కులీవారియొక్క యధికారమునకు లోబడిరి. ఆ

వంశస్థులలో శాళ్వరాజగు ఇబ్రహీము తెలుగువారిని విస్తారముగ తన సేనలలో జేర్చుకొనడపు పద్ధతి నవలంబించినప్పుడు విజయనగరవంశజులగు ముఖ్యులాయన యిలాకా యుద్యోగములలో ప్రవేశించి, గోలకొండ సర్కారులో ప్రసిద్ధులగు సర్దార్లుగా నుండిరి. వీరిలో మాధవవర్మ యను నాయన యత్యంత ప్రసిద్ధుఁడవాఁడు. ఆయన కొండపల్లి సర్కారులో పూసపాడను గ్రామమునందు నివసించి యుండుట చేత పూసపాటివారను పేరు గలిగినది. అయితే చంద్రవంశస్థులతో క్షేమించియున్న సూర్యవంశస్థులను యుద్ధమిచ్చు "పూసవాట్" అను సంస్కృతశబ్దమువలన నీ సంజ్ఞ కలిగినటుల నొక తెలుగు కవీశ్వరుడు తెలియజేసి యున్నాడు. యేలాగునైతేనేమి, ప్రస్తుతము పూసపాటివారి వంశనామమై యున్నది.

౩. పూసపాటివారి వంశములో మాధవవర్మగారు మొదట, అప్పుడు శ్రీకాకుళం సర్కారులో నొక భాగముగ నుండు విశాఖపట్టణజిల్లా లోనికి వచ్చిరి. ౧౬౫౨ సంవత్సరములో నసగరాజగు నవురంగజేబు వారివలన గోలకొండరాజవంశము నశింపు చేయబడక పూర్వము ౩౫ సంవత్సరములకుముందుగ నాయన వచ్చుట జరిగినది. అప్పటిలో షేరు మహమ్మదుఖాన్ శ్రీకాకుళములో ఫవుజుదారుగా నుండెను. ఆయనయొద్ద మాధవవర్మగారు కుమిలె భోగాపురములు నిజారా జేసిరి. ఆయన యనంతరము ఆయనకుమాళ్ళగు సీతారామచంద్రులవారికి తాలూకాలకు కవులు పుట్టినవి. సీతారామచంద్రులవారు మరి పదితాలూకాలు కూడ నిజారా జేసి ౧౭౧౨ సంవత్సరమున ౪౫౦ కాల్బలములో కూడుకొనియున్న పరివారముతోగూడ పొట్నూరులో నివాసము జేసిరి. పర్లాకిమిడి గజపతి దేవుగారితో సఖ్యము జరిగినందున సీతారామచంద్రులవారికి విశేషఘనత కలిగెను. సీతారామచంద్రులవారు మొదలుకొని మొసీయు బుస్సీ గారికి విహితులగు పెద్దవిజయరామరాజుగారివరకు నయిదుగురు రాజులయ్యుండిరి. వీరిలో ప్రతివారు తమ వంశముయొక్క ఘనతను క్రమక్రమముగ వృద్ధిచేసినందున పూసపాటివారు మిక్కిలి బలిష్ఠులై యుండిరి.

[౭-వ అధ్యాయము, పుటలు ౫౦౦-౫౦౭]

విజయనగర సంస్థాన చరిత్రలోఁ బేరువడిన ప్రభువులలో విజయరామరాజుగారు ముఖ్యులు. అప్పటి శ్రీకాకుళము సర్కారులలో గొప్ప బలవంతులు! ఈయన విజయనగర దుర్గ నిర్మాణమును పూర్తి గావించి, రాజధాని నచటికి మార్చుకొనిరి. క్రొత్తగా నిర్మింపఁబడిన పట్టణమునకుఁ దమ పేర 'విజయనగర' మని నామమిడిరి. సువర్ణ చ్ఛత్రము వర్తించుకొనిరి. విజయరామ యశోభూషణమను సంస్కృత కావ్యమును కృతినొందిరి. ఆ కాలమున కృష్ణానది పర్యంతము గల రాజ సంస్థానములు పెక్కు యవనుల కాకిడివలన అలము లైపోఁగా, శత్రువులపైకి దాడి వెడలి, వారి నోడించి, మరల నా సంస్థానములను నిలిపిరి. ఇట్టివానిలో పెద్దాపుర సంస్థానము ముఖ్యమయినది. దానిని జయించి, యీ ప్రభువు జగపతిరాజునకుఁ బట్టము కట్టెను. నిజాము ప్రభు వీయనను రాజప్రతినిధిగా నియమించి, మీర్జా, మన్యసుల్తాన్ మున్నగు బిరుదముల నొసఁగి గౌరవించెను, అందువలన ఈయనకు ఉత్తర - సర్కారులలో బలము, పలుకుబడి హెచ్చెను. వ్యాపార దృష్టితో భారత దేశమునకు వచ్చిన యాంగ్లేయు లీ ప్రభువు నాశ్రయించి బెండమూరులంక మున్నగు చోట్ల ఫ్యాక్టరీలను కట్టుకొనుట కనుమతిని సంపాదించిరి.

ఇట్లుండఁగా 1753 లో, అప్పటి నైజాము నవాబగు సలాబత్ జంగ్ ప్రభువు ఫ్రెంచి సేనాధిపతి యగు బుస్సీ దొరకు ఉత్తర సర్కారులను ఇచ్చెను. దీనివలనఁ దమ పరిస్థితి చిక్కులలో పడునని విజయరామరాజుగారికి సందే

హాము కలిగెను. శ్రీకాకుళములో అధికారిగా నున్న జాఫర్ అల్లీ అనునతనికిని, బుస్సీ నీ ప్రాంతమునకు రాకుండఁ జేయ వలెనను సంకల్పము కలిగినందున, అతఁ డీ కార్యములోఁ దనతోఁ జేరవలెనని విజయరామరాజుగారిని కోరెను. ఇట్టి స్థితిలో విజయనగర ప్రభుని బల పరాక్రమములనుగూర్చి బాగుగాఁ దెలిసికొన్న ఫ్రెంచి సేనాధిపతి రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులు రెండింటిని ఈయనకు తక్కువ కౌలున కిచ్చివేసెను. లేనియెడల ఆ ప్రాంతమునఁ దన యధికారము చెల్లదని బుస్సీ బాగుగా గ్రహించెను.

మోన్సియరు బుస్సీద్వార తన కనుకూలముగా ఉన్నందున విజయనగర ప్రభువు జాఫర్ అల్లీ మైత్రిని విడిచిపెట్టెను. జాఫర్ అల్లీ మిక్కిలి భయపడి, తనకు సహాయపడవలసినదని మహారాష్ట్రులకు వార్త పంపెను. దోపిడి చేయుటలో సిద్ధహస్తులైన మహారాష్ట్రులు రఘూజీ భాన్ స్లే నాయకత్వమున వచ్చి యీ సర్కార్లను కొల్లగొట్ట నారంభించిరి. ఆ కాలమున ఆంగ్లేయులకు విశాఖపట్టణములో ఒక ఫ్యాక్టరీయును, డచ్చివారికి భీమునిపట్టణములో నొక ఫ్యాక్టరీయును ఉండినవి. జాఫర్ అల్లీ ఆంగ్లేయుల స్నేహమును కోరియున్నందున విశాఖపట్టణములోని ఫ్యాక్టరీ కెట్టి నష్టము కలుగలేదు. భీమునిపట్టణములోని ఫ్యాక్టరీ పూర్తిగా దోఁచుకొనఁబడినది. మహారాష్ట్రులు కొండలలోని మార్గము ననుసరించి వచ్చుటకు విజయనగర ప్రభువుచేఁ దరిమివేయఁబడిన పాచిపెంట జమీందారు వీరప్పద్వార మార్గదర్శియై మిక్కిలి సహాయపడెను. విజయరామరాజుగారు వారి నెది

రించియుఁ బ్రయోజనము లేకపోయెను. కాని, కొద్దికాలము లోనే ఈయనకు బాసటగా పరాసుసైన్యము వచ్చెను. మహారాష్ట్రులును ధైర్యముతో రాజుగారి నెదిరించిరి. కాని, పరాసువారి ఫిరంగుల దెబ్బకు తాళలేక, తమకుఁ జేతఁజిక్కినంతి సొత్తుతో వెనుకకు మళ్లిరి. ఈ యుద్ధము అనకాపల్లి సమీపమునఁ గల తుమ్మపాల యను గ్రామమున జరిగినట్లు తెలియుచున్నది.

బొబ్బిలి సంస్థానాధిపతులును, వెలమ ప్రభువులు నగు రావు రంగారావుగారికిని విజయరామగజపతిరాజుగారికిని విరోధము. చాలకాలము క్రిందటనే వీరికి వైరము సంభవించినట్లు తెలియుచున్నది. మోన్సియరు బుస్సీ యిప్పుడు తన కనుకూలుఁడై యున్నందున, అతని సహాయమున బొబ్బిలి కోటను ముట్టడించి, విజయమును సంపాదించి, పగ తీర్చుకొనవచ్చునను సంకల్పము విజయరామరాజుగారికిఁ గలిగెను. ఈయన కోరిక ననుసరించి బుస్సీ దొర సేనలతో వచ్చి సాయపడెను. ఉభయసేనలు కలిసి, బొబ్బిలిపై దాడి వెడలి, ఆ కోటను స్వాధీనము చేసికొన్నవి. కాని యుద్ధానంతరము విజయరామరాజుగారు గుడారములో నిద్రించుచుండఁగా, అర్ధరాత్రి సమయమున రాజబంధువగు తాండ్ర పాపయ్య యను వెలమవీరుఁడు రహస్యముగా గుడారములోఁ బ్రవేశించి ఈయనను చంపివేసెను.

విజయరామగజపతి ప్రభువు మరణించినపిదప ఈయన యన్నగారి పుత్రులగు ఆనందగజపతి ప్రభువులకు రాజ్యాధికారము వచ్చినది. విజయరామ గజపతిరాజుగారివలనఁ

దనకు విశేషముగా ఉపకారములు జరిగినందున ఫ్రెంచి సేనాని కాయనపయి ఆదర ముండెడిది. ఆనందగజపతి ప్రభువువలన అట్టివి జరుగనందున తగిన యాదరము నాయన చూపలేదు. ఇది విజయనగర ప్రభువునకుఁ గొంత కోపమును తెప్పించెను. మఱియుఁ దన పినతండ్రిగారి మరణమునకు బుస్సీ దొరయే కారణమనియు, అతనిపయి పగను సాధింపవలయుననియు ఆనందగజపతి నిశ్చయించెను. ఆయన ఫ్రెంచివారిని విడిచి బ్రిటిష్ వారికి సాయపడఁదలఁచెను. బుస్సీదొర కర్ణాటకము నకు బయలుదేరఁగా, ఆనందగజపతిరాజుగారు శ్రీకాకుళ మును స్వాధీనము చేసికొనిరి. విశాఖపట్టణమునకుఁబోయి, మోహరించి. అచటి పరాసు స్థావరములను స్వాధీనము చేసికొనిరి. తగిన సైన్యమును పంపినయెడల, దాని సాయ మున తన సైన్యముతోఁ బోయి నిజాము నవాబు ఫ్రెంచి వారికిచ్చిన ప్రదేశములను స్వాధీనము చేసికొనవచ్చునని చెన్నపట్టణములోని ఆంగ్లేయాధికారులకు వార్త పంపిరి. కాని, యచ్చటనుండి సేనలు వచ్చునను నమ్మక మాయనకు లేదు. ఏలయన చెన్నపట్టణ ప్రాంతములందలి బ్రిటిష్ సేన లప్పుడు కర్ణాటక యుద్ధములో మునిఁగి యుండినవి. అందు వలన ఆనందగజపతిరాజుగారు కలకత్తాలోని ఆంగ్లేయాధి కారులకు పయిరీతి వర్తమానమునే పంపి సైన్యసహాయమును కోరిరి.

ఆ సమయమున బంగాళములో నున్న ఒక్క లార్డు క్లయివునకు తప్ప మిగిలిన యుద్యోగు లెవ్వరికిని ఈ విష యము నచ్చలేదు. క్లైవు దూరదృష్టి కలవాఁడు. అతఁడు

బంగాళమునకు వెళ్లుటకు మునుపు బుస్సీని దక్కనునుండి తఱిమివేయఁదలంచి యుండెను. తన సంకల్పము నెఱవేఱుట కిప్పుడు తగిన యవకాశము లభించినదని యాతఁడు మిక్కిలి సంతసించి కర్నల్ ఫోర్డు నాయకత్వమున కొంత సైన్యమును సర్కారులకుఁ బంపెను. ఆ సైన్యము, ఆనందగజపతి ప్రభుని సైన్యముతో కలిసి రాజమహేంద్రవరమునకుఁ బోవు దారిలో చెందుర్తి యనుచోట పరాసు సైన్యము నెదు ర్కొనెను. ఫ్రెంచి సైన్యము లోడిపోయినవి. పిదప రాజ మహేంద్రవరము వశమయ్యెను. ఆ సమయమున కర్నల్ ఫోర్డుతో విజయనగర ప్రభువునకు తాత్కాలికముగ కొన్ని మనఃస్పర్థ లేర్పడినవి. అందువలన ఆనందగజపతిరాజుగారు వెనుకకుఁ బోఁదలఁచిరి. కాని, ఫోర్డువారు ఆయనను సమా ధానపఱచి, ఆయన సహకారములో 1759 మార్చిలో మచిలీపట్టణమును ముట్టడించెను. అది పరాసులకు ప్రధాన కేంద్రము! అచటనే వారికి బలిష్ఠమగు కోట కలదు. అది స్వాధీనమైనయెడల ఫ్రెంచివారి యధికారము నిర్మూల మగును.

బ్రిటిష్ సేన మచిలీపట్టణమును ముట్టడించు సమా చారము తెలిసి, నిజాము ప్రభువగు సలాబత్ జంగు ఫ్రెంచి వారికి సాయపడుటకై గొప్ప సైన్యముతో మచిలీపట్టణ మునకుఁ బ్రయాణమయ్యెను. కాని, అతని సైన్యము మచిలీపట్టణమును చేరుటకుఁ బూర్వమే ఆ నగరము బ్రిటిష్ సేనాధిపతికి స్వాధీనమయ్యెను. ఆ సమయముననే నవాబు తమ్ముఁడు నిజాం ఆలీ తిరుగుబాటు చేసినట్లు సలాబత్ జంగు

నకు వార్త వచ్చెను. ఆ పరిస్థితిలో ఆంగ్లేయులతో యుద్ధము చేయుట మేలు కాదని తలంచి, అతఁడు మచిలీపట్టణ, నిజాం పట్టణ సర్కారులను, కొండపల్లి సర్కారులో కొంత భాగ మును ఆంగ్లేయుల కిచ్చివేసెను. ఇంతేకాక, దక్కనునుండి పరాసు సేనలను తొలఁగించుటకుఁగూడ సమ్మతించెను. ఇట్లు విజయనగర ప్రభుని సంకల్పము చాలవఱకు నెఱవేఱినది.

పెద్దాపుర సంస్థానాధిపతి వత్సవాయి – రాయజగపతి వర్మ ఫ్రెంచివారిమెడలఁ గొంత యభిమానమును చూపెను. కావున ఆనందగజపతి ప్రభువునకు అతనితో నుంటూరివద్ద యుద్ధము సంభవించెను. అందు రాయజగపతివర్మ యోడి పోయెను. కాని, స్ఫోటకము తగిలి ఆనందగజపతి ప్రభువు 1760–వ సంవత్సరమున రాజమహేంద్రవరముననే కీర్తిశేషుఁ డయ్యెను.

ఆనందగజపతి ప్రభువు బుస్సీని ఉత్తర సర్కారులలో నిలువకుండ తరిమివేసెననియు, తన భుజశక్తిచే యవనులను, పరాసులనుగూడ ఓడించెననియు, ఆంగ్లేయులతో స్నేహము చేసి, వారికి బందరు రేవుపట్టు లన్నియు నిచ్చివేసెననియు, తన ప్రాపు కోరిన రాజుల నందరిని గౌరవించి, సేనానాయకు లకు సంస్థానముల నిచ్చెననియు, జగన్నాథము మొదలుకొని బెజవాడవఱకును, సముద్రము మొదలుకొని వింధ్యమువఱ కును గల దేశము నంతటిని ఏకచ్ఛత్రాధిపత్యముగ ఏలె ననియు విష్ణుభక్తిసుధాకరమునందుఁ గలదు. మరణించి నప్పటి కీయన వయస్సు ఇరువదియేండ్లఁట !

ఆనందగజపతి ప్రభువునకు సంతానము లేదు. అప్పటికి బొబ్బిలి యుద్ధములోఁ గీర్తిశేషులైన విజయరామప్రభుని భార్య చంద్రయ్యమ్మగారు జీవించియే యుండిరి. కావున, ఇట్టి పరిస్థితిలో ఆమె కిష్టమైన చిన్నవానిని దత్తపుత్రునిగా స్వీకరించుటయే యుచితమని బంధువులందఱును నిర్ణయించిరి. ఆమె, తనభర్తగారి పినతండ్రి కుమారులైన పూసపాటి-రామభద్రరాజుగారి ద్వితీయపుత్రులును, పండ్రెండేండ్ల బాలుఁడు నగు వెంకటపతిరాజుగారిని దత్తత చేసికొని, అతనికి విజయరామగజపతి అని పేరుపెట్టిరి. ఈ విషయము కార్మైకిలు దొరగారి విశాఖపట్టణము జిల్లా వృత్తాంత సంగ్రహములో (పుటలు 3౩౨-333) ఉన్నది. తండ్రికిని, కుమారునకును ఒక్క పేరే యున్నందున, తండ్రికి పెద విజయరామరాజుగారనియు, దత్తపుత్రునికి చిన విజయ రామరాజనియు పేర్లు వాడుకలో ప్రసిద్ధములై యున్నవి.

'విజయనగర దర్శిని'లో నీ వృత్తాంతము వేఱొకరీతి నున్నది. బొబ్బిలి యుద్ధమునకు వెళ్లుచున్న సమయముననే పెద విజయరామరాజుగారు, పరిస్థితు లెటులుండునో యని, తమ భార్య యగు చంద్రయ్యమ్మగారితో 'దగ్గరి బంధువులైన తాళ్ల పాలెం-రామభద్రరాజుగారి కుమారుఁడైన వెంకటపతి రాజును పెంచుకొనవలె'నని చెప్పినట్లు అందు కలదు.

దత్తత జరిగినను, ఆ దత్తపుత్రులకు రాజ్యాధికార మును సంక్రమింపఁజేయుటకు నిజాముప్రభువు ననుమతి కావలెను. ఆ సమయములో హైదరాబాదు నవాబగు

నిజాముల్ ముల్కు రాజమహేంద్రవరములో మకాము చేసి యుండుట నెఱింగి సంస్థానములోని దివానులు గుండాల-అప్పాజీ, బుఱ్ఱా-బుచ్చెన్నగారలు చిన విజయరామరాజు గారిని రాజమహేంద్రవరమునకుఁ దీసికొనివెళ్లి ప్రభువుల దర్శనము చేయించి పట్టాభిషేకమున కనుమతిని సంపాదించిరి.

ఈ చిన విజయరామరాజుగారికి సీతారామరాజను సవతియన్న ఉండెను. జ్యేష్ఠపుత్రుని దత్తునిగా గ్రహించుట సంప్రదాయ విరుద్ధమైనందున చంద్రయ్యమ్మగా రాతనిని దత్తత చేసికొనలేదు. తన తమ్ముఁడుండుటంబట్టియే తనకు రాజ్యాధికారము లభింపలేదను అపోహ సీతారామరాజునకుఁ గలిగెను. అతనికి తమ్మునిపై అపారమగు క్రోధము కలిగెను. కాని, దానిని లోలోపల అణఁగఁద్రొక్కుకొని, తమ్ముని పక్షమున తానే సర్వాధికారములను జరుపుచుండెను. క్రూర స్వభావుఁడగు సీతఁడు కొంతకాలము తన తమ్ముని, చంద్రయ్యమ్మగారిని నిర్బంధమునం దుంచి, తానే యితరులకు ఫర్మానాల నిచ్చుచుండినట్లును, వాని నెవ్వరును లెక్క చేయకపోఁగా, వారి నిర్బంధమును తొలఁగించినట్లును కూడ తెలియవచ్చుచున్నది.

చిన విజయరామగజపతి రాజుగారికి సోదరుని యెడల భయభక్తులు మెండు. కావున అన్నయేమిచేసినను కాదన లేకపోయెడివారు, యుక్తవయస్సు వచ్చి ఈయన రాజ్యాధికారమును స్వీకరించిన పిదపఁగూడ సీతారామరాజుగారి

యధికార మెప్పటియట్లే కొనసాగుచుండెడిది. అతఁడు తొట్టతొలుత దివానులను తప్పించి, తానే దివానుగా వ్యవహరింపసాగెను.

బొబ్బిలి యుద్ధము జరిగినపిదప, ఆ సంస్థానము విజయనగరమునకే స్వాధీనమయ్యెను. అప్పటి బొబ్బిలిరాజగు వెంగళరావుగారు తిరిగి దానిని స్వాధీనముచేసికొనుటకు యత్నింపసాగిరి. సీతారామరాజుగా రొకటి, రెండు పర్యాయములు యుద్ధసన్నాహముతో వెళ్లి యతనిని బెదరించి, రాజాము, కవిటి తాలూకాల నిచ్చి యతనిని సమాధానపఱచిరి. కాని, 1765 లో వెంగళరావుగారు మరణించిన పిదప, సీతారామరాజుగారు బొబ్బిలి వంశస్థులలో సజీవులై యున్న చిన రంగారావుగారిని బంధించి తెచ్చి విజయనగరము కోటలో చెఱయం దుంచిరి. అంతకుఁ బూర్వమునసే సేనలతో పర్లాకిమిడిపైకి దండెత్తి వెళ్లిరి. ఆ సమయమున పర్లాకిమిడి రాజగు నారాయణదేవుగారు జగన్నాథమునకు యాత్రకై పోయి యుండిరి. అందువలన నా రాజ్యము సీతారామరాజుగారికి సులభముగా స్వాధీన మయ్యెను. తర్వాత నారాయణదేవుగారు భట్టోజీ నాయకత్వమున నున్న మహారాష్ట్రసేనలతో వచ్చి విజయనగర సైన్యమును శ్రీకాకుళ సమీపమునఁ గల నరసన్నపేటయొద్ద ఎదిరించిరి. కాని ఆ యుద్ధమునను విజయనగరమువారికే విజయము కలిగెను.

పయి రీతినే సీతారామరాజుగారు పెక్కు కొండ జమీనులను స్వాధీనముచేసికొని, రాజ్యమును విస్తరింపఁ

జేసిరి. ఆయన కాలమున ఉత్తర-సర్కారులలో విజయనగర సంస్థానమే ప్రముఖ స్థానము నాక్రమించి యుండెను.

సీతారామరాజుగారికి పరిపాలనప్రావీణ్య మున్నను, స్వభావము క్రూరమైనది. ఉద్యోగులయెడలను, ప్రజలయెడలను దయాదాక్షిణ్యములు మృగ్యములు! కవి పండితుల యెడల గౌరవము శూన్యము. చిన విజయరామరాజుగారు వదాన్యులే యైనను, అన్నగారు ప్రతికూలురై యున్నందున ఆస్థాన కవులనైనను సత్కరించుట ఈయన కసాధ్యమయ్యెడిది. విజయనగర సంస్థానాస్థాకవియు, శాపానుగ్రహసమర్థుఁడును, సుప్రసిద్ధుఁడు నగు అడిదము-సూరకవి

శా. 'ఢిల్లీలోపల గోలకొండపురి నిండెన్ నీ ప్రశంసల్; గుజాల్
బల్లాలం బొడిపించి హుమ్మని యరబ్బానెక్కి పైకొంచు బా
దుల్లాఖానుని బాఱఁదోలితివి; నీదోశ్శక్తి నూబాలకున్
మల్లింపం దరమౌనె? శ్రీ విజయరామా! మండలాధీశ్వరా!

ఉ. పంతము నీక చెల్లుఁ; నొకపాటి యమీరుఁడు నీకు లక్ష్యమా?
కుంతముఁ గేలఁబూని నిను గొల్వనివాఁడు ధరిత్రిలోన భూ
కాంతుఁ డొకండు లేఁడు; కటకంబు మొదల్కొని గోలకొండప
ర్యంతము నీవె కా, విజయరామనరేంద్ర! సురేంద్రవైభవా!'

అని తన ప్రభువగు చిన విజయరామగజపతి మహారాజును ప్రశంసించినను, సీతారామరాజుగారి దుష్పరిపాలనమును తన 'రామలింగేశ శతకము'లో వివరించి యున్నాఁడు. దివాను సీతారామరాజుగారు పూర్వము మహమ్మదీయపాలకులు మసీదుల కిచ్చిన భూములను, హిందూరాజులు బ్రాహ్మణుల కొసఁగిన మాన్యములను కూడ లాగికొని,

ప్రజలను కూడ మిక్కిలి క్షోభపెట్టుచుండిరఁట! ఇతని దుర్వృత్తిఁ మనస్సునం దుంచుకొని సూరకవి వ్రాసిన పద్యములను మచ్చునకు రెండింటిని గమనింపఁదగును.

సీ. మాన్యంబు లీయ సమర్థుఁ డొక్కఁడు లేఁడు;
మాన్యముల్ చెఱచు సామంతు లంద;
ఱెండిన యూళ్ళ గో డెఱిఁగింపఁ డెవ్వఁడు;
పండినయూళ్ళన్నఁ బ్రభువు లంద;
'ఱితఁడు పేద'యటంచు నెఱిఁగింపఁ డెవ్వఁడు;
కలవారి పేరి యెంచఁగలరు చాలఁ;
దనయాలి చీఁకటి తప్పెన్నఁ డెవ్వఁడు;
పెఱకాంత తప్పెన్నఁ బెద్దలంద;
గీ. ఱిట్టి దుష్టుల కధికార మిచ్చినట్టి
రాజు ననవలెఁగాక దుర్నయుల ననఁగ
నేమి పని యున్నయది సత్కవీంద్రులకును?
రామలింగేశ! రామచంద్రపురవాస!

సీ. పసుగురుఁ గోఁతి వెంబడి సంచరింపరే?
వాహకుల్లేరె శవంబునకును?
గంగిరెద్దుకు లేవె ఘనతూర్యరావముల్?
కలిమి గల్గదె వారకామినులకు?
పులి గోవుఁ జంపి నక్కలను బోషింపదే?
స్థూలకాయము లేదె దున్నలకును?
పుప్పిపుంటికి లేదె పుట్టంబుఁ జుట్టుట?
వేణుధరుం డెద్దువెంట రాఁడె?
గీ. న్యాయపద్ధతి నడువని యవనిపతికి
పెన్నిచిన్నెలు గలిగిన నెందుకొఱకు?

అంతమునఁ జూడవలయు నా యయ్యసుఖము;
రామలింగేశ ! రామచంద్రపురవాస !

చినవిజయరామరాజుగారు సాత్త్వికస్వభావము, దైవభక్తి కలవారు. ప్రతిదిన గంగాజల కృతాభిషేకులు. గౌతమీజలమునే పానము చేయు నియమము కలవారు. ఈయన యెడల సామంతు లందఱికిని భక్తిగౌరవము లుండెడివి. ఆ సామంతులు జయపురము లాలా కృష్ణదేవు, శృంగవరపుకోట ముఖీ - కాశీపతిరాజు, మాడుగుల లింగ భూపతి, సాలూరు సన్న్యాసిరాజు, కోటపాలెపు ముత్తావారు, కురుపాము శివరామభూపతి, అనకాపల్లి రామభద్రనాయక రావు, గోలుకొండ వీరభూపతి, పాలకొండ విజయరామ రాజు, ఆంధ్ర రామన్నదొర, రేగులవలస పూసపాటి-విజయరామరాజు, నాయకరాయఁడు, పాచిపెంట వీరప రాయఁడు, సంగమవలస నిశ్శంకభూపతి, చెముడు లక్ష్మీ-రాజు, రాజాము వెంకళరావు, నవర మేదినీరావు, వీర నర సింహరాయఁడు మున్నగువారు. వీరందఱికిని దివానుపై కోపమే ఉండెడిది.

అధికారము తనకుఁ గైవసమైయున్నను సీతారామ రాజుగారికిఁ దృప్తి లేదు. తమ్ముని పరముగా నున్న రాజ్యమును చిక్కులలోఁ బెట్టి, అతనిని పదవీచ్యుతు నొనర్పవలెనను దురుద్దేశ మీతనికిఁ గలిగినది. కావున నిజాముప్రభువువలన అధికారమును పొందిన ఆంగ్లేయులకు కట్టవలసిన సుంకము లక్షలకొలఁది బాకీ యుండిపోయినది. వ్యవహారము లన్నియును అస్తవ్యస్తము లైనవి. ఈ పరి

స్థితులను బాగుగా గమనించిన రాజబంధువులలో ముఖ్యులు 'తమ్ముని వ్యవహారములలో జోక్యమును కలిగించుకొన వ'ద్దనియు, 'పదవిని విడువవలె'ననియు దివానుగారిని నిర్బంధించిరి. విజయనగర ప్రభువు తన యనంతరము నరసింహరాజునకు రాజ్యాధికారము నిచ్చుటకు సమ్మతించినయెడల, పదవిని విడిచి వేఱొకచోటికిఁ బోవుటకు దివాను సమ్మతించెను. ఈ నరసింహరాజు సీతారామరాజుగారి పుత్రుఁడు! అప్పటికి విజయరామగజపతి ప్రభువునకు సంతానము లేదు. ఒకవేళ ప్రభువునకుఁ గుమారుఁడు కలిగినయెడల నరసింహరాజుయొక్క అధికారము చెల్ల నక్కఱలేదని కూడ నిర్ణయము జరిగినది. అందువలన చినవిజయరామరాజుగారీ నిర్ణయము నంగీకరించిరి. సీతారామరాజుగారు దివాను పదవిని విడిచిపెట్టిరి. కాని, కొలఁది కాలములోనే ప్రభువునకుఁ గుమారుఁడు కలిగినందున సీతారామరాజుగారి సంకల్పము నిష్ఫల మయ్యెను. అతనికిఁ దమ్మునిపయి క్రోధ మధిక మయ్యెను.

సీతారామరాజుగారు కొన్ని వ్యవహారములను పరిష్కరించుకొనుటకై ఆంగ్లేయాధికారులను కలిసికొనుటకు చెన్నపట్టణమునకుఁ బోయిరి. ఈయన చెన్నపట్టణములో ఉన్నప్పుడు, ఆంగ్లేయులకుఁ జెల్లించుటకై రెండు లక్షల రూపాయలను విజయరామరాజుగారు సోదరునికిఁ బంపిరి. కాని, ఆ పైకము చెల్లింపఁబడనే లేదు. మఱియు, దివాను తన తమ్మునిపయి లేనిపోని యారోపణల నొనరించి అతనిని పదవీచ్యుని గావించుటకు కుట్రలు పన్నెను. ఇతఁడు తన

వాక్చాతుర్యమువలన ఆంగ్లేయాధికారులను లోఁబఱచుకొని, తాను చెప్పిన విషయములు సత్యము లను నమ్మకమును వారికి కలుగఁజేసెను.

ఆంగ్లేయాధికారు లాలోచించి జమీందారుల వ్యవస్థను విచారణచేయుట కొక కమిటీని (సమర్థుల సంఘమును) నియమించిరి. అందలి సభ్యులు బాగుగా పరిశీలించి విజయనగరరాజుగారి బలమును తగ్గించుటకును, కప్పము నెక్కువగా విధించి సైన్యమును తగ్గించుటకును, విజయనగరమునకు చుట్టుపట్లఁ గల చిన్న జమీందార్లకు ప్రత్యేకముగ తగిన కవుల్లి నిచ్చుటకును తగిన పథకములను సూచించిరి. ఆ సూచనల ననుసరించి చినవిజయరామరాజుగారు వెనుకటి బాకీ సొమ్ముతో కలిపి, అప్పటివఱకును ఎనిమిది లక్షల ఏఁబదివేల రూపాయలు చెల్లింపవలసినట్లు తేలినది. ఆ పైకమును వెంటనే చెల్లించవలెనని ఇంగ్లీషువారు విజయరామరాజుగారి నొత్తిడి చేసిరి. మఱియు సంస్థాన వ్యవహారములు చక్కఁబడువఱకును కొంతకాల మాయన రాజ్యమును తమకు స్వాధీనము చేయవలెననియు వారు కోరిరి. కాని, విజయరామరాజుగారు తమ యుద్యోగి మూలమున లెక్కలను పంపుచు, ఇంగ్లీషువారు తమకుఁ మూఁడు లక్షల పైక మీయవలసి యున్నదనియు, సంస్థానమును తమ స్వాధీనములోనే యుంచిన, తాము చెల్లింపవలసిన మిగత అయిదున్నర లక్షల రూపాయలను యుక్త సమయములలో మూఁడు వాయిదాలలో చెల్లింతుమనియుఁ దెలియఁజేసిరి. కాని, యీ లెక్కలు చిక్కులతోఁగూడి, అస్పష్ట

ముగా ఉన్నవని భావించి, ఆంగ్లేయులు రాజుగారి మాట లను మన్నింపరైరి. తుదకు 1794-వ సంవత్సరము జూను నెల 13-వ తేదీని విజయనగరపు దుర్గమును ఆంగ్లేయులు స్వాధీనము చేసికొనిరి.

కోట స్వాధీనమయినను, పన్నులు వసూలు కాలేదు. రైతులు ప్రభుభక్తిని పాటించి విదేశీయులకుఁ బన్నులు కట్ట నిరాకరించిరి. చిన విజయరామరాజుగారు విజయనగర ప్రాంతమున నున్నయెడల పన్నులు వసూలుచేయుట సాధ్యపడదని గ్రహించి 'మచిలీపట్టణమునకుఁ బోయి యచ టనే నివసింపవలె'నని ఆంగ్లేయు లాదేశించిరి. ప్రయాణ వ్యయమునకు ముప్పదివేలిచ్చి, నెలకు కొంత వేతనమును కూడ నిర్ణయించిరి. తాము ప్రయాణము చేయుటకు విజయ రామరాజుగారు కొన్ని యాటంకములను చూపిరి; కాని, దానివలనఁ బ్రయోజనము లేకపోయెను. విజయనగరమును విడిచి వెళ్లిపోవుట విజయరామరాజుగారి కెంతమాత్ర మిష్టములేకపోయెను. కాని, విధిలేక ఈయన సపరివారముగా పట్టణమును విడిచి పది, పంద్రెండు మైళ్లదూరము వెళ్లి, అచట పద్మనాభమను క్షేత్రము సమీపమున నిలిచిపోయిరి.

పద్మనాభమునుండి యొక్కడుగైనను ముందు నకుఁ బోవుటకు రాజుగారిష్టపడలేదు. తమ రాజ్యమును విడిచి, వేఱొక చోటికిఁ బోవుట ఎంతో అవమానకరమని ఆయన తలంచిరి. ఆయన యనుచరులును ప్రాణము లైనను విడుచుటకు సిద్ధపడిరి గాని ముందునకుఁ బోవఁ దలంచ

లేదు. అందఱును తమపైకి వచ్చు ఆంగ్లేయులతో యుద్ధము చేయుటకే సంసిద్ధులైరి. దాట్ల, దంతులూరి, సాగి, చింతలపాటి, గొట్టిముక్కల, వేజర్ల, పెనుమెత్స మున్నగు కుటుంబములకుఁ జెందిన రాజ బంధువులు-వీరాగ్రేసరులు వచ్చి రాజుగారికి బాసటగా నిలిచిరి. మొత్తము పయి సాయుధులగు నాలుగువేలమంది వీరభటులు చేరిరి. అట్టి సమయమునఁగూడ రాయబారములు జరిగినవి. కాని, ఏ పరిస్థితిలోను విజయరామరాజుగారు ముందున కొక్క యడుగైనను పెట్టఁదలచుకొనలేదు.

యుద్ధమునకు ముందు రాజుగారు తమ కుటుంబములోని స్త్రీలను, ఎనిమిదేండ్ల వయస్సుగల తమ కుమారుఁడు నారాయణ గజపతిరాజుగారిని పద్మనాభమునకు రెండు క్రోశముల దూరమున నున్న అన్నమరాజుపేటలోని రాజబంధువుల యింటికిఁ బంపివేసిరి. యుద్ధమునఁ దమకు మరణము సంభవించినయెడల ఆంగ్లేయులకు లొంగిపోవలసినదని తెలిపిరి. ఆత్మహత్య చేసికొనకుండుటకై భార్యచేతను, తల్లిచేతను ప్రమాణములు చేయించిరి.

1794 మేనెల రెండవ వారములో ఈ యుద్ధము ముప్పావుగంటసేపు మాత్రము తీవ్రముగా జరిగినది. ఆంగ్లేయుల సైన్యములో 13 గురు మాత్రము చనిపోయిరి. 63 గురు క్షతగాత్రులైరి. రాజుగారిసైన్యములో చాల మంది చనిపోయిరి, క్షతగాత్రుల సంఖ్య తెలియలేదు, వీరిలో 208 గురు క్షత్రియులే అనియు, నలువదిమంది

రాజుల కళేబరములు విజయరామరాజుగారి దేహముచుట్టును బురుజువలె పడి యుండిరనియుఁగూడ తెలియవచ్చుచున్నది. పయి సన్నివేశమును

శ్లో. 'అత్యుక్త సైనికవరః ప్రవిభాతి సమ్య
గద్యాపి చిహ్నన్నృపవైభవలాంఛనశ్రీః,
సామంత వీరశవబృంద సమావృతస్సన్
శ్రీ పద్మనాభ ధరణీధర పార్శ్వభాగే.'

అను శ్లోకము వివరించుచున్నది. 'విజయరామరాజుగారు, విశుపని సైనికశ్రేష్ఠులు గలవారును, సామంతుల యొక్కయు, వీరులయొక్కయు కళేబర సమూహములచేఁ జుట్టఁబడినవారు నగుచు, శ్రేష్ఠమైన రాజవైభవము యొక్కయు, చిహ్నములయొక్కయు సంపదగలవారై శ్రీపద్మనాభ పర్వత పార్శ్వ ప్రదేశమందు తెస్సఁగ నిప్పటికిని బ్రకాశించుచున్నారు' అని దీని యభిప్రాయము.

పద్మనాభ యుద్ధము ఫలితము తెలిసినవెంటనే స్త్రీలను, రాజకుమారుని దీసికొని వారి సంరక్షకులు పర్వత ప్రాంతమునందలి కాశీపురమునకు వెళ్లిపోయిరి. ఆ కాలములో కాశీపురము ముఖీ–రాజభూపాలరాజుగారి స్వాధీనమున నుండెను. అతఁడు బ్రిటిష్ వారి యధికారమును లెక్కచేయక, ఆ ప్రాంతమున నొక స్వతంత్ర పాలకుఁడుగా నుండెను. ఆయన విజయనగర రాజ కుటుంబమును భక్తి పూర్వకముగా నాదరించి, పరిస్థితులను తెలిసికొని, భద్రముగా రక్షింపఁదలఁచెను. కాశీపురమునకు నుత్తరముగాఁ

గొంత దూరములో నున్న మక్కువ యను గ్రామము సుర క్షితస్థలమని అతనికిఁ దోఁచెను. రాజకుటుంబములోనివారిని, వారి యంగరక్షకులను రాజభూపాలరాజు స్వయముగా మక్కువకుఁ దీసికొని వెళ్లెను.

ఆ సమయమున జయపురమురాజగు రామచంద్ర దేవుగారు నారాయణపట్టణములో నివసించుచుండిరి. రాజ కుమారుని అంగరక్షకుఁడైన కోలగట్ల-పట్టాభిరామయ్య అను వైశ్యుఁడా రాజుగారిని దర్శించి, తమకు మరల విజయనగ రము స్వాధీనమగుటకు సాయపడవలసినదని కోరెను. ఆయన దానికి సమ్మతించెను. దినక్రమమున వేలకొలఁది వీరభటులు సాయుధులయి రాజకుమారుని కండగా నిలువసాగిరి. ఇట్లు కొలఁది కాలములో పెక్కువేల సైన్యము సమకూరెను. సరదారులు రైతులవద్ద శిస్తు వసూలుచేయుచు, ఆంగ్లేయుల యధికారమును లక్ష్యముచేయకుండుటకు నిశ్చయించుకొనిరి. ఈ వివరములన్నియును ఆంగ్లేయులకు తెలియుచునే యుండి నవి. ఇఁకమీఁద గొప్ప సైన్యమును కూర్చుకొని పోయి, యెదిరించిననేగాని తమ యధికారము నచ్చట నిలఁబెట్టుట సాధ్యముకాదని వారి కవగతమైనది. అందువలన సామో పాయముననే కార్యమును సాధింపవలెనని వారు నిశ్చయించు కొనిరి. వారి పక్షమున 'చీఫ్ అండు కౌన్సిలు'గారు సమరస మగు పద్ధతి నవలంబించి, వెనుక జరిగినదానిని విస్మరింతు మనియు, రాజుగారి కుటుంబములోని స్త్రీలును, నారాయణ గజపతిరాజుగారును నిర్భయముగా వచ్చి యుండవచ్చు

ననియు, హత శేషులగు ముఖ్యులైన రాజబంధువులకుఁ దెలియఁజేసిరి.

అధికారులు వ్రాసిన జాబులు రాజబంధువులకు తృప్తిని కలిగించలేదు. స్త్రీలును, నారాయణగజపతిరాజు గారును అన్నమరాజుపేటకు రావలెనని యే అందు తెలిపిరి గాని, తాము గావించు పరిష్కారము లేవియో, రాజుగారి నాశ్రయించియున్నవారి విషయ మేమియో తెలుపలేదు. వివరములను తెలుపవలెనని తిరిగి వ్రాయఁగా అధికారుల నుండి ప్రత్యుత్తరము రాలేదు. కావున రాజబంధువు లీ విషయమున ఉపేక్షాభావమునే వహింపవలసి వచ్చెను.

పయి పరిస్థితుల నన్నింటిని పరిశీలించి చెన్నపట్టణ ములో ఉన్న బ్రిటిష్ గవర్నరు సర్ ఛార్లెస్ వోక్లీగారు శ్రీ నారాయణగజపతి రాజుగారికిఁగాను ఒక ప్రమాణపత్ర మును వ్రాసి, విశాఖపట్టణములోని చీఫ్‌గారికి పంపిరి. 'విశాఖపట్టణము జిల్లా వృత్తాంత సంగ్రహము'లో 393–395 పుటలలో ఉన్న దాని యాంధ్రానువాదము క్రింద పొందు పఱుపఁబడుచున్నది.

"లేటు జమీందారుగారయిన విజయరామరాజుగారి కుమాళ్ళయిన నారాయణరాజుగారికి - -

లేటు రాజాగారయిన విజయరామరాజుగారు కంపెనీవారిమీద తిరుగుబాటు చేసి యుద్ధములో కాలము చేసినందున మీకుఁ బుట్టిన యవమానమునుబట్టి మీరు విజయనగరపు జమీందారీ విడిచిపెట్టి యనారోగ్యకరమైన కొండప్రాంతములందు నివసించుచున్నట్లు నమ్మతగియున్నది. లేటు రాజాగారి కుటుంబస్థులను, పరివారస్థులను క్షమించడమైనదని

విశాఖపట్టణపు చీఫ్ ఆంటు కవున్సిలుగారు ప్రచురపరచియున్నప్పటికి నింకా గవర్నమెంటువారియొక్క యుద్దేశములపట్ల నిర్హేతుకమయిన యవిశ్వాసము కలిగియున్నట్టు మీరు కనబడుచున్నారు.

గనుక తమరును, లేటు రాజాగారి కుటుంబస్థులందరును కంపెనీ వారియొక్క సంరక్షణలోకి చేర్చుకొనబడుదురని మీకు విశ్వాసము కలుగజేయుటకై యీ కవులు వ్రాయించడమైనది. మీకందరికి క్షేమము, భద్రమును కలుగచేయడమవునని కంపెనీవారిందుమూలముగా దైవముపైని ప్రమాణము చేయుచున్నారు. ఈ కవులు మీకందిన ముప్పది రోజులలో విజయనగరపు జమీందారీలో తమ మాహాలు స్థలమునకుగాని, లేక మరొక స్థలమునకుగాని తమరు నెమ్మదిగా తిరిగి వచ్చినయెడల నీ ప్రమాణము చెల్లవలసి యుండును.

ప్రజల మనసులలో పొరపాటుచేతనైన నేమైన ననుమానముండు నెడల నట్టి యనుమానముల నన్నిటినీ కూడ నివృత్తిచేయుటకొర కిందు వలన మరొక సంగతి తెలియచేయడమైనది. అనగా లేటు రాజాగారి యొక్క యావన్మంది బంధువులు, ఆశ్రితులు, ఆయునయందు విశ్వాసము గలవారు, యింక నీ యాదరము పొందుటకు నిచ్ఛగల యితరులు పైని చెప్పిన విధముగా ముప్పదిరోజులలోగా తిరిగీ వచ్చిన పక్షమందు తమ విషయమై చేసిన ప్రమాణమే వారి క్షేమమును గురించి, భద్రమును గురించి వ్యాపింపచేయబడును.

అయినప్పటికినీ కంపెనీవారియొక్క ప్రమాణమును, కరుణయును నిందువలన ప్రకటనచేసిన పైనిని, తమరుగాని, లేటు రాజాగారియొక్క బంధువులు, ఆశ్రితులు, ఆయనయందు విశ్వాసముగలవారుగాని, లేక తమలో యెవరైనగాని కంపెనీవారి దొరతనముయొక్క సంరక్షణలో చేరకుండ నుండిపోయినయెడల, నట్టి ప్రవర్తన మూర్ఖమయినదిగాను, తిరస్కారబుద్ధిగలదిగాను భావించబడును. ఇకముందు కంపెనీవారి యొక్క దయను, సహాయమును వదులుకున్నట్టు మీరు భావింపబడుదురు.

పైని వ్రాసిన సంగతులు యథార్థతగలవైనందు కీస్టిండియాలో వ్యవహారము చేయుచున్న యింగ్లాండు దేశీయులగు వర్తకసమూదాయముయొక్క కంపెనీవారిస్థానే మదరాసు గవర్నరువారగు హానరబిల్ సర్ ఛార్లెస్ వోక్లి బారోనెటువారీ కవులుపైని సంతకముచేసి 1794 సంవత్సరం ఆగస్టు ది 20 తారీఖున మదరాసు ఫోర్టుసెంటు జార్జి యను కోటలో సదరు కంపెనీవారియొక్క శీలు వేయించడమైనది.

ఛార్లెస్ వోక్లి అని యున్నది.”

పయి ప్రమాణ పత్రము నారాయణ గజపతిరాజుగారి కందఁజేయఁబడినది. కాని, స్వార్థపరులగు ఆశ్రితులు కొందరు, తమకు దీనివలన ఎక్కువ ప్రయోజనము కానరా నందున దొరతనమువారిని ప్రతిఘటించుటకే నిశ్చయించి, దానికి తగిన సన్నాహములు చేయసాగిరి. ఆంగ్లేయాధికారులు మాత్రము, ఆయుధప్రయోగముకంటె శాంతి మార్గముననే ఉపయోగముండుననియు, వ్యవహారములు పరిష్కరింపఁబడఁగలవనియు నమ్మి యుండిరి. జయపురము రాజుగారు తిరుగుబాటు చేయకుండునట్లు చేసిరి. కొలఁది దినములలో నారాయణగజపతిరాజుగారు, ఆంగ్లేయ ప్రతికూలురగు జమీందారులనుండి తప్పించుకొని సెప్టెంబరు 21-వ తేదీని ఆండ్రలో ప్రవేశించిరి. అది విజయనగరమునకు సమీపమున నున్న కొండ జమీందారీ పట్టణము.

సెప్టెంబరు 7-వ తేదీని ఛార్లెస్ వోక్లీగారి స్థానమున లార్డు హోంబర్టుగారు నియమింపఁబడిరి. ఆయన సంతకముతో క్రొత్త ప్రమాణపత్రము కూడ ఈయఁబడినది.

నారాయణగజపతిరాజుగారు రాజబంధువులతో విజయనగరముకోటలో ప్రవేశించిరి.

1794 సంవత్సరాంతమున ఆంగ్లేయుల కంపెనీ ప్రభుత్వములో చాల మార్పులు కలిగినవి. అంతకు ముందుండిన 'చీఫ్'ల పద్ధతి పోయి, కలెక్టర్ల పరిపాలన ప్రారంభమైనది, శాశ్వతమైన శిస్తు పద్ధతి ఆచరణలోనికి వచ్చినది. అందువలన జమీలన్నియును స్వాతంత్ర్యమును కోలుపోయినవి.

విజయనగర సంస్థానమునుండి చాల జమీలు విడఁదీయఁబడినవి. ఇదివరకు కోటలో బంధింపఁబడిన జమీందారు లందఱును విడిపింపఁబడిరి. వారి జమీలు వారి కీయఁబడినవి. విజయనగర సంస్థానములోని కొన్ని తాలూకాలను కంపెనీవారు తీసికొనుచు, సంస్థానము చెల్లింపవలసిన పన్నును మాత్రము హెచ్చించిరి. విజయనగర ప్రభు వాఱు లక్షల రూప్యములు పన్నుగా చెల్లింపవలెనని నిర్ణయింపఁబడినది. ఇట్టి మార్పులకు నారాయణగజపతి రాజుగా రిష్టపడలేదు. కాని, గత్యంతరము కానరాలేదు. ఇంతేకాక కంపెనీ ప్రభుత్వము న్యాయశాఖను, రక్షక భటశాఖను నెలకొల్పుటవలన జమీందారుల యధికారములు పూర్తిగా తగ్గిపోయినవి. జమీందారులు బ్రిటిష్ పరిపాలనలో కేవలము ఉద్యోగులవంటివా రయిపోయిరి. విజయనగర ప్రభు వీ పరిస్థితుల నన్నింటిని గమనించి, సంస్థానమును సక్రమముగా పాలించుచు, ప్రజాదరమును చూఱగొనుచు పన్నులు కట్టుట అసాధ్యమని గ్రహించిరి. అయినను

తమ వంశగౌరవమును నిలుపుకొనుచు ఆయన సంస్థాన పరిపాలనను సాగించుచునే యుండిరి. 1817-వ సంవత్స రమునాఁటి కాయన తీర్పవలసిన ఋణములు పంద్రెండు లక్షలకుఁ జేలినవి. అవి వేర్వేఱు స్థలములలోఁ జేయఁ బడినవి. ఆ ఋణములనన్నింటిని తామే ఋణదాతలుగా ఉండి పరిష్కరించుటకును, తమ కీయవలసిన సొమ్ము పూర్తిగా తీరువఱకును జమీందారీ తమ స్వాధీనమునం దుంచుకొనుట కును కంపెనీ ప్రభుత్వమువారు నిర్ణయించిరి. ఆ నిర్ణయ మునకు నారాయణగజపతిరాజుగారు సమ్మతించిరి. రాజు గారికి సొంత ఖర్చులకయి సంవత్సరమునకు ఎనుబదివేల రూపాయ లీయఁబడుచుండెడివి. అయిదేండ్లలో-అనఁగా 1822 నాఁటికి ఋణములన్నియును తీరినవి. కావున జమీం దారీ తిరిగి నారాయణగజపతి ప్రభువునకు స్వాధీనమైనది.

విజయనగర రాజ్యము తొలుతనుండియు దానధర్మ ములకుఁ బేరు పడినది. ప్రస్తుతము సంస్థాన ప్రమాణము, దానినిబట్టి ఆదాయము తగ్గినను, వ్యయమున మాత్రము తగ్గుదల లేదు. వదాన్యులగు నారాయణగజపతి రాజుగారి చేతికి ఎముక లేదు. ఆయన బ్రాహ్మణుల కగ్రహారములను, క్షత్రియులకు జాగీరులను అసంఖ్యాకముగా ఇచ్చుచుండిరి. అందువలన ఆయన ఋణములు చేయుట తప్పని సరి అయినది. మఱి అయిదేండ్ల నాఁటికిఁ గల ఋణము ఏడు లక్షల వఱకును పెరిగినది. అందువలన ఆయన తమ జమీందారీని కలెక్టరు పర్యవేక్షణకు విడిచి, సంవత్సరమునకు లక్ష రూప్యములను తమ కందఁజేయు నేర్పాటుతో కాశీ క్షేత్రమున నివసించు

టకుఁ బరివారముతోఁగూడఁ బోయిరి. స్వదేశమును విడిచి పెట్టి నారాయణగజపతిరాజుగారు కాశీ నగరములో నివసించుచున్నను, బ్రిటిష్ దొరతనమువారి కీయనయెడల గౌరవము తగ్గలేదు. అప్పటి ఇండియా గవర్నర్ జనరలు లార్డు బెంటిక్కు ప్రభువు వీరిని విశేషముగా గౌరవించు చుండెను.

నారాయణగజపతి రాజుగారు తమ జీవితాంతమువఱకును వారణాసియందే ఉండిరి. ఈయన 1845-వ సంవత్సరమున కీర్తిశేషులయిరి. అచటనున్న కాలమునందును వీరు ఋణముచేయుచునే యుండిరి. మరణ సమయమునకు తేలిన యప్పు పదునొకండు లక్షలు!

నారాయణగజపతి రాజుగారి పుత్రులు విజయరామ గజపతి రాజుగారు. వీరు సుప్రసిద్ధ మహాపురుషులు! తండ్రిగారు స్వర్గస్థులగునరికి వీరివయస్సిరువదియేండ్లు. ఈయనకు, తిరిగి తమ రాజధానికి రావలెనను ఆసక్తి లేదు. కాని దొరతనమువారి కోరిక ననుసరించి 1848-వ సంవత్సరమున విజయరామరాజుగారు విజయనగరమునకు వచ్చిరి. 1845 నుండి నాలుగేండ్లు స్మాలెటు దొరగారు సంస్థాన వ్యవహారములను చూచుచుండిరి. సర్కారులలో నున్న జమీందారీ తాలూకాలలో మామూలుగా జరుగుచుండు రయితువారీ ముచ్చలకా పద్ధతిపయి సంవత్సరమునకు పది లక్షల రూపాయలు జమ యగుచుండెడివి. రాజుగారు వయస్సులో పిన్నలగుటవలన ఆయనకు రాజ్య వ్యవహార నైపుణ్యము

కలిగి, సంస్థానపు ఋణములు తీరువఱకును సంస్థానమునకు ఒక ఏజెంటును నియమించుట మేలని ప్రభుత్వమునకుఁ దోఁచినది. కావున స్పెషల్ ఏజెంటుగా క్రూయిజర్ దొర గారు నియమింపఁబడిరి. ఈయనయును పరిపాలనలో స్మాలెట్ దొరగారి పద్ధతినే యవలంబించిరి. ఈయన నాలుగేండ్లు తమ పదవిని నిర్వహించి 1852 జూలయి నెలలో సంస్థానమును విజయరామగజపతిరాజుగారి కప్పగించిరి. అప్పటికి ఋణములన్నియును తీరిపోయి రెండు లక్షల యిరువది యొక్క వేయికిఁ బైగా పైకము నిలువయుండినది.

క్రూయిజరు దొరగారు విజయరామగజపతి రాజుగారికి పెక్కు విషయములు బోధించి వ్యవహారములందు గొప్ప జ్ఞానము కలుగునట్లు చేసిరి. నాటి జమీందారులలో విజయరామగజపతిరాజుగారు సమర్థులనియు, గొప్ప వదాన్యులనియు పేరు పొందిరి. సుప్రీం లెజిస్లేటివ్ కౌన్సిలు నకు సభ్యులుగా ఎన్నుకొనఁబడిరి. ఈయనయే శాసన సభలో "ఇండియన్ మెజారిటీ బిల్లు" ప్రవేశపెట్టి నెగ్గిరి. విశాఖపట్టణమునందలి వైద్యశాల కిరువదివేల రూప్యముల విరాళ మొసఁగిరి. వీరి యోగ్యతను గుర్తించి గవర్నర్ జనరలుగారు వీరికి 'మహారాజ' బిరుదము నిచ్చిరి. దాని సనదు, క్రింద నుదాహరింపఁబడుచున్నది.

'దీ హానరేబిల్ మహారాజా మీర్జా విజయరామ గజపతిరాజు మన్యసుల్తాన్ బహదూర్ ఆఫ్ విజయనగరము వారికి—

విశాఖపట్టణములో సివిలు డిస్పెన్సరీయొక్క పోషణనిమిత్తము తమ రిరువదివేల రూపాయిల నిప్పించి యున్నారు. తక్కిన జమీందారు

అందరును జూచి నేర్చుకొనునటుల నన్ని విధములను తమ సమస్థానము నను కూలముగ వ్యవహరించుచున్నారు. పైని చెప్పిన యంశములలో తమ యౌదార్యమునకు, వ్యవహార నైపుణ్యమునకు ప్రతిఫలముగ "మహారాజా" యను బిరుదును తమకు నే నిచ్చుచున్నాను.

౧౮౬౪ సం॥ మార్చి ౧౧ తారీఖు.

జాన్ లారెన్సు

పైసురాయందు గవర్నరు జనరలువారి సంతకమున్నది.'

ఇంతే కాక ఈ మహారాజావారికి 'శాల్యూటు' కలదు. అనఁగా వీరు పెద్ద యధికారులను చూచుటకు విశాఖపట్టణమునకు వచ్చునప్పు డచ్చటి కోటలో – వీరి స్వాగత సూచకముగ 13 శతఘ్నులను ప్రేల్చుచుండిరి. వీరికి 'నైట్ కమాండర్ ఆఫ్ ది మోస్ట్ ఎగ్జాల్టెడ్ ఆర్డర్ ఆఫ్ ది స్టార్ ఆఫ్ ఇండియా' (K. C. S. I.) అను బిరుదు కూడ ఈయఁబడినది.

విజయరామగజపతిరాజుగారు తమ సంస్థానమును పెక్కు విధముల అభివృద్ధిలోనికిఁ దెచ్చిరి. ఆదాయమును పదునేడు లక్షలవఱకును పెంచిరి. విజయనగరముననుండి సముద్రతీరమున నున్న భీమునిపట్టణమునకు రోడ్డు వేయించిరి. విజయనగరమునుండి విశాఖపట్టణము, శృంగవరపుకోట, శ్రీకాకుళము మున్నగు పట్టణములకు రస్తాలు వేయుటకు అరువదిమూఁడువేల రూపాయలకు పైగా విరాళ మిచ్చిరి. తమ జమీలోని తాలూకాల ముఖ్య పట్టణములలో పాఠశాలల నేర్పఱచి, పోషించుచుండిరి. వానిలో తెలుఁగుభాష, లెక్క లు మున్నగునవి బోధింపఁబడుచుండి

నవి. విజయనగరమునందు 'జిల్లా స్కూలు' అను పేర
ఈ మహారాజుగారే ఒక యాంగ్ల పాఠశాలను స్థాపించిరి.
అదియే క్రమముగా అభివృద్ధి నొంది కొలఁది కాలముననే
కళాశాల యైనది. ఇప్పుడున్న సంస్కృత కళాశాలను
స్థాపించినవారును శ్రీ విజయరామగజపతి మహారాజుగారే!
అప్పు డిది వేద, సంస్కృత పాఠశాలగా ప్రారంభింపఁబడి
నది. ఇందు గొప్ప పండితు లధ్యాపకులుగా నియమింపఁ
బడెడివారు. విద్యార్థులకు బసలు, భోజనము ఉచితముగాఁ
గూర్పఁబడుచుండెడివి. స్త్రీవిద్యయెడల ఆదరము గలవా
రగుటచే ఈయన బాలికలకయి 'రిప్పన్ హిందూ
హైస్కూలు' అను బాలికోన్నత పాఠశాలను స్థాపించిరి.
చెన్నపట్టణములోను, వారణాసిలోను పెక్కు బాలికా
పాఠశాలలను నెలకొలిపిరి. అలిఘురు, కాశీ, కలకత్తా,
మద్రాసు పట్టణములలో విద్య నభ్యసించుచున్న విద్యా
ర్థులు చాలమందికి ఉపకారవేతనము లిచ్చిరి. కాశీనగర
మున పురమందిరమును కట్టించిరి. అలహాబాదులో కార్మై
కిల్ దొరగారి పేర నొక గ్రంథాలయమును స్థాపించిరి. ఆ
నగరమునందే యున్న మూార్ కళాశాలలో ఒక ఘటికా
స్తంభమును నిర్మించిరి; కాశీ నగరమున ఒక ధర్మ వైద్య
శాలను, క్రికెటు ఆటస్థలమును నెలకొల్పిరి. చెన్నపట్టణములో
మౌంటురోడ్డులో రొందుతాణా దగ్గర, అన్ని మార్గముల
కూడలిలో నొక జలధారా యంత్రమును, లండను నగర
ములో హైడు పార్కులో నొక జలధారా యంత్రమును
స్థాపించిరి.

విజయరామగజపతి మహారాజుగారు కళలలో ప్రవీణులు. సంగీత సాహిత్యములందు గొప్ప యాదరము కలవారు. అందువలన పెక్కుమంది గాయకులకును, కవులకును తగిన యుపాధిని కల్పించి తమ యాస్థానమున నుంచుకొనిరి. వీరు చేతిపనులను మిక్కిలి ప్రోత్సహించిరి. ఆ కాలమున విజయనగరము చేనేత వస్త్రములకుఁ బ్రసిద్ధి చెంది యుండినది. అద్దకపుఁ బరిశ్రమయు నభివృద్ధిలో నుండినది; ఈ పరిశ్రమల పరస్పర సహకారమున విలువైన వస్త్రములు విరివిగా ఉత్పత్తి యగుచుండినవి. ఇట్లు తయారైన వస్త్రములకు విక్రయ సౌకర్యము కలిగించు సంకల్పము ప్రభువులకుఁ గలిగినది. ఇంతలో విక్టోరియా మహారాణి పెద్ద కుమారుఁడు 'ప్రిన్స్ ఆఫ్ వేల్సు' బిరుదాంచితుఁడు భారతదేశమునకు వచ్చుట తటస్థించినది. ఆయన పేర శ్రీ మహారాజుగారు 'ప్రిన్స్ ఆఫ్ వేల్సు' అను మార్కెట్టును కట్టించిరి. దీనివలన వస్త్రములకు విక్రయ సౌకర్యము చక్కగా నేర్పడినది.

విజయరామగజపతి మహారాజుగారి కాలమునందే విజయనగర మభివృద్ధి చెందినది. నగరము పెరిగినది. పెక్కు రోడ్లు వేయఁబడినవి. వర్తకము, వ్యాపారము బాగుగా సాగుచుండినవి. పట్టణములోని పెద్దలతో ఒక మునిసిపలు సంఘము వీరి కాలమునందే ఏర్పడినది. ఆ సంఘము ప్రజలవలనఁ గొంత పన్ను వసూలుచేసి, ప్రభుత్వమొసఁగిన ధనమును గూడ దానితోఁ జేర్చి నగర పారి

నవి. విజయనగరమునందు 'జిల్లా స్కూలు' అను పేర
ఈ మహారాజుగారే ఒక యాంగ్ల పాఠశాలను స్థాపించిరి.
అదియే క్రమముగా అభివృద్ధి నొంది కొలఁది కాలముననే
కళాశాల యైనది. ఇప్పుడున్న సంస్కృత కళాశాలను
స్థాపించినవారును శ్రీ విజయరామగజపతి మహారాజుగారే!
అప్పు డిది వేద, సంస్కృత పాఠశాలగా ప్రారంభింపఁబడి
నది. ఇందు గొప్ప పండితు లధ్యాపకులుగా నియమింపఁ
బడెడివారు. విద్యార్థులకు బసలు, భోజనము ఉచితముగాఁ
గూర్పఁబడుచుండెడివి. స్త్రీవిద్యయెడల ఆదరము గలవా
రగుటచే ఈయన బాలికలకయి 'రిప్పన్ హిందూ
హైస్కూలు' అను బాలికోన్నత పాఠశాలను స్థాపించిరి.
చెన్నపట్టణములోను, వారణాసిలోను పెక్కు బాలికా
పాఠశాలలను నెలకొలిపిరి. అలిఘరు, కాశీ, కలకత్తా,
మద్రాసు పట్టణములలో విద్య నభ్యసించుచున్న విద్యా
ర్థులు చాలమందికి ఉపకారవేతనము లిచ్చిరి. కాశీనగర
మున పురమందిరమును కట్టించిరి. అలహాబాదులో కార్మి
కేల్ దొరగారి పేర నొక గ్రంథాలయమును స్థాపించిరి. ఆ
నగరమునందే యున్న మూర్ కళాశాలలో ఒక ఘటికా
స్తంభమును నిర్మించిరి; కాశీ నగరమున ఒక ధర్మ వైద్య
శాలను, క్రికెటు ఆటస్థలమును నెలకొల్పిరి. చెన్నపట్టణములో
మౌంటురోడ్డులో రాండుతాణా దగ్గర, అన్ని మార్గముల
కూడలిలో నొక జలధారా యంత్రమును, లండను నగర
ములో హైడు పార్కులో నొక జలధారా యంత్రమును
స్థాపించిరి.

విజయరామగజపతి మహారాజుగారు కళలలో ప్రవీణులు. సంగీత సాహిత్యములందు గొప్ప యాదరము కలవారు. అందువలన పెక్కుమంది గాయకులకును, కవులకును తగిన యుపాధిని కల్పించి తమ యాస్థానమున నుంచుకొనిరి. వీరు చేతిపనులను మిక్కిలి ప్రోత్సహించిరి. ఆ కాలమున విజయనగరము చేనేత వస్త్రములకుఁ బ్రసిద్ధి చెంది యుండినది. అద్దకపుఁ బరిశ్రమయు నభివృద్ధిలో నుండినది; ఈ పరిశ్రమల పరస్పర సహకారమున విలువైన వస్త్రములు విరివిగా ఉత్పత్తి యగుచుండినవి. ఇట్లు తయారైన వస్త్రములకు విక్రయ సౌకర్యము కలిగించు సంకల్పము ప్రభువులకుఁ గలిగినది. ఇంతలో విక్టోరియా మహారాణి పెద్ద కుమారుఁడు 'ప్రిన్స్ ఆఫ్ వేల్సు' బిరుదాంచితుఁడు భారతదేశమునకు వచ్చుట తటస్థించినది. ఆయన పేర శ్రీ మహారాజుగారు 'ప్రిన్స్ ఆఫ్ వేల్సు' అను మార్కెట్టును కట్టించిరి. దీనివలన వస్త్రములకు విక్రయ సౌకర్యము చక్కగా నేర్పడినది.

విజయరామగజపతి మహారాజుగారి కాలమునందే విజయనగర మభివృద్ధి చెందినది. నగరము పెరిగినది. పెక్కు రోడ్లు వేయఁబడినవి. వర్తకము, వ్యాపారము బాగుగా సాగుచుండినవి. పట్టణములోని పెద్దలతో ఒక మునిసిపలు సంఘము వీరి కాలమునందే ఏర్పడినది. ఆ సంఘము ప్రజలవలనఁ గొంత పన్ను వసూలుచేసి, ప్రభుత్వ మొసఁగిన ధనమును గూడ దానితోఁ జేర్చి నగర పారి

శుద్ధ్యము, వీథులలో దీపములు వెలిగించుట మున్నగు పనుల కుపయోగించుచుండిరి.

రాజ్యపరిపాలనమునకు ప్రభుని ప్రతిభతోఁ బాటు దివానుల నేర్పు కూడ మిక్కిలి యావశ్యకము. విజయరామ గజపతి మహారాజుగారివద్ద పెనుమెత్స - జగన్నాథరాజుగారనెడి సమర్థులు దివానుగా నుండిరి. ఆయన ఆంగ్లభాషాభిజ్ఞులు కాకున్నను, వ్యవహార నిర్వహణమును మిక్కిలి నేర్పుతో జరుపుచుండిరి. సంస్థానమున ఆయన యానతి సుగ్రీవాజ్ఞగా నుండినది. జగన్నాథరాజుగారు సంస్థానములో చాల నీటి వనరుల నేర్పఱచిరి. ఆనకట్టలు కట్టించిరి. వ్యవసాయమున కనుకూలముగ కాలువలను త్రవ్వించిరి. దీనివలన రాఁబడి పెరిగినది. కోటలో 'మోతీ మహాలు' అను పెద్ద భవనము, సైనిక గృహములు, నగారా ఖానా నిర్మింపఁబడినవి; మహారాజుగారి పేర ఒక పేట నిర్మింపఁబడినది. సత్రములు కట్టింపఁబడినవి. సింహాచలము, శ్రీకూర్మము మున్నగు పుణ్యస్థలములలో ధ్వజస్తంభములు, పూర్ణ కలశములు నెలకొల్పఁబడినవి. ముఖమండపములు, రామానుజకూటములు నిర్మింపఁబడినవి. పుష్పవనములు నాటఁబడినవి. ధనాగారములు, ధాన్యపుఁ గొట్లు కట్టఁబడినవి. తటాకములు త్రవ్వింపఁబడినవి. దివాను జగన్నాథరాజుగారిని గూర్చిన గాథలు పెక్కులు ప్రసిద్ధములై యున్నవి. ఈయన దివాన్గిరిలో సంస్థాన మభివృద్ధి పొందినది. ప్రభువుల గౌరవ మినుమడించినది.

విజయరామగజపతి మహారాజుగారి సతీమణి అలక రాజేశ్వరీదేవి. ఈ దంపతులకు అప్పల కొండయాంబ అను పుత్రికయు, నారాయణగజపతి, ఆనందగజపతి అను నిర్వురు పుత్రులును కలిగిరి. నారాయణగజపతిగారు చిన్నతనమునసే మరణించిరి. అప్పల కొండయాంబ రేవా సంస్థానాధిపతులు మహారాజా రామసింగుగారి భార్య. ఆనందగజపతి ప్రభువు విజయనగర సంస్థానాధీశు లందరిలోను ముఖ్యుఁడు.

ఆనందగజపతి మహారాజుగారు క్రీ. శ. 1850-వ సంవత్సరమున జన్మించిరి. పూసపాటివంశ పూర్వ రాజుల తపఃఫలమే యి ట్లానందగజపతి ప్రభువుగా రూపొందెనని లోకు లనుకొనుచుందురు. ఈయన తన సౌందర్యవాఙ్మాధుర్యములచేతను, సహజ మృదు స్వభావమునను, మర్యాదల వలనను అందఱి హృదయముల నాకర్షించుచుండెడివారు. ఆంగ్లేయులు నీయన చక్కఁదనమునకు ముగ్ధులై "ప్రిన్స్ చార్మింగ్ (Prince Charming) (జగన్మోహనుఁడు)" అని ప్రశంసింపసాగిరి. 'యత్రాకృతి స్తత్ర గుణాః' అను నార్యోక్తి ననుసరించి చక్కని రూప మున్నచోట ఉత్తమగుణము లుండును. కావున ఈ ప్రభువున కుత్తమగుణములు పుట్టుకతోడనే యలవడినవని చెప్పవలసి యున్నది.

ఆనందగజపతి ప్రభువు గొప్ప ప్రతిభాశాలి. చిన్నప్పటినుండియు నీయనకు విద్యాసక్తి యపరిమితము. కావుననే తండ్రి యగు విజయరామగజపతి మహారాజుగా రీయనకు వివిధ విషయములను బోధించుటకు తగిన విద్వాంసులను

నియమించిరి. సుప్రసిద్ధ వైయాకరణులు భాగవతుల-హరి
శాస్త్రిగారును, మైసూరు భీమాచార్యులుగారును వీరికి
సంస్కృత భాషా గురువులు. లింగం - లక్ష్మాజీపండితు
లాంగ్ల విద్యాగురువులు. యువరాజుగా రీయన యొద్ద నే
గ్రీకు, లాటిను, జర్మను మున్నగు భాషలను కూడ నభ్య
సించి, అన్ని భాషలయందును చక్కని పాండిత్యమును
సంపాదించిరి. ఒక మౌల్వీవద్ద అరబిక్, పర్షియను భాషల
నభ్యసించిరి. భాషాజ్ఞానము కొంతవఱకు కలవడిన పిమ్మట
గ్రంథముల నన్నింటిని స్వయముగానే చదివి యర్థము చేసి
కొనెడివారు! తాము కన్న పుస్తకము, విన్న పుస్తకము-
ఏ దేశమున-ఏ మూలమూల నున్నను, అది తప్పక యీ
ఆనందగజపతి ప్రభుని గ్రంథాలయమును తప్పక అలంక
రింపవలసినదే! గ్రంథములను సేకరించుటలో ఈయనకుం
గల ఆసక్తి యమితము!

ఆనందగజపతి మహారాజుగారికి ఇరువదేండ్ల వయ
స్సున వివాహము జరిగినది. రాజస్థానమునందలి జయపుర
రాజబంధువుల పుత్రిక వనకుమారీదేవి యీయన పట్ట
మహిషి. విజయరామగజపతి ప్రభువు, కుమారుని ప్రతిభను
గ్రహించి, లౌకిక విషయములందును చక్కని జ్ఞాన మల
వడుటకయి ఆ యుత్తరదేశము నంతటిని తిరిగి వచ్చి
నప్పుడు తమతోఁగూడ నీయనను తీసికొని వెళ్లిరి, అప్పుడు
ప్రముఖులగు ఇంగ్లేయులయొక్కయు, వివిధప్రాంతముల
ప్రభువులయొక్కయు పరిచయ మానందగజపతి రాజుగారికి

లభించెను. అందువలన ఎక్కువ విజ్ఞానము సంపాదింప నవకాశము కలిగెను.

ఆనంద గజపతిరాజుగారికి తలిదండ్రులయెడ భక్తి యధికము. ఆశ్రితులయెడల అనురక్తి యపారము. దీనుల యెడ దయ నిరవధికము. ఈయన సర్వదా విద్యాగోష్ఠులతో కాలము గడపుచుండెడివారు. ఈయన సభాభవనము శారదా నిలయము! ఆ సభాభవనము పండిత ప్రకాండు లకును, విద్వత్కవులకును, కూలంకష ప్రజ్ఞానిధులగు శాస్త్రవేత్తలకును, సంగీతవిద్వాంసులకును, లౌకికప్రజ్ఞా నిపుణులగు సామాజికులకును నిలయమయి యుండెడిది. జనకులగు విజయరామ గజపతి మహారాజుగా రీయనను జూడవచ్చినపుడెల్ల పాదరక్షలను సభాభవనము ద్వారము కడనే విడిచి లోనికేగుచుండెడివారట! ఇది చూచి ఆనంద గజపతిరాజుగారు 'కాలిజోడుతోనే లోనికి దయచేయవచ్చు' నని విన్నవింపఁగా, ఆ ప్రభువు "చిరంజీవీ! నీ భవనము శారదా నిలయము! మాది మోతీమహాలు! కావున పండి తులతో విద్యాప్రసంగములు కావించు నీవద్దకు కాలిజోడుతో వచ్చుట భావ్యము కాదు" అని చెప్పెడివారట! తండ్రికిఁ గుమారునియెడఁ గల గౌరవమట్టిది! కుమారుని వినయ సంపద యట్టిది! ఇట్టి పద్ధతి ప్రభుకుటుంబములలో మృగ్యమై యుండును.

తండ్రియనంతరము, ఆనందగజపతి ప్రభువు రాజ్యాధి కారమును స్వీకరించెను; కాని సంస్థానమునందలి యున్నతో

ద్యోగులకే రాజ్యకార్య నిర్వహణము నప్పగించి యీయన నిత్యము సంగీత సాహిత్య విద్యావినోదములతోఁ గాలము గడపుచుండెడివారు. ప్రతిదినము సాయంకాలము రాజభవనమున పండితసభ జరుగుచుండెడిది. అందు భాషా, వాఙ్మయములఁగూర్చియు, శాస్త్రీయవిషయములంగూర్చియు చర్చలు కావసాగుచుండెడివి.

ఆనందగజపతి ప్రభువు సంగీతమునందును గొప్ప కృషి చేసెను. సుప్రసిద్ధులగు గురాచార్యుల–వెంకటరమణ దాసు గారితోఁ గలిసి వీణావాదనాభ్యాసము చేయుచుండెడివారు. టెన్నిస్, క్రికెట్, పోలో ఆటలలోను, అశ్వారోహణము నందునుకూడ గొప్ప ప్రావీణ్యమును సంపాదించి యుండెను. నాటకకళయెడలను ఈయన కభిరుచి యెక్కువ. ఇందులకై యీయన యొక నాటకసమాజమును స్థాపించిరి.

ఆనందగజపతి ప్రభుని వితరణము ప్రశంసింపఁ దగినది. ప్రభుదర్శనము చేసికొనిన కవి పండితుల కోరిక లెన్నఁడును వ్యర్థము కాలేదు. ఈయన తమ కోటయందే 'విజయరామ విలాస ముద్రాక్షరశాల'యను అచ్చుకూటమును నెలకొల్పి, అందు పెక్కుగ్రంథములను ముద్రింపించి రచయితలకు ఎంతో ప్రోత్సాహము నిచ్చుచుండిరి. తండ్రిగారు స్థాపించిన ఆంగ్లపాఠశాలను మొదటితరగతి కళాశాలగా అభివృద్ధిపొందించిరి. కలకత్తా బౌబజారులోని 'ఇండియన్ ఎసోసియేషన్ ఫర్ ది అడ్వాన్స్‌మెంట్ ఆఫ్ సైన్స్ (Indian Association for the advancement of Science)" అను సంస్థయందు, అలహాబాదు విశ్వవిద్యాలయమునందలి

సెనెటుభవనమును, చెన్నపురమునందలి 'విక్టోరియా పబ్లిక్ హాలు'ను వీరి ద్రవ్యసహాయమున నెలకొల్పఁబడినవే! విజయనగరమున నొక విశ్వవిద్యాలయమును స్థాపింపవలె నను సంకల్పముకూడ ఈయనకు ఉండినది.

ఈ ప్రభువు చెన్నరాజధాని శాసననిర్మాణసభలో సభ్యులుగా నుండిరి. ప్రభుత్వమువారివలన 'మహారాజా, మన్నెసుల్తాన్, కె. సి. ఎస్. ఐ' మున్నగు బిరుదములను పొందిరి. తెలుఁగుదేశములో ప్రబలిపోయిన బాల్యవివాహములను, కన్యాశుల్కములను అరికట్టుటకు మిక్కిలి పాటుపడి లెక్కలను సేకరించిరి. ఈ విషయమున శాసనము నొనరించుటకును ప్రయత్నించిరి. సంఘసంస్కరణమున ఈయనకుఁ గల యభిలాష కీ యుద్యమమే తార్కాణము. కాని, ఆంధ్రుల దురదృష్టమువలనను, దైవదుర్విపాకము నను ఈ ప్రభువు ఏఁబదియేండ్లయినను నిండక పూర్వమే తమ సంకల్పములు కొన్ని కార్యరూపమును దాల్చుటకు ముందే 1897-వ సం. మే నెలలో దివంగతులైరి.

ఆనందగజపతిప్రభువు కీర్తిశేషులగుటకు ముందే వీరి సతీమణి వనకుమారీదేవి గతించెను. వీరికి సంతానము లేదు. కావున రాజమాత అలకరాజేశ్వరీదేవి తమ దగ్గరి బంధువుల చిన్నవానిని దత్తతచేసికొనిరి. ఆ దత్తపుత్రులే యిప్పటి విజయనగరప్రభువులు (శ్రీ) విజయరామగజపతిరాజు ((శ్రీ). పి. వి. జి. రాజు) గారి పితామహులు. ఈ దత్తత చెల్లదని జ్ఞాతులు కొంద అభియోగము తెచ్చిరి. కాని,

సంస్థాన శాసనపరిశోధకులు శ్రీ గురజాడ—అప్పారావుగారు, ధర్మశాస్త్రవేత్తలు శ్రీ తాతా - సుబ్బారాయశాస్త్రిగారు మున్నగు ప్రభుసేవాపరాయణులు తగిన సాక్ష్యములను సంపాదించి, న్యాయవాదులకు సాయపడి ఆ దావాను దత్తత కనుకూలముగ గెలిపించిరి. పిమ్మట కొంత కాలము ఆనంద గజపతి ప్రభుని సోదరియు, రేవారాణియు నగు అప్పలకొండ యాంబగారును, ప్రభుత్వపక్షమున సంరక్షకులగు శ్రీవిల్లకు వారగారును కలిసి, రాజ్యవ్యవహారములను చూచుచుండిరి.

శ్రీమతి అప్పలకొండయాంబగారు ప్రజాహిత కార్యములకై లక్షలకొలంది ధనమును ఖర్చుచేసిరి. విజయనగర ప్రజల మంచినీటి సౌకర్యమునకయి నగరమున కైదుమైళ్ల దూరమున నెల్లిమర్ల సమీపమున చంపావతీ నదినుండి గొట్టములద్వారా నీటిని తెప్పించి, జలాశయమున నిలువ చేయించి కొళాయిలు పెట్టించిరి. వారాణసీక్షేత్రమున కేదారఘట్టమునందు గంగానదికి సోపానములు కట్టించిరి. విజయనగరమున స్త్రీలకుఁ బ్రత్యేకముగ నొక వైద్యశాలను స్థాపించిరి.

శ్రీ అలకరాజేశ్వరీదేవి దత్తపుత్రులగు విజయరామ గజపతి రాజుగారు రాజ్యాధికారమును స్వీకరించిన పిదప విద్యావిషయమున అభివృద్ధికార్యముల నొనర్చిరి. వీరి కాలమునందే సంస్కృతకళాశాలకు పెద్ద భవనము నిర్మింపఁబడినది. ఆంగ్లకళాశాల కనుబంధముగ విద్యార్థులకు వసతి గృహము (హాస్టలు)ను ఏర్పడినది. గానకళాశాల స్థాపింపఁ

బడినది. విద్యార్థుల కుచితభోజనగృహ మేర్పాటయినది. ఈయన పెక్కుమంది పండితులను పోషించిరి. అనేకదాన ధర్మము లొనర్చిరి. ప్రతిదినము రామాయణాది పురాణ ములను చదివించి వినుచుండిరి.

ఈ ప్రభువునకు అలకనారాయణ గజపతిరాజు, విజయానందగజపతిరాజు అను ఇరువురు కుమారులు జనించిరి. అలకనారాయణగజపతి రాజుగారు అజమీరులోని రాజ కుమారుల కళాశాలలో విద్య నభ్యసించిరి. విదేశసంచారము చేసి, పాశ్చాత్యుల మన స్తత్త్వమును బాగుగా గ్రహించిన దిట్ట వీరు! స్వాతంత్ర్యప్రియులు! పాశ్చాత్య పద్ధతులయెడల అనాదరణ మెందు. ఆనువంశికములైన సంప్రదాయముల యెడ ఆదర మెక్కువ. రాజకీయములలో అభిలాష అధికము. వీరు చెన్నపురి శాసనసభకు పోటీచేసి, అత్యధిక సంఖ్యాకులచే సభ్యులుగా ఎన్నుకొనఁబడిరి. విద్వత్కవులు రచించిన గ్రంథములను కృతిపొందిరి. 'ఆంధ్ర భారతీ తీర్థ' (పరిశోధక విశ్వవిద్యాలయము) మున్నగు సంస్థల కార్థికముగ సాయపడిరి.

వీరి సోదరులు విజయానంద గజపతిరాజుగారు 'సర్ విజయ' అనియు, 'విజయనగరం మహారాజ కుమార్' అనియు ప్రసిద్ధిపొందిరి. కాశీ క్షేత్రమున వీరికొక కోట కలదు. వీరు క్రికెట్ ఆటలో గొప్ప నిపుణులు. కాంగ్రెసు వాది. కేంద్ర శాసనసభలో సభ్యులుగా కూడ ఉండిరి.

శ్రీ అలకనారాయణ గజపతిరాజుగారి కిద్దరు కుమారులు. జ్యేష్ఠులు శ్రీ పి. వి. జి. రాజుగారు. కనిష్ఠులు విశ్వేశ్వరగజపతిరాజుగారు. శ్రీ విజయరామగజపతిరాజుగారు చెన్నపురిలోను, పిదప అమెరికాలోను విద్య నభ్యసించి, జీవితమును ప్రజాహిత కార్యములకు ధారవోయుచున్నారు. కొంతకాలము సోషలిస్టుపార్టీ నాయకులు. లోకసభలో కొంతకాలము సభ్యులుగా నుండిరి. ఆంధ్రరాష్ట్ర శాసన సభా సభ్యులయి, కొంత కాలము ఆరోగ్యశాఖామాత్యులుగా ఉండిరి. ప్రస్తుతము విద్యాశాఖామాత్యులుగా ఉన్నారు. 1949 లో చెన్నపురి శాసనసభ ఏర్పఱచిన ఎస్టేట్ ఎబాలిషన్ ఆక్టు ననుసరించి తక్కిన సంస్థానములతో పాటు విజయనగరసంస్థానము కూడ ప్రభుత్వ పరమైనది. సంస్థానము స్థాపించిన సంస్థలు చాలవఱకు ప్రభుత్వ పర్యవేక్షణమునసే నడుపఁబడుచున్నవి. కాని, శ్రీ పి. వి. జి. రాజుగారు 'మహారాజా అలకనారాయణ సొసైటీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్స్ (MANSAS)' అను సంస్థను నెలకొల్పి తన్మూలమున ఆంగ్ల కళాశాలను తామే నిర్వహించుచున్నారు. ఇటీవలనే మహిళల కొఱకు కళాశాలను ఏర్పఱచియున్నారు.

# 3. గజపతిరాజుల కళాపోషణ

సంగీతము, కవిత్వము, నాట్యము, చిత్రలేఖనము, శిల్పము ప్రధానములైన లలిత కళలు. భారతదేశమును పాలించిన చక్రవర్తులు, వేర్వేఱు ప్రాంతములను పాలించిన రాజులు, జమీందారులు, ఈ కళలను పోషించుచునే యుండిరి. ప్రాచీనకాలపు శిల్ప ఖండములు, తైలవర్ణ చిత్రములు, అమూల్యములగు అముద్రిత గ్రంథములు నేఁడు ముఖ్య నగరములందును, ఆ యా ప్రాంతముల రాజధానులందును ప్రదర్శనశాలలలో భద్రపఱుపఁబడి యున్నవి. వానిని చూచినచో, ఈ లలితకళల పట్ల ప్రాచీనుల కెంత యాదర ముండినదో తెలియఁగలదు. దక్షిణ భారతమునందు హైదరాబాదు, మైసూరు, తిరువనంతపురము, తంజావూరు మున్నగు స్థలములలోఁగల వస్తు ప్రదర్శనశాలలు జను లందఱి హృదయముల నాకర్షింపఁజాలి యున్నవి.

ఆంధ్రప్రదేశమునఁగల విజయనగర సంస్థానమునందును అమూల్యములగు కళా ఖండములు చాల కలవు. విజయనగరమునఁ ప్రత్యేకముగ వస్తు ప్రదర్శనశాల లేకున్నను, సంస్థానప్రభువుల దుర్గమునందలి రాజభవనమే ఒక ప్రదర్శనశాల యని చెప్పవచ్చును. దుర్గ నిర్మాణ పద్ధతియే యొక అపూర్వ శిల్పకళకు మచ్చుతునుక. రాజభవనమునందలి చిత్రములు, శిల్పఖండికలు ఆ యా కాలములందలి కళానైపుణ్యమును వెల్లడించుచున్నవి.

సంస్థాన శాసనపరిశోధకులు శ్రీ గురుజాడ-అప్పారావుగారు, ధర్మశాస్త్రవేత్తలు శ్రీ తాతా - సుబ్బారాయశాస్త్రిగారు మున్నగు ప్రభుసేవాపరాయణులు తగిన సాక్ష్యములను సంపాదించి, న్యాయవాదులకు సాయపడి ఆ దావాను దత్తత కనుకూలముగ గెలిపించిరి. పిమ్మట కొంతకాలము ఆనంద గజపతి ప్రభుని సోదరియు, రేవారాణియు నగు అప్పలకొండ యాంబగారును, ప్రభుత్వపక్షమున సంరక్షకులగు శ్రీవిల్లకు పొరగారును కలిసి, రాజ్యవ్యవహారములను చూచుచుండిరి.

శ్రీమతి అప్పలకొండయాంబగారు ప్రజాహిత కార్యములకై లక్షలకొలది ధనమును ఖర్చుచేసిరి. విజయనగర ప్రజల మంచినీటి సౌకర్యమునకయి నగరమునకై దుమ్మెళ్ల దూరమున నెల్లిమర్ల సమీపమున చంపావతీ నదినుండి గొట్టములద్వారా నీటిని తెప్పించి, జలాశయమున నిలువ చేయించి కొళాయిలు పెట్టించిరి. వారాణసీక్షేత్రమున కేదారఘట్టమునందు గంగానదికి సోపానములు కట్టించిరి. విజయనగరమున స్త్రీలకుఁ బ్రత్యేకముగ నొక వైద్యశాలను స్థాపించిరి.

శ్రీ అలకరాజేశ్వరీదేవి దత్తపుత్రులగు విజయరామ గజపతి రాజుగారు రాజ్యాధికారమును స్వీకరించిన పిదప విద్యావిషయమున అభివృద్ధికార్యముల నొనర్చిరి. వీరికాల మునందే సంస్కృతకళాశాలకు పెద్ద భవనము నిర్మింపఁబడి నది. ఆంగ్లకళాశాల కనుబంధముగ విద్యార్థులకు వసతి గృహము (హాస్టలు)ను ఏర్పడినది. గానకళాశాల స్థాపింపఁ

చేరుగాంచిన కలిగొట్ల-కామరాజుగారు, రుద్ర వీణా వాదన నిపుణులగు కవిరాయని - రమణయ్యగారు, హిందూస్థానీ సంగీతమున మంచి వైదుష్యము కల మహాంత్ ఖానుగారు, సుప్రసిద్ధ వైణికులగు గురాచార్యుల - వెంకటరమణదాసు గారు మున్నను సంగీత విద్వాంసు లుండిరి! మహారాజు గారు (శ్రీ) వెంకటరమణదాసుగారితో కలసి వీణా సాధన చేయుచుండెడివారని యిదివఱకే చెప్పఁబడినది.

ఈ ప్రభువు తన యాస్థాన విద్వాంసులనే కాక యితర సంస్థానములనుండి వచ్చిరి. గాన కళావేత్తలను కూడ గొప్పగా గౌరవించుచుండిరి. ఒకప్పుడు మైసూరు సంస్థాన సంగీత విద్వాంసుఁడు బిడారం - రాచప్ప ఆనంద గజపతి ప్రభువున కత్యంత ప్రియమైన ఆనంద భైరవి రాగములో 'ఎందుకీ తొందర సుందరాకార! నీ పొందు గూడెద, తాళరా!' అను జావళీని గానము చేసి ప్రభువు యొక్కయు, సభ్యులయొక్కయు ప్రశంసలను పొందెను. అందలి చివరి చరణమైన,

> "..................................అభినవ
>
> భోజ! భోగబిడౌజమానస! తేజమలర నిన్నుగూడెద,
>
> రాజ శ్రీ ఆనందగజపతిరాజ మహారాజ తేజా!"

అనునది యచటివా రందరిని చకితుల నొనర్చెనఁట! ప్రభువు మిక్కిలి యానందించి ఆ సంగీత విద్వాంసుని, వేయినూట పదార్ల రూప్యములతో సత్కరించెను. ఆ

విజయనగర ప్రభువు లే యే కళలకుఁ బ్రోత్సాహ మొసంగి పోషించిరో వివరముగాఁ దెలిసికొనుటకుఁ దగిన సాక్షాధారములు లభింపలేదు. ఆస్థానములో కవి, పండితులతోఁబాటు సంగీత విద్వాంసులు నుండుటవలనను, నట్టువకత్తెలు సభా సమయముల నాట్య మొనర్చుచుండుట వలనను కవిత్వ కళతోఁబాటు సంగీత నాట్యకళలను కూడ వీరు పోషించుచుండినట్లు చెప్పవచ్చును.

ఆనందగజపతి మహారాజుగారి జనకులగు విజయరామగజపతి మహారాజుగా రశ్వ శిక్షణమున మిక్కిలి ఆఱితేఱినవారు, మల్లవిద్య యనిన ఆయనకు ప్రీతి యధికము. ఆ విద్యయం దాఱితేఱిన మల్లవీరులు ఆయనదగ్గఱ నుండిరి. మల్లవిద్యా ప్రదర్శనములలో వారి నెట్టివారు నోడింపఁజాలకుండిరి. ఆయన చేతితో నూవులను పిండి, నూనె కారెడునట్లు చేసెడివారఁట! నాట్య విషయమునను ఆయన యాసక్తి ప్రశంసనీయము! ఒకప్పుడు నాట్య ప్రదర్శన మొనర్చిన యొక నట్టువకత్తెకు అపారమగు ధనము నిచ్చి తృప్తిపఱచినట్లు పెద్దలు చెప్పిన వృత్తాంతములవల్ల తెలియుచున్నది.

ఆనందగజపతి మహారాజుగారి కాలమున కళలన్నియు నభివృద్ధి చెందినవి. ఆ ప్రభువు సాహిత్యమునందు వలెనే సంగీతమునందును సాటిలేని విద్వాంసుఁడు. ఆయన యాస్థానమునందు సుప్రసిద్ధ వీణా విద్వాంసులగు దూర్వాసుల - సూర్యనారాయణశాస్త్రిగారు, ఫిడేలు వాద్యమునఁ

చేరుగాంచిన కలిగొట్ల-కామరాజుగారు, రుద్ర వీణా వాదన నిపుణులగు కవిరాయని - రమణయ్యగారు, హిందూస్థానీ సంగీతమున మంచి వైదుష్యము కల మహంత్ ఖానుగారు, సుప్రసిద్ధ వైణికులగు గురాచార్యుల - వెంకటరమణదాసు గారు మున్నను సంగీత విద్వాంసు లుండిరి! మహారాజు గారు శ్రీ వెంకటరమణదాసుగారితో కలసి వీణా సాధన చేయుచుండెడివారని యిదివఱకే చెప్పఁబడినది.

ఈ ప్రభువు తన యాస్థాన విద్వాంసులనే కాక యితర సంస్థానములనుండి వచ్చిరి. గాన కళావేత్తలను కూడ గొప్పగా గౌరవించుచుండిరి. ఒకప్పుడు మైసూరు సంస్థాన సంగీత విద్వాంసుఁడు బిడారం - రాచప్ప ఆనంద గజపతి ప్రభువున కత్యంత ప్రియమైన ఆనంద భైరవి రాగ ములో 'ఎందుకీ తొందర సుందరాకార! నీ పొందు గూడెద, తాళరా!' అను జావళీని గానము చేసి ప్రభువు యొక్కయు, సభ్యులయొక్కయు ప్రశంసలను పొందెను. అందలి చివరి చరణమైన,

"..................................అభినవ

భోజ! భోగబిడౌజమానస! తేజమలర నిన్నుగూడెద,

రాజ శ్రీ ఆనందగజపతిరాజ మహారాజ తేజా!"

అనునది యచటివా రందరిని చకితుల నొనర్చెనఁట! ప్రభువు మిక్కిలి యానందించి ఆ సంగీత విద్వాంసుని, వేయినూటఁట పదార్థ రూప్యములతో సత్కరించెను. ఆ

కాలమున నిట్టి ఘన సత్కారము జరుగుట మిక్కిలి యరుదు!

గత శతాబ్దములో మన ప్రాంతమున నాటక కళకుఁ దగిన ప్రోత్సాహము లేకుండెను. తోలుబొమ్మలాటలు, వీథి భాగవతములు మాత్రము ప్రచారములో నుండెడివి. పార్సీ కంపెనీలవారు తెలుఁగు దేశమునఁ బర్యటించుచు, ఆంధ్రులకు నాటకకళయెడల అభిరుచిని కలిగించిరి. ఆ నాటక సమాజముల వేషభాషలు, అభినయపద్ధతులు, పాటల తీరులు, తెరల యమరికలు ప్రజానీకపు హృదయములను బాగుగ నాకర్షించినవి. అందువలన మహారాజులు, జమీందారులు, భూస్వాములు తెలుఁగునాట నాటక సమాజములను స్థాపించి నాటక ప్రదర్శనములకుఁ బూనుకొనిరి. రసికాగ్రగణ్యుఁడగు ఆనందగజపతిప్రభువు కూడ ఒక నాటక సమాజమును స్థాపించి, ఉత్తమ నటుల మూలమున నాటకములను ప్రదర్శింపఁజేయుచుండెను. అప్పుడు చెప్పుకోనఁదగిన తెలుఁగు నాటకములు లేవు. కావున ఆయన పోషణమున నుండిన నాటక సమాజము సంస్కృత నాటకములనే ప్రదర్శించుచుండెడిది. అభిజ్ఞాన శాకుంతలము, విక్రమోర్వశీయము, వేణీసంహారము, మాళవికాగ్ని మిత్రము ఆది ప్రదర్శించు నాటకములలో ముఖ్యమైనవి. ఈ సమాజము బుచ్చిశాస్త్రి యాధ్వర్యమున కార్యకలాపములను జరుపుచుండుటచే దీనికి 'బుచ్చిశాస్త్రి కంపెనీ' అను పేరు వచ్చినది. చొప్పల్లి - నరసింహము, కట్టా- పాపయ్యశాస్త్రి, పప్పు-అప్పయ్యశాస్త్రి, పప్పు-వేంకట

శాస్త్రి, ఆదిభట్ల-జగ్గావధానులు అను సంగీత సాహిత్యవేత్త లిందలి సభ్యులు. నాట్యకళావేత్త శ్రీనివాసాచార్యులు గారు దర్శకులు. ఈ సభ్యులలో చొప్పల్లి - నరసింహాము గారు కథానాయికా పాత్రమును, కఱా - పాపయ్యశాస్త్రి గారు విదూషక పాత్రమును ధరించెడివారు. శ్రీ ఆదిభట్ల-నారాయణదాసుగారి సోదరులగు జగ్గావధానులుగారు రాక్షస వేషమును వేయుచుండిరి. ఆనందగజపతి ప్రభుని యనంతర మీ నాటకసమాజము నామమాత్రావశిష్ట మైనది.

ఆనందగజపతి ప్రభువు సంస్కృత నాటకములనే కాక 'హరిశ్చంద్ర' మున్నగు ఆంగ్ల నాటకములను, 'కన్యాశుల్కము'ను శ్రీనివాసాచార్యులుగారి దర్శకత్వముననే ప్రదర్శింపఁజేయుచుండెను.

ఈయన యనంతరము రాజ్యమునకు వచ్చిన శ్రీ విజయరామగజపతి మహారాజుగారికి సంగీతమునందును, నాటకకళయందును ఎక్కువ యాసక్తి. ఈయన 'శ్రీ విజయరామనాటక సంఘము' (శ్రీ విజయరామ డ్రమెటిక్ అకాడమీ.) అను నాటక సమాజమును నెలకొలిపి, అందలి నటకులకును, దర్శకులకును నెలజీతము లిచ్చి, దాని మూలమున నాటకములను ప్రదర్శింపఁజేయుచుండెడివారు.

ఈ ప్రభువు 1919-వ సంవత్సరమున 'విజయరామ గాన కళాశాల' యను నొక సంగీత కళాశాలను స్థాపించెను. నాఁడాంధ్రదేశ మంతటికిని సంగీత శాస్త్రమును బోధించు

కళాశాల యిది యొక్కటే! ఇందు విద్య నభ్యసించు విద్యార్థులకు ఉచితభోజనము, బస, ఉచిత విద్య యేర్పాటు చేయఁబడినవి. గాత్రము, వీణ, వాయులీనము, మృదంగము, భరతనాట్యము ఈ కళాశాలయందు బోధింపఁబడును. శ్రీ అజ్జాడాదిభట్ల - నారాయణదాసుగారు, శ్రీ ద్వారం-వెంకటస్వామినాయుఁడుగారు మున్నగు ప్రఖ్యాత విద్వాంసులు ఈ విద్యాలయమున ప్రధానాచార్యులుగా పని చేసి యుండిరి. నేఁటి కాలమున ఆంధ్ర దేశమున సుప్రసిద్ధులై యున్న సంగీత విద్వాంసులలో పెక్కుమంది యీ కళాశాలలో విద్య నభ్యసించి కృతార్థులైనవారే!

విజయరామగజపతి మహారాజుగారి పుత్రులగు అలకనారాయణగజపతి మహారాజుగారి రాజ్యకాలమునను, తండ్రిగారు పోషించుచుండిన సంస్థలు అవిచ్ఛిన్నముగ కొనసాగునట్లు గమనింపఁబడుచుండినవి. వీరి కాలముననే గానకళాశాలలో భరతనాట్యమునకుఁ గూడ ప్రవేశము కలిగినది. ఈ విద్యాలయ మాంధ్ర విశ్వకళాపరిషత్తున కనుబంధ కళాశాలగా ఒవరింపఁబడినది.

అలకనారాయణగజపతి మహారాజుగారి పుత్రులును, ఆంధ్రప్రదేశ ప్రభుత్వమున విద్యాశాఖామాత్యులును అగు విజయరామగజపతిరాజుగారు (శ్రీ పి. వి. జి. రాజుగారు) విద్యావిషయములందే కాక లలిత కళలయందును ఎక్కువ

ఆసక్తి కలవారు. వీరు శ్రీ ఎ. పైడిరాజుగారు స్థాపించిన చిత్రకళాశాల, తమ దుర్గములోని యొక భవనములో నుండుట కనుమతి నొసంగి, చిత్రకళకెక్కువ ప్రోత్సాహ మొసఁగుచున్నారు. శ్రీ డి. వై. సంపత్కుమార్ గారు స్థాపించిన గీతానృత్యకళాశాలకయి తమ సఫేద్ మహలులో వసతిని కల్పించిరి. వీరి ప్రోత్సాహమువల్లనే యీ విద్యాలయము దినదినాభివృద్ధిఁగాంచి, భారతదేశములోని పెక్కు మహానగరములలో ప్రదర్శనముల నొసంగుచు సాటిలేని యశస్సును సంపాదించుచున్నది.

# 4. గజపతిరాజుల ఆంధ్రసాహిత్య పోషణము

ప్రభువుల కీర్తి ఆచంద్రతారార్కముగా స్థిరమై యుండుటకు వారు పోషించు వాఙ్మయమే ప్రధానము, ఆ వాఙ్మయపోషణ కవిపండిత పోషణపైనే ఆధారపడియున్నది. అట్లే కవుల కీర్తి శాశ్వతముగా నిలుచుటకు ప్రభువులే కారణము. 'నిరాశ్రయా న శోభన్తే పండితా వనితా లతాః' అను నానుడి ప్రసిద్ధమే! ఈ యంశమును గుర్తించియే మన దేశమునందలి ప్రాచీన పరిపాలకులు కవిపండిత పోషణమును ప్రధానముగా గ్రహించి తమ యాస్థానములలో పెక్కుమంది విద్వత్కవుల కాశ్రయము కల్పించుచుండిరి. కవులును ప్రభువులయెడ కృతజ్ఞతను చూపుచు, గ్రంథములను రచించి, వానిని తమ పాలకుల కర్పింపసాగిరి. క్రమముగా నిది యొక సంప్రదాయమైనది. విద్వత్కవుల సాహచర్యమువలన పాలకులును భాషావాఙ్మయములలో చక్కని పాండిత్యమును సంపాదించి స్వయముగ గ్రంథరచనకుం బూనుకొనుచుండిరి. తెలుంగు దేశములోని వేర్వేఱు సంస్థానములను పాలించిన ప్రభువు లందరును – ఇంచుమించుగా– విద్వత్కవులే యని చెప్పక తప్పదు. కాకతీయ ప్రభువులు, రెడ్డిరాజులు, వెలమదొరలు, విజయనగర చక్రవర్తులు నిట్టివారే!

విజాతీయుల యొత్తిడివల్లను, దేశములోని పాలకుల యనైక్యమువల్లను ఆంధ్రమహాసామ్రాజ్యము ఛిన్నా

భిన్నములయి, వేర్వేఱు చిన్నచిన్న రాజ్యము లేర్పడినను, ఆ యా ప్రాంతముల పాలకులు మాత్రము స్వభాషాభిమానమును విడువక వాఙ్మయసేవ యొనర్చుచునే యుండిరి. అట్టి వారిలో విశాఖపట్టణమండలమునకుఁ జెందిన విజయనగర సంస్థానప్రభువులు ముఖ్యముగ ఎన్నఁదగినవారు. విజయ నగర సామ్రాజ్య పతనానంతరము దక్షిణప్రాంతమున తంజావూరు ప్రభువులవలెనే ఉత్తర-సర్కార్లలో తెలుఁగు భాషా-సాహిత్యముల కాశ్రయ మొసఁగిన సంస్థానాధిపతు లలో వీరు ముఖ్యులు!

క్రీ. శ. 1720-85 మధ్యకాలమున నుండిన అడిదము-సూరకవి చెప్పిన క్రింది చాటుపద్యము

చ. 'ఇరువదిమూఁడు పూరుషము లిప్పటికయ్యెఁ గవిత్వవృత్తిచే
నరపతులెల్ల మెచ్చఁ; బదునాల్గు తరంబులు మించు పిమ్మటన్
నెరవగు జీవనస్థితి లభించుటః; తొమ్మిది యయ్యెఁ బూసపాం
తరయులు నిక్కలింగ వసుధాధిపు చెంగట నాశ్రయించుటల్.'

ఆ మహాకవి వంశమువారు తొమ్మిది తరముల నుండియు విజయనగర ప్రభువుల కాశ్రితులుగా ఉన్నట్లు తెలియఁజేయుచున్నది. కావున సూరకవికి ముందే ఇంచు మించు మూఁడు శతాబ్దములనుండియు ఈ సంస్థానము విద్వత్కవులను పోషించుచు వాఙ్మయసేవ యొనర్చుచుండెనని చెప్పవచ్చును. సూరకవి వంశస్థులలో ప్రాచీనుఁడగు నీలాద్రికవి 15-వ శతాబ్దినడిమిభాగమున నుండిన పూసపాటి - తమ్మిరాజుగారివద్ద నుండెననియు, ఆ ప్రభుని రణ-

రంగవిహారమును వర్ణించుచు 'రణరంగవిజయ'మను కావ్యమును రచించెననియు, ప్రభు వా కవిని మెచ్చుకొని ధనము నపారముగ నొసంగి సత్కరించుటయే గాక ఒక 'అడిదము'ను (కత్తిని) కూడ బహూకరించెననియు శ్రీ అడిదము-రామారావుగారు తమ 'అడిదము సూరకవి జీవితము'లో వివరించి యున్నారు. నీలాద్రికవి గ్రంథము లభింపలేదు.

విజయనగర ప్రభువుల వంశములో సుప్రసిద్ధుడగు చిక్కభీమునిపై వేములవాడ - భీమకవి చెప్పిన చాటువు సుప్రసిద్ధమైన 'గరళపుముద్ద' అనునది కలదు. కావున భీమకవి యా ప్రభుని పోషణమున నుండెనని కాని, అతని యాదరమును పొంది యుండెనని గాని చెప్పవలెను.

తమ్మిభూపాలుని కుమారుడగు రాచిరాజు మహావీరుడే కాక గొప్ప విద్వత్పోషకుడు. ఇతడు 'నవభారత' మనెడి ప్రబంధమునకు కృతిభర్త యైనట్లు శ్రీకృష్ణవిజయమునుబట్టి తెలియుచున్నది. కాని ఆ గ్రంథము లభింపలేదు. దాని నెవ్వరు రచించినదియు కూడ తెలియదు.

రాచిరాజునకు బిదప ప్రసిద్ధుడైన భాషాభిమాని కృష్ణరాజు. ఇతడు 'రుక్మిణీపరిణయ'మను ప్రబంధమును కృతి పొందెను. ఈ విషయము కూడ శ్రీకృష్ణవిజయమును బట్టియే తెలియుచున్నది. ఆ గ్రంథము లభించలేదు. అందు వలన గ్రంథకర్త యెవ్వరో కూడ తెలిసికొనుటకును అవకాశము లేదు. అయినను, ప్రభువుల కాంధ్రవాఙ్మయముపట్ల

అభిమానమున్నట్లును, వారు వాఙ్మయమును పోషించి నట్లును వీనినిబట్టి తెలియుచున్నది.

విజయనగర పాలకులు వివిధవిద్యలయందు నిష్ణాతు లయి, విద్వత్కవిపోషకులై కృతుల నందుకొనుచున్నను, 17-వ శతాబ్దియం దుండిన తమ్మిరాజుగారివఱకును ఎవ్వ రును స్వయముగ గ్రంథరచనకుఁ బూనుకొన్నట్లు కాన రాదు. 1620-1700 నడిమికాలమున ఉండిన ఈ ప్రభువు శ్రీకృష్ణవిజయ మను ప్రబంధమును రచించి తన యశస్సు శాశ్వతమగున ట్లొనర్చెను. ఈ తమ్మిరాజుగారి యాస్థాన ములో కొందరు విద్వత్కవు లుండిరి. ప్రభువే ప్రబంధకర్త యైనప్పుడు, ఆస్థానవిద్వత్కవులు కూడ కొన్ని గ్రంథములు రచించి యుండనచ్చునని యూహింపవచ్చును, కాని అవి ఏవియును లభ్యములు కానందున 'ఇదమిత్థ'మ్మని నిర్ణయింప సాధ్యము కాదు.

తమ్మిరాజునకుఁ దర్వాత రాజ్యమును పాలించిన వెంకటపతి మహీపాలుఁడును గొప్ప విద్వాంసుఁడు. ఇతఁడును స్వయముగ గ్రంథకర్త. 'ఉషాభ్యుదయము' అను ప్రబంధ మును రచించి తన భాషావాఙ్మయాభిమానమును వెల్ల డించెను. ఇతనితర్వాత రాజ్యమును పాలించిన ఆనంద మహీపతి 'నవరామాయణ' మను కావ్యమును రచించెను. వీ రిర్వురి యాస్థానమునందును కొందరు విద్వాంసు లుండి వాఙ్మయసేవ చేసి యుందురు.

ఫ్రెంచి సేనాధిపతి యగు మోన్సియరు బుస్సీ మిత్రులును, బొబ్బిలియుద్ధమున వీరస్వర్గమును అలంకరించినవారును అగు పెదవిజయరామ గజపతిమహారాజుగారి కాలమునను వాఙ్మయాభివృద్ధి కొంతవఱకును జరిగినది. సుప్రసిద్ధవిద్వత్కవి యగు గోగులపాటి - కూర్మనాథకవి యీయన పోష్యవర్గములోనివాఁడే! నరాంకితముగ గ్రంథములను రచింపనొల్లని యీ కవి భగవదంకితముగా 'లక్ష్మీనారాయణసంవాద'మను పద్యకావ్యమును, 'మృత్యుంజయవిలాస'మను యక్షగానమును, 'సింహాద్రి నారసింహశతకము'ను రచించెను. విజయనగర సంస్థానాధీశులు తమ పోషణములో నుండు విద్వత్కవులను తమకుఁ గృతియిమ్మని నిర్బంధించుట లేదు. వాఙ్మయపోషణమే వారి ప్రధానలక్ష్యము, అయినను కూర్మనాథకవిపయి అసూయ గల కొందఱు లేనిపోని కథలు కల్పించి ప్రభువుల నా కవి తిరస్కారభావముతోఁ జూచుచున్నట్లు మహారాజుగారికిఁ దెలుపఁగా, ఆయన తన కంకితముగా నొక కృతిని రచింపవలెనని కూర్మనాథకవిని కోరెనఁట! తన నియమమునకు భంగముకాని, ప్రభువున కసంతృప్తి కాని కలుగనిరీతిని ఈ కవి "విజయరామా! రామతీర్థాశ్రయా!" అను మకుటముతో ఒక శతకమును రచించెను.

ఈ శతకమును చూచినపిదపఁ గూడ అసూయాగ్రస్తులు మఱల ప్రభువునొద్దకుఁ బోయి 'ఈ శతకము భగవంతుఁడగు శ్రీరామచంద్రుని పరముగాఁ జెప్పఁబడినదే గాని, ప్రభువుల కంకితముగాఁ జెప్పఁబడినది కాదు" అని

మనవిచేసిరి. అయినను ప్రభువు వారిమాటను వినలేదు. ఏ విధముగా నయినను తనపేరా పద్యములలో ఉన్నందుకే ఆయన తృప్తిచెందెను. దీనింబట్టి గ్రంథములను కృతిపొంద వలెనను పట్టుదల యీ ప్రభువున కున్నట్లు తోఁచదు. సమర్థులైన విద్వత్కవులు తమ పోష్యవర్గములో ఉండుట వలననే వీరు సంతృప్తి పొందెడివారు.

కూర్మనాథకవి కృతులన్నియు నా యీ విభాగము లలో ప్రముఖస్థానము నాక్రమించినవి. శతకములలో 'సింహాద్రి నారసింహాశతకము' అత్యుత్తమశ్రేణికిఁ జెందినది. దీనికిఁ జరిత్రతోఁగూడ కొంత సంబంధ మున్నది.

ఆ కాలమున ప్రభుత్వమునకుఁ బ్రజాపాలనమున ఎక్కువశ్రద్ధ యున్నట్లు తోఁచదు. కావునఁ దఱచుగ మరాఠీల దండు, తురకల దండు తెలుఁగు దేశములోని వివిధ ప్రాంతములపైఁబడి, కొల్లగొట్టుట, ప్రజలను పెక్కు విధముల హింసించుట జరుగుచుండెడిది, ఒకప్పుడు ఒక తురకలదండు విశాఖపట్టణము సమీపమునఁ గల చోడవరము మున్నగు గ్రామములలోని దేవాలయములను ధ్వంసము చేసినట్లును, ఆ దండు సింహాచలమునకుఁ గూడ రానున్నట్లును తెలిసినది. సింహాచలముసందలి జనులు మిక్కిలి భీతిఁజెందిరి. ఆ సమయమున కూర్మనాథకవి సింహాచలమునందే యుండెను. అతఁడు దేవాలయములో భగవత్సాన్నిధ్యమున దీక్షగాఁ గూరుచుండి, తురకల యుపద్రవమును తప్పింపవలెనని భగవంతునిఁ బ్రార్థించుచు, ఆశువుగా 'వైరి హారరంహా!

సింహాద్రి నారసింహా!' అను మకుటముతో శతకమును చెప్ప నారంభించెను. శతకము, తొలుత భగవత్ప్రశంస తోనే ప్రారంభమయ్యెను. అప్పటికే తురకల దండు విశాఖ పట్టణముదగ్గర నున్న 'తుమ్మెదల మెట్ట' వద్దకు వచ్చినట్లు తెలిసినది. అంత కూర్మనాథకవి దేవుని ఉపాలంభించుచు—

సీ. 'హా' లీయవచ్చిన భామిని ప్రాణంబు
    అపహరించి చెలంగినట్లు గాదు;
యాగోత్సవంబున కతిమోదమునఁ బిల్వ
    వచ్చు మామను ద్రుంచినట్లు గాదు;
చేతఁగా కొక చరచేతఁ జట్టంబుల
    నందరఁ జంపించినట్లు గాదు;
తుంగ కల్పించి యుత్తుంగ వంశద్రోహ
    మాచరించి చెలంగినట్లు గాదు;

గీ. పరబలం బిది; నీ ప్రజ్ఞ పనికిరాదు;
లెమ్మిఁకను మీనమేషముల్ లెక్కయిడక;
చొరవఁ దురకలఁ గొట్టఁగాఁ జక్కలేదుర?
వైరిహరరంహ! సింహాద్రినారసింహ!

సీ. అభీరగృహముల వారఁగాఁగిన పాల
    మీఁగడల్వడి దిగమ్రింగఁ గలవు;
తల్లి యిచ్చినచల్ది తగ బ్రహ్మ వచ్చిన
    వెనుకఁ జూడక వేగ విసరఁగలవు;
రాధికామధురాధరామృత ధారలు
    గుటుకుగుటుక్కునఁ గ్రోలఁగలవు;
భక్తు లెల్లరుఁ జిరుపదార్థములు దాసంగఁ
    బెంచి లోలోన భక్షింపఁగలవు;

గీ. గాని యవనులపై వడిఁ బూనలేవు;
కబళమున నోరు తెఱతువు; కల్యమన్న
మోము దిప్పు హా యుగ్రమూర్తి వహహా!
వైరివారరంహా! సింహాద్రి నారసింహా!

అని యీ రీతిని గొన్ని పద్యములు చెప్పునరికి తుమ్మెదల మెట్ట గుహనుండి వేలకొలఁది తుమ్మెదలు చెలరేఁగి తురకలపంతుపైఁ బడి, కఱచి నెత్తురు పీల్చి చించి చెండాడెనఁట! ఈ విషయమును తెలిసికొనిన కూర్మనాథకవి, సింహాచల నృసింహస్వామి యనుగ్రహమే యిట్లగుటకుఁ గారణమని విశ్వసించి, వెంటనే యిట్లు చెప్పెను—

సీ. కారుణ్యదృష్టిచేఁ గని మమ్ము రక్షింప
నీరజేక్షణ! నీవు నేఁడు పంపఁ
బారసీకుల దండుపైఁ గొండలోనుండి
గండుతుమ్మెదలు మద్దండలీలఁ
గల్పాంతమున మిన్ను గప్పి భీకరమైన
కాఱుమేఘంబులు గలిసినట్లు
తాఁకి భోరున రక్తధారలు గురియఁగాఁ
గఱచి నెత్తురు పీల్చి కండలెల్ల

గీ. నూడిపడ నక్కమూతుల వాఁడి మెఱసి
చించి చెండాడి వధియించెఁ జిత్రముగను
నొక్కకనిఁ జుట్టుముట్టి బల్మిక్కుటముగ
వైరివారరంహా! సింహాద్రి నారసింహా!

సీ. జయమాయె; యవనరాట్సంతమసము పాసె
భవదీయభాస్వత్ప్రభాబలమున;

భువనజాతంబులు పొలుపుచేఁ జేసొంద;
దిక్చక్రములు చాల తెలివినొంద;
కమలజాదుల మతుల్ గణనసేయని నీవు
లీల వామనవై చెల్లించినావు;
బ్రహ్మాండభాండసంభరణ శ్లాఘన
విల నిచ్చు మెచ్చి యేమియ్యఁగలము?
గీ. తోఁచదిఁక నెట్టు; లీవె నాకుఁ దోఁచినట్టు
తులసిదళ మొక్కటిత్తు సంతోషమొందు;
మఱియొ యగణితపూజనా నవధరింపు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!"

పయి సంఘటన యీతని కవిత్వమునకు వన్నెఁ దెచ్చినది.

ఇతని శృంగార కావ్యమగు లక్ష్మీనారాయణ సంవాదము కల్యాణోత్సవ సమయములలో సింహాచల, పద్మనాభ, శ్రీరామతీర్థ, శ్రీకూర్మక్షేత్రములందు గానము చేయుటకుద్దేశింపఁబడినది.

పెదవిజయరామగజపతి మహారాజుగారి కాలమునకు సుప్రసిద్ధుఁడగు అడిదము-సూరకవి యువకుఁడు. ఈ కవి, ప్రభువు లొసంగిన మాన్యములను వంశపరంపరగా ననుభవించుచు, అప్పుడప్పుడు ప్రభువుల యాస్థానమునకు వచ్చుచుండెడివాఁడు. క్రీ. శ. 1746-వ సంవత్సరములో ఈ విజయరామగజపతి ప్రభువునకును, బాదుల్లాఖా ననెడి తురుష్క పీరునకును జరిగిన యుద్ధమును వర్ణించుచు సూరకవి-

‘శా. ఢిల్లీశోపల గోలకొండపురి నిండెన్ నీప్రశంసల్; గుజాల్
బల్లాలం బొడిపించి హుమ్మని యరబ్బా నెక్కి పైకొంచు శా
దుల్లాఖానునిఁ బారఁదోలితివి; నీదోశ్శక్తి నూబాలకన్
మల్లింపం దరమా నె? శ్రీ విజయరామా! మండలాధీశ్వరా!’

అని ప్రశంసించి యున్నాఁడు. ఈ సూరకవి తండ్రి యగు బాలభాస్కరకవియు గొప్ప కవి. శుద్ధాంధ్ర రామాయణము మున్నగు గ్రంథములకుఁ గర్త. ఇతఁడు కూడ విజయనగర సంస్థానాస్థానకవియై యుండవలెను. ఇతని గ్రంథములు కాని, చాటుపద్యములుగాని లభించలేదు. ‘సరోజనేత్ర! రామతీర్థ జానకీమనోహరా!’ అను మకుటము గల పంచచామర వృత్తములు మాత్రము కొన్ని లభించినవఁట! ఈతని గ్రంథములగు శుద్ధాంధ్రరామాయణము, లక్షణసారము శ్రీరామతీర్థమునందలి శ్రీరామచంద్రునకే అంకితములు!

పద్మనాభయుద్ధమున వీరస్వర్గము నలంకరించిన చిన విజయరామ గజపతి మహారాజగారును గొప్పవిద్వాంసులు! సంస్కృతాంధ్రములయందు కవనము చెప్పఁగల సమర్థులు. వీరి సంస్కృతకవితకు, పెద్దాపుర సంస్థానాధిపతులు శ్రీ వత్సవాయి - తిమ్మ జగపతి మహారాజగారిపైఁ జెప్పిన శ్లోకమే తార్కాణము. అది—

శ్లో. “అంభోజం కలయన్ సదృక్షమవనే సాహిత్యరీత్యాం దృశో
ర్మాంధాతార మపారసంపది మహాభావే యశోరాశిషు,
శత్రూణాం పురభంజనే ధృతిగుణే కించోరగేంద్రం మతి
ప్రాగల్భ్య ప్రతిభాతి తిమ్మనృపతిః పాకాహితప్రాభవః.”

"యుద్ధములో మరణించిన వారికి వీరస్వర్గ మున్నదా!" అని ప్రశ్నించినవారి కీ ప్రభువు చక్కని సమాధాన మొసఁగుచు నొక పద్యమును చెప్పినట్లు శ్రీ గురుజాడ-శ్రీరామమూర్తి పంతులుగారు తమ 'కవిజీవితము'లలో వివరించుచు నీ క్రిందిపద్యము నుదాహరించిరి.

'ఉ. ఇంచుక సూచివేదన సహించినమాత్ర నృపాంగనా కుచో
దంచిత సౌఖ్యకేళి సతతంబును గంచుకి గాంచునెట్లు? దు
ర్వ్యంచిత తీవ్రబాణనికరక్షత బాహుల కబ్బవే మరు
చ్చంచలలోచనా ఘనకుచ స్తబకవ్యతిషంగ సౌఖ్యముల్?'

పయి పద్యము జక్కన రచించిన విక్రమార్కచరిత్రమునందలి చతుర్థాశ్వాసములోనిది. దీనిని శ్రీ విజయరామగజపతి మహారాజు సందర్భానుగుణముగాఁ జదివి యుండును. శ్రీరామమూర్తిగారు, మహారాజుగారు రచించిన పద్యమే యని భ్రాంతిపడి యుందురు. ఇది ప్రభునిరచన కాకున్నను, ఆయన సమయస్ఫూర్తికిని, పాండిత్యమునకును, వాఙ్మయాభిరుచికిని దృష్టాంతము కాఁగలదు.

ఈ ప్రభువునకు విద్వత్కవులపయి ఆదరాభిమానములు కలవు. కాని, యాతని సవతిసోదరుఁడును, దివానును అగు సీతారామరాజు మాత్రము కవిపండితులను తిరస్కారభావముతోనే చూచెడివాఁడు. అన్ని విషయములలోను అన్నగారి కెఱుకరాకతేని ప్రభువు ఆస్థానపండితకవులను సత్కరించుచుండుటకు తగిన అవకాశము లేకుండెడిది. కావున మహాకవి విజయనగరమున నివసించుట కిష్టపడక,

ఆ పట్టణమునకుఁ గొంతదూరమున నున్న చీపురుపల్లిలో నివసించుచు అప్పుడప్పుడు ప్రభుదర్శనమునకు వచ్చుచుండెను. ఇతఁడు సంవత్సరమున కైదారు మాసములు దేశాటనము చేయుచు, తనయెడ గౌరవము కల ధనికుల వల్లను, జమీందారులవల్లను వర్షాశనములఁ గైకొనుచు జీవయాత్ర సాగించుచుండెను. ఈ విషయ మీతఁడు చెప్పిన

చ. తెనుఁగుఁ బ్రాఁత గాని, మఱి గంజికిఁ జేటలుంగవు; మన్యదేశముల్
తిరిగి యభీష్టవస్తువులు తెచ్చి భుజింతుము సర్వకాలమున్;
సుకవిరసజ్ఞ విశ్వనిధి సూరకవీంద్రున కేల కల్గెఁ గం
చరమున రేఁగ మేఁకమెడచన్నులవంటివి రెండు మాన్యముల్?

అను చాటువువలనఁ దెలియుచున్నది. ఆస్థానకవుల దుఃస్థితికి దివాను సీతారామరాజుగారే కారణమని సూరకవి యెఱుఁగును. అందువలన ఇతని కాయనపైనే కోపము! విజయరామగజపతిమహారాజుగారియెడల ఇతని కెంతో గౌరవ ముండినది.

క. 'ఊ రెయ్యది? చీపురుపలి;
పేరో? సూరకవి; యింటిపేరో? రడిదమువార్;
ఏ రాజో? విజయరామ మ
హారాజు; జగంబేమి సరసుఁడా? భోజుఁడయా!'

అని యితనికిని, వేఱొకకవికిని జరిగిన సంభాషణను తెలుపు పద్యమువలన ఈతఁడు తన ప్రభువును భోజమహారాజుతో సమానముగ గౌరవించుచుండినట్లు వ్యక్తమగుచున్నది.

సాహిత్యపోషణమే ముఖ్యముగా గ్రహించిన విజయనగరప్రభువులు కవులవలనఁ గృతులను స్వీకరింపవలెనను పట్టుదల కనుపరుపనందునను, సూరకవి సర్వస్వతంత్రుఁడగుటవలనను – ఈతఁడు రచించిన గ్రంథములను–కవిజన రంజనము, చంద్రాలోకము, కవిసంశయవిచ్ఛేదము, రామలింగేశశతకము, ఆంధ్రనామశేషము – అనువానిని రామచంద్రపురమువందలి రామలింగేశ్వరస్వామికే అంకితమొనర్చెను.

ఒకప్పుడు పెద్దాపురమున, ఆ సంస్థానప్రభువులగు వత్సవాయి–తిమ్మజగపతి మహారాజుగారి యాజమాన్యమున సంస్థానపాలకుల మహాసభ జరిగెను. ఆ సందర్భమున ఆ యా మహారాజులతో వచ్చిన యాస్థాన విద్వత్కవులు తమ తమ ప్రభువులను ప్రశంసించుచు పద్యములు చెప్పిరి. విజయరామగజపతి మహారాజుగారితో వచ్చిన యీ సూరకవి–

ఉ. 'రాజు కళంకమూర్తి; రతిరాజు శరీరవిహీనుఁ; డంబికా
రాజు దిగంబరుండు; మృగరాజు గుహాంతరసీమవర్తి; వి
భ్రాజిత పూషవాడ్విజయరామనృపాలుఁడు రాజుగాక, యీ
రాజులు రాజులే పెనుతరాజులుగాక ధరాతలంబునన్.'

అని రసవంతమగు చక్కని పద్యమును చెప్పెను. ఇది యితరరాజుల కపకర్షను, విజయరామగజపతి మహారాజుగారి కుత్కర్షను కలిగించుటచే, విజయనగరప్రభువు మిక్కిలి సంతసించి, రాజధానికి వచ్చినపిదప కనకాభిషేకమొనరించి సూరకవిని గౌరవించెను. అభిషేకమొనర్చిన

సువర్ణములను స్వీకరింపవలెనని ప్రభువు కవిని కోరఁగా "మహాప్రభూ ! ఏలినవారి కటాక్షమువలన ఇంతవఱకును స్నానముచేసిన యుదకమును పానముచేయలేదు" అనుచు తిరస్కరించెను. పిదప మహారాజుగారు వేఱే బహుమాన మొసఁగి సత్కరించిరఁట ! పయి పద్యము తెలుఁగు దేశము లోని చాటుపద్యములకు తలమానికమయి యున్నది.

ప్రభువు సూరకవికిఁ జేసిన మర్యాద దివాను సీతా రామ రాజుగారికి కిట్టలేదు. సూరకవిపయి నితనికిఁ గల ద్వేషము దీనివలన వృద్ధియయ్యెను. ఒకప్పుడు అనకాపల్లి సమీపమునఁ గల సత్యవరము జమీందారుగారి ఆస్థాన విద్వత్కవి యగు నేకపల్లి-సోమప్పకవి రాజసమ్మానమును పొందఁగోరి విజయనగరమునకు వచ్చెను. దివాను, అతని మూలమున సూరకవి నవమానించి తృప్తిపొందఁ దలఁచెను. సోమప్పకవితో సూరకవికిఁ బరిచయము కలిగించుచు సీతా రామరాజుగారు, సోమప్పకవి జగదేకపండితుఁడనియు, అతని ప్రజ్ఞాదులమోఘములనియు, అతఁడొక గొప్పకవియనియుఁ దెలిపెను.

పిదప నీ విద్వత్కవులిరువురికిని ఆశుకవిత్వరూపముగ వాగ్వాదము జరిగెను. ఆశుకవితలో సోమప్పకవి సూరకవిని జయింపలేకపోయెను. సీతారామరాజుగారి కోరిక సఫలము కాకపోయెను. దీనివలన, ఆశుకవితాప్రదర్శనమున కప్పుడు తగినంత ప్రోత్సాహ మీయఁబడుచుండెనని స్పష్ట మగుచున్నది.

చినవిజయరామ గజపతి మహారాజుగారి యనంత రము సంస్థానాధిపత్యమును వహించిన వీరి కుమారులు శ్రీ నారాయణ గజపతి మహారాజుగారును ఆంధ్రభాషా వాఙ్మయములయెడల ఆదరాభిమానములు కలవారే! వీరికి కవిత్వము చెప్పు అలవాటున్నదో లేదో తెలియదు కాని, రెండు గ్రంథములను కృతులుగా స్వీకరించినట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది. అందొకటి అసమగ్రమైన 'పద్మనాభ యుద్ధ' మను పేరితో ప్రసిద్ధమైన ప్రబంధము. రచయిత చట్రాతి-లక్ష్మీనరసకవి. మఱియొకటి సందిపల్లి అగ్రహార మున నివసించుచుండిన ఓరుగంటి - సోమశేఖరకవి వ్రాసిన 'రామకృష్ణార్జునరూప నారాయణీయ' మను త్ర్యర్థి కావ్యము.

శ్రీ నారాయణగజపతి మహారాజుగారు తమ రాజ ధాని యగు విజయనగరమును విడిచి కాశీక్షేత్రమునందే స్థిరనివాస మేర్పఱచుకొన్నందున ఆంధ్రసాహిత్యపోషణకు ఎక్కువ యవకాశము కలుగలేదు. ఆయన యనంతరము రాజ్యాధికారమును వహించిన శ్రీ విజయరామ గజపతి మహారాజుగారి కాలములో మఱల ఆంధ్రసాహిత్యపోషణ చక్కఁగా కొనసాగినది. ఈ ప్రభువు సంస్థానవిద్వత్కవులలో ముఖ్యులు భగవత్కవి శ్రీ ముడుంబై - నరసింహాచార్య స్వామిగారు, శ్రీ మండ-కామేశ్వరశాస్త్రిగారు, శ్రీ శ్రీపాద- తలమయ్యగారు మున్నగువారు. శ్రీ నరసింహాచార్యస్వామి గారును, శ్రీ కామేశ్వరశాస్త్రిగారును ఆనందగజపతి మహా రాజుగారి కాలమునందును, వారి యాస్థానములో ఉండిరి.

శ్రీ నరసింహాచార్యస్వామిగారు సంస్కృతాంధ్రములలో ఇంచుమించుగ డెబ్బది గ్రంథములను రచించిరి.

ఆ కాలములో ప్రభువుల దర్శనము దొరకుట సులభము కాదు. అందులకయి తగినవారి నాశ్రయించి నెలల తరబడి నిరీక్షింపవలెను. తొలుత ప్రభువుల కత్యంత సన్నిహితుల యాశ్రయమును సంపాదింపవలెను. ఆ పిదపనే ప్రభుదర్శనము లభింపఁగలదు. శ్రీ నరసింహాచార్య స్వామిగారు గొట్టుముక్కల-కృష్ణంరాజుగారి సహాయముతో యువరాజుగారైన శ్రీ ఆనందగజపతి ప్రభుని సందర్శించి, తమ కవితా ప్రావీణ్యమున ఆయన యాదరాభిమానములను చూఱఁగొనిరి. పిదప ఒకప్పుడు రామలీలోత్సవములు జరుగు సందర్భమున యువరాజుగారు పితృపాదులైన శ్రీ విజయరామగజపతి మహారాజుగారి సన్నిధిలో ఈయనను ప్రవేశపెట్టిరి. ప్రభుదర్శనము లభించిన వెంటనే యీ విద్వత్కవి—

ఉ. 'ఈ జగమందు నిండునటు లెల్లరకుం గనువిందొనర్చ పై
యోజ గనంగ రాజగుట కల్లమి సందియమొందదెందునున్;
రాజనుమాట మా విజయరామ నరేంద్రునకే పొసంగు; పై
రాజులు శోకవహ్ని మది రాజుట రాజులనంగఁ జెల్లెడిన్.'

అని ప్రభువును వర్ణించుచు నొక పద్యమును చెప్పెను. వెంటనే ఆనందగజపతి ప్రభువు చేతులు జోడించి, తండ్రిగారితో "ఈ పద్యము సూరకవిగారి 'రాజు కళంక మూర్తి' అను పద్యముకంటెను రసవంతమై యున్నది"

అని మనవిచేసెను. ప్రభువులు సంతసించి యీ విద్వ త్కవిని వెంటనే తమ యాస్థాన విద్వాంసునిగా స్వీకరించి గౌరవించిరి.

విజయరామగజపతి మహారాజుగారి యాస్థానమున నుండిన శ్రీపాద-చలమయ్యగారు 'రామకృష్ణోపాఖ్యానము, కౌసల్యా పరిణయము' అను గ్రంథములను వ్రాసినట్లు తెలియుచున్నది. అవి లభింపలేదు. లభించినఁగాని వానిం గూర్చిన వివరములను తెలిసికొనుట సాధ్యము కాదు,

శ్రీ మండ - కామేశ్వరశాస్త్రిగారు 'కూర్మ పురాణము' నాంధ్రీకరించి శ్రీ విజయరామగజపతి ప్రభువునకును, 'మార్కండేయ పురాణము'ను తెలిఁగించి ప్రభువుల దేవేరి శ్రీ అలకరాజేశ్వరీ మహారాణిగారికిని అంకిత మొసఁగిరి. సంస్థాన ప్రధానామాత్యులగు శ్రీ పెనుమత్స - జగన్నాథ రాజుగారి కోరికపయి 'రామ కథా సార సంగ్రహ'మను ప్రబంధమును రచించి, ఆయనకే కృతి యొసంగిరి.

ఆ కాలములో విజయనగర సంస్థానపు ప్రభువులే కాక ప్రభు కుటుంబములోనివారును ముఖ్యోద్యోగులును కూడ తెలుఁగు వాఙ్మయ పోషణకు దోహద మొసంగు చుండిరని పయి విషయములనుబట్టి స్పష్టమగుచున్నది. అంతేకాక వివిధములగు శాస్త్ర గ్రంథములను జనసామా న్యమున కుపయోగకరము లగునట్లు సులభ భాషలో నాంధ్రీకరింపఁ జేయుట ప్రభువుల యాశయమై యుండెడిది. ఈ పద్ధతిలోనే చెన్నపురి వాస్తవ్యులగు శ్రీ కంది-సుబ్బా

రావుగారు 'పాకశాస్త్రము'ను రచించి, మహారాణి శ్రీ అలక
రాజేశ్వరీదేవిగారికి అంకిత మిచ్చిరి.

విజయరామగజపతి మహారాజులుంగారి యనంతరము
ఆనందగజపతి మహారాజ ప్రభువు రాజ్యమునకు వచ్చెను.
ఈయన రాజ్యమును పాలించిన కాలము సంస్థానమునకు
స్వర్ణయుగమని చెప్పవచ్చును. హంపీ విజయనగరమును
శ్రీ కృష్ణదేవరాయలు పాలించిన సమయములో ఆంధ్రభాష
యెట్లభ్యున్నతి నొందినదో ఆనందగజపతి మహారాజుగారి
కాలమునను అట్లే యభ్యున్నతి నొందెనని చెప్పవచ్చును.
కృష్ణదేవరాయలవలెనే యీ ప్రభువుకూడ సంస్కృతాంధ్ర
ములందు సాటిలేని విద్వత్కవి. ఈయన యువరాజుగా
ఉండినప్పుడే విద్వత్కవుల పరిచయమువలన గొప్ప
యనుభవమును సంపాదించి, విద్వాంసులను పరీక్ష చేయు
టలో సాటిలేని సామర్థ్యము పొంది యుండిరి.

ఆనందగజపతి ప్రభుని యాస్థానములో చాలమంది
విద్వత్కవులుండిరి. వారిలో శ్రీ ముడుంబై-నరసింహాచార్య
స్వామిగారు, వారి సోదరులగు శ్రీ వరాహస్వామిగారు,
శ్రీ కొల్లూరు-కామశాస్త్రిగారు, శ్రీ మండ-కామేశ్వరశాస్త్రి
గారు, వారి పుత్రులగు శ్రీ లక్ష్మీకామశాస్త్రిగారు,
శ్రీ మైసూరు-భీమాచార్యులుగారు ముఖ్యులు. వీరు అష్ట
దిగ్గజములని పేరు పొంది యుండిరి. ప్రభువులు, విద్వత్కవు
లను గురుతుల్యులనుగా కూడ భావించుచుండిరి. వీరుకాక
శ్రీ అజ్జాడాదిభట్ల-నారాయణదాసుగారు, శ్రీ భాగవతుల-
లక్ష్మీనారాయణశాస్త్రిగారు మున్నగు విద్వాంసులును

ఉండిరి. ఇంక, ప్రభుదర్శనమునకు వచ్చి, తమ విద్యా కౌశలమును జూపి, ప్రభువులను తృప్తిపఱిచి, సమ్మాన ములు పొందువారును పెక్కుమంది!

శాస్త్రము లన్నియును జనసామాన్యమున కందుఁ బాటులో నున్నపుడే దేశ మభివృద్ధిపొందుట కవకాశము కలదనియు, సంస్కృతమునందలి శాస్త్ర గ్రంథము లన్నియు ఆంధ్రీకరింపఁబడినపుడే అయ్యది సుసాధ్యమనియు ఆనంద గజపతి ప్రభుని యాశయము. యువకులలో విద్యాభిలాషను, శాస్త్రజ్ఞానమును వృద్ధిపొందించుటకయి యీ ప్రభువు వివిధ పరీక్షలను పెట్టించుచుండెను. ఆ పరీక్షలలో, ఆస్థా నములోని సభ్యుల పుత్రులును, రాజబంధువులును కూడ పాల్గొనుచుండిరి. వ్రాఁతపరీక్షలే కాక ముఖపరీక్షలును జరిగెడివి. పరీక్షలలో ఉత్తమశ్రేణిలో నెగ్గినవారికి ద్రవ్య రూపమునను, స్వర్ణ, రజత పాత్రముల రూపమునను కూడ పారితోషికము లీయఁబడెడివి. వారాణసి మున్నగు విద్యా కేంద్రములలో పరీక్షల నిచ్చి యాఱితేఱినవారు కూడ ఈ సంస్థానమునకు వచ్చి, తిరిగి పరీక్షల నిచ్చి కృతార్థుల మైతిమని యనుకొనెడివారు. ఇచ్చటి పరీక్షలకు – ఇప్పటి విశ్వవిద్యాలయముల పరీక్షల కున్న విలువకంటె ఎన్నియో మడుంగుల విలువయు, గౌరవమును ఉండెడివి.

ఆంధ్ర దేశమునందు సుప్రతిష్ఠిత యశస్సు కల విద్వ త్కవులు కూడ విజయనగరమునకు వచ్చి, ఆనందగజపతి మహారాజును దర్శించి బహుమానము లందిననే తమ కవిత్వ

పాండిత్యములు వన్నె కెక్కఁగలవని విశ్వసించెడివారు. అట్టి వారిలో సుప్రసిద్ధులగు శ్రీ తిరుపతి వేంకటకవులును గలరు. మహావిద్వాంసులకే కాని యితరులకు ప్రభుదర్శనము లభింపదని కింవదంతి. అందువలనఁ దమకు మహారాజా దర్శనము లభించునో, లేదో యని ఆ కవులకును సందేహామే! ఈ విషయమునే వారీ క్రింది పద్యములలో వెల్లడించిరి.

చ. 'పలుకుచుఁ బోయియుండి రఁట కన్; ప్రభుదర్శన మీ మహాత్ములే
యలవడునే?' యటంచు జను లందఱు నాడఁగ లాఁ రటించుఁ జిం
తిలెదము; చింత సేయుము మరిన్ వెతఁ బొందుము; మగంటి కొట్టిసం
దులను సహింపవచ్చు; నది తోడిది దెప్ప సహింపవచ్చునే?

చ. ధనమున కేమిగాని, తగుదాతలు కల్గిన మంచి మంచి ప
త్తనములవంకఁ బోయి యవధాన మొనర్చి గడింపవచ్చు; న
చ్చిన దొకమాట చెప్పెదము; చిత్తమునం దిడుఁ; డిట్టి రాజద
ర్శన మిలలోన మాకెఁకనుఁ జన్మశతమ్ములకైనఁ గల్గునే?'

ఆనందగజపతి మహారాజుగారిని దర్శించిన పిమ్మట, ఆయన సమక్షమునఁ జెప్పిన పద్యములలోఁ గొన్ని—

సీ. 'విక్రమార్కునితోడ వేంచేసె నతఁడునే?
భోజమహారాజు పుట్టఁడేని;
భోజభూపాలుతోఁ బోయెనందునే? రాజ
భూపాలవర్యుండు పొడమఁడేని,
రాజరాజనరేంద్రుతోఁ జనెనందునే?
కృష్ణరాయలు జన్మమెత్తఁడేని,

కృష్ణరాయలతోడనే పోకయుండునే?
భవదీయవంశంబు ప్రబలదేని,

గీ. భావుకంబైన భవదీయవంశ్యగరిమ
ధరణి నిండాఁక సత్కవితావధూటి
నిలిచియున్నది నిలుచును నిలువఁగలదు
శ్రీమదానందగజపతి క్షితితలేంద్ర!

ఉ. ఎందఱఁజూచెనేని వరియింపదు మా కవితాకుమారి; క
న్నందున దేశముల్ తిరుగు టబ్బెను; సౌఖ్యము లేకపోయె నా
నందనృపాల! నీమనుగుణమ్ములు చెప్పిన నాలకించి వెం
టం దలయూఁచెఁ గావునఁ దటాలున దీనిఁ బరిగ్రహింపుమీ!

మ. కవితామాధురిఁ జాగ్రహించి 'యిది శ్లాఘ్యం; బిద్ది శ్లాఘ్యంబు గా
దు; విశేషం బిట; నిర్విశేషమిట; మాధుర్యం బిటన్ వహ్వారే!
కవిరాజా!' యని మెచ్చియిచ్చు నృపుఁడొక్కండైనఁ గర్వైనచోఁ
గవియై పుట్టుట కన్నఁ బాపపరిపాకం బుండునే భూవరా!

మ. "కనుఁగొంటిం గవులార! మిమ్మి నటు; నాకష్టంబు గట్టెక్కె; ర
మ్మనె నానందనృపాలకుండు మిము; నే నానందభూపాలకీ
ర్తిని; దేశోహంకు" మంచు నిచ్చె నమరక్త్రీన్ బత్రికన్; దానఁ జ
య్యన నేతెంచితిమయ్య! వాస్తవమిదే! యానందభూపాలకా!

మ. కవులెల్లన్ దలయూఁచి మెచ్చ బుధలోకంబెల్ల వహ్వా! యనం
గ విచిత్రమ్ముగ వందమంది కయినన్ గాదేని యష్టావధా
నవిశేషంబయినన్ రచింపఁగల; మానందక్షితీశాన! మా
యవధానమ్మును జూడుమా! మనములో నానందముం బొందుమా!"

ప్రభుదర్శనమున సంతృప్తిఁ జెంది, కృతార్థులై, బహుమానమందిన వేంకట కవివతంసులు వేఱొకప్పుడు

గీ. 'ఏను జూచిన రాజులందెల్ల నొక్క-
విజయనగరమహారాజె వేత్త.'

అని యీ యానందగజపతి మహారాజును ప్రశంసించుట ముఖ్యముగా గమనింపఁదగినది.

ప్రతిదినమునను విద్వద్గోష్ఠియం దేదో యొక నూతనాంశముపయి చర్చ జరుగుచునే యుండెడిది. ఆ రీతిని క్రొత్త పద్యముల రచనయు సాగెడిది. విషయ చర్చకు మహారాజుగారే ప్రారంభకులు! వారు కోరిన విద్వాంసులు చర్చలోఁ బాల్గొని సమాధాన మిచ్చెడివారు. ఒకప్పుడు ఆనందగజపతి ప్రభువు వసుచరిత్రమునందలి-

శా. 'ఆ తన్వంగి యనంగ ఝుంకరణవజ్జ్యామూర్తి చూతాస్త్రని
ర్ఘాతంబోర్వక తమ్ములంచుఁ దటినీగర్భైక సంజాత కం
జాతవ్రాతము మాటుఁజెంద నది రోచన్ సాగె మున్మున్నుగా
'జ్ఞాతిశ్చే దనలేన కిమ్మ'నెడి వాచాయుక్తి సత్యంబుగన్.'

అను పద్యమును సంస్కృతీకరింపవలెనని విద్వాంసులను కోరెను. ఇందలి 'తమ్ములు' అను పదము 'కమలములు, సోదరులు' అను రెండర్థముల నొసంగుటవలన, ఆ స్వారస్యము చెడకుండ నుండవలెనని ఆయన యభిప్రాయము. ఈ విషయమును గ్రహించి శ్రీ నరసింహాచార్యస్వామిగారు

శ్లో. 'తన్వంగీ కుసుమాస్త్ర ఝుంకరణ వజ్జ్యాభూత చూతాశుగాత్
భీతా 'కిం శరణం భవేదిహ మమే' త్యాలోచ్య నద్యాం జవేః,

సాకంజాత మవేక్ష్య పద్మమభజత్; తద్బాధతే హంత ! తాం;
'జ్ఞాతిశ్చే దనలేన కిం?' వచ ఇదం ప్యాఖ్యాత్ కథం ప్రస్ఖలేత్."

అని వెంటనే అనువాదరూపమగు శ్లోకమును చెప్పిరి. ఇచట 'సాకంజాతం' అనునెడ 'తమ్మి' లన్నట్లుగనే రెండర్థములును వచ్చుచున్నవి.

ఆనందగజపతి ప్రభువునకు చక్కని కవిత్వము చెప్ప సామర్థ్యము కలదు. ఒకప్పుడు శ్రీ ఆదిభట్ల – నారాయణ దాసుగారి సత్య నిరతికి మెచ్చి యీయన–

క. 'కులశైలంబులు దలఁకిన
జలనిధు లింకినను, సూర్యచంద్రుల సన్మం
డలములు నేలం దొరఁగినఁ
బలుకఁ డబద్ధంబు సత్యవాది, గుణనిధీ!"

అని ప్రశంసించుచు పద్యమును చెప్పఁగా, శ్రీ నారాయణదాసుగారు

క. 'ఆనందగజపతీంద్రుని
శే వనులన్ సాటిగాంచ రీవిన్, కీవిన్
గానకవితా ప్రవీణత
ధీనతు బలరూప సంగతిన్ విశ్వభర్తన్.'

అను పద్యమును రచించి తన కృతజ్ఞతను వెల్లడించిరఁట!

ఈ ప్రభువునకు సత్యము విషయమునఁ బట్టుదల యెక్కువ. దానింగూర్చి యీయన చెప్పిన రెండు పద్యములు లభించుచున్నవి. అవి–

క. “కులశైలములు చలించిన,
జలనిధు లింకినను, సూర్యచంద్రుల సన్మం
డలములు ధరఁగూలిన సౌ
రు అచల వాక్ఛ్రీవిలాసు లురుగుణసదనా!

క. కసవుఁదిను పసరములకును
నసువులపై నాసచేయనౌ సహజముగన్;
అసమత దూషితమగు నీ
వసుమతి జీవేచ్ఛ మృతికి వచ్చు సమమునన్.”

పయి పద్యములు రెండును శ్రీ జి. సి. వి. శ్రీనివాసాచారిగారు వ్రాసిన ఆంగ్ల ‘హరిశ్చంద్ర’ నాటకములోని కడపటి రంగములోఁ జేర్పఁబడినవి. వీనింగూర్చి యా గ్రంథకర్త తన పీఠికలో “His Highness kindly permitted me to insert in the concluding Scene two of His Highness's Telugu stanzas as they suit the contest remarkably” అని వివరించి యుండెను.

వాఙ్మయపోషణమునం దెక్కువ యాసక్తి గల ఆనందగజపతి ప్రభువు సంస్కృతాంధ్రాంగ్ల భాషలలోఁ బ్రకటింపఁబడిన గ్రంథముల నెల్ల సంగ్రహించెడివారు. అందుల కెంత ధనమునైనను వెచ్చించుచుండెడివారు. వీరి గ్రంథాలయములో మూఁడు విభాగములు కలవు. మొదటిది ప్రాచ్య విభాగము. ఇందు తెలుఁగు, సంస్కృతము, ప్రాకృతము, గ్రీకు, లాటిన్, జర్మన్ భాషలకు సంబంధించిన గ్రంథము లున్నవి. రెండవదగు ఆంగ్ల విభాగమున ఆంగ్ల గ్రంథములు కలవు. మూఁడవది పర్షియన్ విభాగము

ఇందు పర్షియన్, అరబిక్ భాషలకుఁ జెందిన గ్రంథము లున్నవి. ఈ మూఁడు విభాగములను సరియైన స్థితిలో నుంచుటకు ముగ్గురు పర్యవేక్షకులు (Librarians) నియమింపఁబడుచుండెడివారు. వీనిలో ప్రాచ్య విభాగమున ముద్రిత గ్రంథములతోఁ బాటు అముద్రితగ్రంథములును చాల యున్నవి. అందుఁ జాలవఱకును ఈ ప్రభువర్యుని ప్రోత్సాహమున ఆస్థాన విద్వాంసులు రచించినవే!

ఆంధ్రము నభ్యసించువారికి సంస్కృతభాషా పరిజ్ఞాన మత్యంతావశ్యక మగుటచే నాంధ్ర పండితులకు సంస్కృతము కూడ బాగుగఁ దెలిసి యుండవలెననియు, సంస్కృత పండితుల కాంధ్రముతో నెట్టి సంబంధము లేనందున వారి కాంధ్రభాషాజ్ఞానము వ్యర్థమనియు, అట్టి వా రాంధ్రభాషలో గ్రంథములను రచింపలేరనియు నాఁటికిని నేఁటికిని కూడ ఒక ప్రతీతి తెలుఁగుదేశమున వ్యాపించి యున్నది. ఈ విషయ మానందగజపతి మహారాజు గారి సభలో చర్చకు రాకపోలేదు. ఈయన తమ యాస్థాన విద్వాంసులను జూచి "మీరు సంస్కృతభాషా వాఙ్మయములలో నిధులు కదా! మీ కాంధ్రభాషయందు రచనలు సాగించుట యసాధ్యమా?" అని ప్రశ్నించెను. దానికి వారు "అది సుసాధ్యమే!" అని సమాధాన మిచ్చి, వారము దినములలో ఆంధ్రచ్ఛందోవ్యాకరణ లక్షణములను స్వయంకృషిచేతఁ దెలిసికొని చక్కని కవిత్వమును చెప్పఁగలిగిరఁట! అంతకుఁ బూర్వము వారి కణుమాత్రమైనను ఆంధ్రభాషాజ్ఞానము లేదు. ఇట్లు ప్రభుని యాస్థా

నములోని సంస్కృత విద్వాంసు లందఱును ఆంధ్ర విద్వద్వ తంసులుగాఁ గూడ లెక్కకు వచ్చెడివారు !

ఈ ప్రభుని యాస్థానములో నుండిన ఇతర సభ్యులు కూడ విద్వత్కవుల సాహచర్యమువల్లను, ప్రభువు ప్రోత్సాహమువల్లను కవిత్వము చెప్పఁగలిగి యుండిరి. అట్టివారిలో శ్రీ కె. ఎన్. జి. రాజామణిసెట్టి యొకఁడు. ఇతఁడు కర్నూలుజిల్లా డిప్యూటీ కలెక్టరుగా నుండిన కె. గోపాల కృష్ణసెట్టిగారి కుమారుఁడు ! క్రికెటు ఆటలో గొప్ప నైపుణ్యము కలవాఁడు ! ఆ యాటయం దెక్కువ మక్కువ గల ఆనందగజపతి మహారాజుగారు రాజామణిసెట్టిని తమ సన్నిధిలో ఉంచుకొనిరి. ఇతఁడు శ్రీ ఆనందగజపతి మహారాజు సతీమణి స్మృతి చిహ్నముగ "సుగుణమంజరి" యను చిన్న పద్యకావ్యమును రచించెను. 'విజయరామ చరిత్ర' మను గ్రంథాంతరమును కూడ ఇతఁడు రచించినట్లును, అది ముద్రితమైనట్లును కూడ తెలియుచున్నది. కాని, అది లభ్యము కాలేదు.

వాఙ్మయాభివృద్ధియే యీ ప్రభుని ప్రధాన లక్ష్యము. గ్రంథములను అంకితము పొందవలెనను అభిలాషయు ఈయనకు లేదు. తమ యాస్థాన విద్వాంసులను గురు తుల్యులనుగాఁ జూచుటవలన, వారివలనఁ గృతులను స్వీక రించుట కీయన యిష్టపడక యుండవచ్చును. ఈ ప్రభువు శ్రీ మండ-లక్ష్మీనరసింహ కవి రచించిన 'ఆంధ్ర కౌముది' అను నాంధ్రవ్యాకరణమును ముద్రింపించెను, శ్రీ విజా

పురపు-వెంకట కోదండరావు పంతులుగారు తెలిఁగించిన శార్మెకిలు దొరగారి 'విశాఖపట్టణముజిల్లా వృత్తాంత సంగ్రహము'ను ఆ దొరగారికే కృతిగా ప్రకటింపఁజేసెను. (శ్రీ) ముండ-కామేశ్వరశాస్త్రిగారు రచించిన ఆంధ్ర మన్వర్థ దీపికా సహిత మను ధర్మశాస్త్రమును, (శ్రీ) కొల్లూరు-కామ శాస్త్రిగారు రచించిన రఘునాయక శతకమును, ఆంధ్ర ధర్మ సింధు సారమును అచ్చు వేయించెను. (శ్రీ) పేరి-కాశీ నాథశాస్త్రిగారి 'పార్థసారథి శతకము'ను, (శ్రీ) ఆదిభట్ల-నారాయణదాసుగారి 'సత్యవ్రతి శతకము'ను ప్రకటింపఁ జేసెను. (శ్రీ) వల్లూరి-జగన్నాధరావుగారు కూర్చిన 'ఆంధ్ర శారీరకము'ను, 'బ్రహ్మసూత్రార్థ సంగ్రహము'ను ముద్రింపించెను.

(శ్రీ) ఆనందగజపతి ప్రభువు కృతిపొందిన గ్రంథములును లేకపోలేదు. (శ్రీ) గురుజాడ – శ్రీరామమూర్తిగారు రచించిన 'కవి జీవితములు' వీరికిఁ గృతిగా రచింపఁబడి, ముద్రింపఁబడినది. (శ్రీ) గురుజాడ – అప్పారావుగారి 'కన్యాశుల్కము, నీలగిరి పాటలు' ఆనందగజపతి మహారాజుగారికే అంకితములు!

ఆ కాలమున చెన్నపట్టణములో తచ్చూరి – పెద సింగరాచార్యులు, తచ్చూరి – చినసింగరాచార్యులు అను సోదరు లిద్దరు గానోల్లాసినీశాల యను నాటక సమాజమును స్థాపించి నడుపుచుండిరి. గానకళయం దత్యంతాసక్తి కల యా ప్రభువుయొక్క ప్రాపక మా సోదరులకు లభించినది

ఈ ప్రభువు ప్రోత్సాహముననే వారు 'స్వరమంజరి, గాయక సిద్ధాంజనము, గాయకలోచనము' మున్నగు గ్రంథములను వెలువరించిరి. ఆ సోదరు లిద్దరును తెలుఁగు దేశమం దంతటను పర్యటన మొనర్చి, అమూల్యమగు కర్ణాటక సంగీత చరిత్ర మును వ్రాయ విషయమును సేకరించిరి. కాని, యా గ్రంథము ప్రకటింపఁబడినట్లు లేదు.

మహారాజుగారి ప్రోత్సాహమున రచింపఁబడి, ముద్రి తములు కాని వ్రాఁతప్రతులు కొన్ని వీరి ప్రాచ్య గ్రంథ విభాగమునఁ గలవు. వానిలో, తులసీదాసు హిందీభాషలో రచించిన 'రామచరితమానస' మను రామాయణపు టాంధ్రీ కరణము పేర్కొనఁదగినది. దానిని శ్రీమండ-కామేశ్వర శాస్త్రిగారు, శ్రీమండ-నరహరిగారు, శ్రీ శిష్టు-కృష్ణమూర్తి శాస్త్రిగారును తెలిఁగించిరి. అది మూలమునకు సంబంధించిన 'దోహా, చౌపాయీ, సొరఠా' మున్నగు విధములగు ఛందస్సులలో రచింపఁబడిన గేయరూపమున నున్నది. మఱియు శ్రీ కొల్లూరు-కామశాస్త్రిగారు ఆంధ్రీకరించిన 'వ్రతరాజము, జైమినీయ న్యాయమాలాసహిత పూర్వమీ మాంసా దర్శనము' అను బృహద్గ్రంథములు కలవు. శ్రీ మండ-కామేశ్వరశాస్త్రిగారి పుత్రులు, ఆస్థాన విద్వ త్కవులు నగు శ్రీ లక్ష్మీకామేశ్వరశాస్త్రిగారి 'ఆంధ్ర వైశేషికోపస్కారము' కలదు. ఇవి యన్నియు ముద్రింపఁ బడినయెడల ఆంధ్ర వాఙ్మయమునకు మహోపకారమగును.

ఆనందగజపతి ప్రభువు స్వయముగ రచయిత. వివిధ శాస్త్ర గ్రంథములను సులభమగు భాషలో ఆంధ్రీకరించి

లోకోపకార మొనర్చవలెనని వీరి సంకల్పము. ఈ యాశయముతోనే 'శూద్రకమలాకర' మను ధర్మశాస్త్రగ్రంథము నాంధ్రీకరింప నారంభించిరి. కాని తర్కశాస్త్రము నాంగ్లభాషనుండి తెలిగింపఁబూనినందున, పయి ధర్మశాస్త్రాంధ్రీకరణ కార్యమును ఆస్థాన విద్వాంసులగు శ్రీ కొల్లూరు-రామశాస్త్రిగారి కప్పగించిరి. ఈ విషయము నా గ్రంథపీఠికలో శ్రీ రామశాస్త్రిగారే వెల్లడించుచు "ఇట్లనన్యగతికమైన జగము నుద్ధరించుటకై సర్వసాధారణమైన స్పష్టభాషలో దానిని తెలింగించుటకు నుత్సహించి...... శ్రీమదానందగజపతి మహారాజచంద్రు లారంభించియు వంతకుమున్నె మిస్టర్ మిల్ దొరగారు చేసిన ఆంగ్లేయ తర్కశాస్త్రమును తాము తెనిగించుటకు బూని యున్నందున నవకాశమును దయచేయించి..." అని తెలిపి యున్నారు. ఆ తర్కశాస్త్రానువాదము పూర్తియైనదో, లేదో కూడ తెలియలేదు. ఆ గ్రంథము లభించలేదు. సంస్కృతమున వరదరాజ పండితుఁడు కూర్చిన 'లఘుసిద్ధాంతకౌముది'ని కొంతవఱకు ఈయన తెలిఁగించినట్లు తెలియుచున్నది. తమ వంశావళికి సంబంధించిన విషయములను ఆంగ్లభాషలో 'విజయనగరం ట్రీటీ' అను గ్రంథముగా రచించి ముద్రింపించిరి.

ఆంధ్రభాషా వాఙ్మయములయెడల ఎక్కువ ఆదరము చూపుచుండినను, ఈ ప్రభువు సంస్కృతము, ఆంగ్లము, పర్షియను మున్నగు భాషలయెడలను ఆదరమును చూపి, వాని యభివృద్ధికి పాటుపడుచునే యుండెను. వీరి

ప్రోత్సాహమువననే, శ్రీ కొల్లూరు - కామశాస్త్రిగారు శ్రీ కాశీ స్తవమును, నృసింహదేవకరనఖ స్తోత్రమును, శ్రీ మండ-కామేశ్వరశాస్త్రిగారు వాసంతికా స్వప్న నాటకమును, దేవీవిలాస తరంగిణీ స్తోత్రమును రచించిరి. శ్రీ నేమాని-కోదండరామయ్యగారును, శ్రీ ఇవటూరి-నందికేశ్వరశాస్త్రి గారును బ్రహ్మయజ్ఞభాష్య-నిశ్చయ చింతామణిని కూర్చిరి. బందరులో నుండిన శ్రీ అత్మకూరి - లక్ష్మీనరసింహ సోమయాజిగారు తైత్తిరీయ మంత్ర భాగార్థాది వైదిక గ్రంథములను ఈ ప్రభుని సమాదరణమువలననే ప్రకటింపఁగలిగిరి. అమూల్యమగు 'వైద్యక నిఘంటు'వను బృహన్నిఘంటువును వీరే ముద్రింపించిరి.

ఒకప్పు డీ ప్రభువునకు ఋగ్వేదమును భాష్యముతోఁ గూడ పఠింపవలెనని బుద్ధి పుట్టినది. ఆ వేదమును జర్మనీ దేశమునందలి మాక్సుముల్లరు పండితుఁడు సవిమర్శముగ సంపాదించి విపులమగు పీఠికతోఁగూడ ప్రకటించెను. ఆ గ్రంథపుఁ బ్రతులను రెండింటిని పంపవలెనని యీ ప్రభువు మాక్సుముల్లరుద్వార కొక లేఖ వ్రాయించెను. కాని, అప్పటికే ఆ ప్రతులన్నియుఁ జెల్లిపోయినవి! ద్వితీయ ముద్రణమునకై యా విద్వాంసునివద్ద పైకము లేదు. ఈ యంశమును వివరించుచు ఆ దొర విపులముగా జాబు వ్రాయుచుఁ బ్రభువునకుఁ బంపెను. అంత నియన రెండవ ముద్రణమును ప్రారంభింపవలెననియు, దానికగు ధనమును తా నిత్తుననియుఁ దెలియఁజేసెను. తత్ఫలితమున ఆ ద్వితీయ ముద్రణము మహోత్కృష్టముగ వెలువడినది. ఆ ముద్రణము

నాంగ్ల రాజ్యాధిపతి కంకిత మొసంగుచు, మాకున్నముల్లరు చోర, తానును, ఆనందగజపతి ప్రభువును కలిసి యంకిత మిచ్చుచున్నట్లు, అంకితపత్రమునఁ బ్రకటించి తన కృతజ్ఞతను వెల్లడించెను.

శ్రీ విజయనగర ప్రభువులకు కాశీ నగరమున నొక కోట కలదు. ఆ ప్రభువులు సంవత్సరములోఁ గొంతకాలము కాశీక్షేత్రమునఁ గడపుచుండెడివారు. ఆనందగజపతి ప్రభువచ్చటికిఁ బోయినప్పుడును విద్వద్గోష్ఠి జరుగుచుండెడిది. కాశీ విద్వాంసులలో సమర్థుల నీయన సత్కరించుచుండిరి. వారి ప్రోత్సాహమున ఆనందగజపతి ప్రభువు ఆ నగరమున 'విజయనగర సంస్కృత గ్రంథావళి' (Vizianagaram Sanskrit Series) అను గ్రంథమాలను స్థాపించెను. అందు అపూర్వములగు శాస్త్ర గ్రంథములు ప్రకటింపఁబడుచుండెడివి. వ్యాకరణ శాస్త్రమునందలి పరిభాషేందుశేఖరమునకు సుప్రసిద్ధ వ్యాఖ్య యగు 'వాక్యార్థ చంద్రిక' ఈ గ్రంథమాలలో ప్రకటింపఁబడినదే! ఈ గ్రంథమాలలోని గ్రంథము లుత్తమరీతిని వెలువడుటకయి పాశ్చాత్య దేశములలో ముద్రింపబడుచుండెడివి. అప్పుడు మన దేశములోని ముద్రణాలయము లిప్పుడున్నంత మంచి స్థితిలో లేకుండుటయే దీనికిఁ గారణము. పయి వ్యాకరణ గ్రంథమును సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ భాగవతుల - హరి శాస్త్రిగారు రచించిరి. ఆ గ్రంథమాలలో పదునైదు ఉత్తమ గ్రంథములు ప్రకటింపఁబడినట్లు తెలియుచున్నది.

ఆ కాలమున వంగదేశమున మహా విద్వాంసుఁడగు తారానాథ తర్క వాచస్పతి పండితుఁడు 'వాచస్పత్య' మను గొప్ప విజ్ఞాన సర్వస్వమును సంస్కృతభాషలో రచించెను. అంత పెద్ద గ్రంథమును ముద్రించుటకు అపారమగు ధనము కావలెను. దానిని ప్రకటించు మార్గమును కానక ఆయన మిక్కిలి కలఁతపడుచుండెను. మహావదాన్యమూర్తి యగు ఆనందగజపతి ప్రభు వా గ్రంథమును ముద్రించు భారమును దానే వహించెను. ఈ రీతినే మున్షీ మహమ్మద్ పాచ్చా మియా సాహెబు రచించిన 'ఫర్ హంగీ ఆనంద రాజ్' అను ఉరుదూ భాషాకోశము నీ ప్రభువు ముద్రింపించెను. శ్రీ జి. సి. వి. శ్రీనివాసాచారిగారు వ్రాసిన ఆంగ్ల 'హరిశ్చంద్ర' నాటకము వీరి సమాదరణవల్లనే ముద్రితమైనది. ఇట్టి బహుముఖ వాఙ్మయసేవవలననే ఈయనకు 'అభినవభోజ' బిరుదము లభించెను.

పత్రికా ప్రకటనము శైశవావస్థలో నున్న ఆ కాలములో ఈ ప్రభువు 'తెలుగు హార్ప్' (Teiugu Harp) అను వారపత్రికను ప్రారంభింపఁజేసెను. అందు శ్రీ గురుజాడ-అప్పారావుగారు, శ్రీ కిళాంబి - రామానుజాచార్యులుగారు మున్నగు విద్వాంసులు చక్కని యాంగ్ల వ్యాసములను ప్రకటించుచుండిరి. శ్రీ గురుజాడ - శ్రీరామమూర్తిగారు కాకినాడనుండి ప్రకటించుచుండిన 'రాజయోగి' పత్రిక, ఆయన విజయనగరమునకు వచ్చిన పిదప, విజయనగరము నుండియే ప్రకటింపఁబడసాగెను. ఆ పత్రిక కొంతకాల

మైనను నడచుటకీ ప్రభుని యౌదార్యమే ముఖ్య కారణము.

ఆనందగజపతి ప్రభుని కాలములో గ్రాంథిక, వ్యావహారిక వివాదములు గాని, వ్యాకరణ నియమముల యెడల ఎక్కువ పట్టుదల గాని ఉన్నట్లు కానరాదు. జన సామాన్యమునకు సులభముగా అర్థమగు స్పష్ట భాషలోనే శాస్త్ర గ్రంథముల రచన సాగవలెనని యీయన యభిప్రాయము. ఈ విషయమునే ఆస్థాన విద్వాంసులు, తదితరులును తాము వ్రాయు గ్రంథముల పీఠికలలో తఱచుగా వెల్లడించుచుండిరి. అపుడు 'వ్యావహారిక, గ్రాంథిక' పదములు వాడుకలో నున్నట్లు తోఁచదు. శ్రీ గురుజాడ-అప్పారావు గారు పాత్రానుగుణముగ వివిధ వ్యావహారిక పదములతో కూర్చిన వాడుక భాషలో 'కన్యాశుల్క' నాటకమును వ్రాయుటయు, దానికి ప్రభువుల యామోదముద్ర పడుటయు మన మిచ్చట గుర్తింపవలసి యున్నది.

ఈ ప్రభు వొకప్పుడు సభలోని విద్వాంసులకు 'సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్' అను నొక కంద పద్య పాదమును వినిపించి, అది నాల్గవచరణముగా ఉండునట్లు చక్కని శతకములను కూర్పవలెననియు, వానిలో అత్యుత్తమమగు కృతికి మంచి పారితోషిక మీయఁబడుననియు, తక్కిన రచయితలు కూడ సమ్మానింపఁబడుదురనియు ప్రకటించెను. పెక్కుమంది విద్వాంసులు శతకములు వ్రాయ నారంభించిరి. కొందరు ముగించిరి. వానిలో శ్రీ ఆది

భట్ల-నారాయణదాసుగారి శతకము మాత్రము ముద్రిత మైనదఁట! కాని, విద్వాంసుల దురదృష్టమువలన వాని తారతమ్యములు నిర్ణయింపఁబడి బహుమానములు వచ్చుటకు ముందే యీ మహాప్రభువు దివంగతుఁడగుట సంభవించెను. ఇట్లే వీరు ముద్రింప నిశ్చయించిన శ్రీ పరవస్తు-వేంకటరంగాచార్యులవారి 'శబ్దార్థ సర్వస్వ' మను విజ్ఞాన కోశము ముద్రణభాగ్యము నొందలేదు. అది తప్పక ముద్రింపవలసిన యుత్తమోత్తమ గ్రంథము. ఇట్లే ప్రభువుల ప్రాచ్య గ్రంథాలయములో నున్న పరిభాషేందు శేఖర వ్యాఖ్య యగు త్రిపథగ, మహా విద్వాంసులు శ్రీ దండిభట్ల-విశ్వనాథ శాస్త్రిగారు రచించిన పరిభాషేందు చంద్రిక (ఇవియు సంస్కృతగ్రంథములే) అచ్చు పడవలసియున్నవి. ఈ వదాన్యప్రభువు ముఖ్యముగ ఆంధ్ర వాఙ్మయమునకును, ఆనుషంగికముగ ఇతర వాఙ్మయములకును చేసిన సేవ విలువకట్టరానిది!

ఆనందగజపతి మహారాజుగారి యనంతరము రాజ్యమునకు వచ్చిన విజయరామ గజపతి ప్రభువు కాలములో వాఙ్మయాభివృద్ధి యెక్కువగా జరుగుట కవకాశము లేక పోయినది. కారణమేమనఁగా-విజయరామ గజపతి ప్రభువు దత్తుఁడగుటవలన, ఆ దత్తత చెల్లదని రాజబంధువర్గములోని కొందఱు అభియోగము తెచ్చిరి. కొంతకాల మీ చిక్కులతోనే కాలము గడచిపోయినది. కొంతకాలము సంస్థానము ప్రభుత్వమువారు నియమించిన ప్రతిభావంతుల పర్యవేక్షణలో ఉండినది. అయినను, ఆ ప్రభువునకు

వాఙ్మయమునెడల ఆదరము లేకపోలేదు. భగవత్కవి శ్రీముడుంబై-నరసింహాచార్యస్వామిగారు రచించిన 'రామచంద్ర కథామృతమ్' అను బృహద్గ్రంథమును (సంస్కృతము) ఈ ప్రభువు ముద్రింపించెను. ఆదిభట్ల-నారాయణదాసుగారు కూర్చిన 'ఉమర్ ఖయ్యాం రుబాయతు' అను అమూల్యగ్రంథము ఈయనకే కృతి యీయఁబడినది. శ్రీ మండపాక-రామశాస్త్రిగారు తాము రచించిన 'ఆంధ్ర మహానాటకము' నీయనకే అంకిత మిచ్చిరఁట!

శ్రీ విజయరామగజపతి మహారాజుగారి పుత్రులగు శ్రీ అలక నారాయణగజపతి మహారాజుగారి కాలమున వెనుకటి వాఙ్మయ పోషణ కొనసాగుచునే యుండెను. శ్రీఆదిభట్ల-నారాయణదాసుగారు రచించిన 'నవరస తరంగిణి' కీయన కృతికర్తయై ఆ బృహద్గ్రంథమును తమ విజయరామ విలాస ముద్రాశాలలో ముద్రింపించిరి. ఆచార్య శ్రీ మామిడిపూడి - వెంకటరంగయ్యగారును, శ్రీ ఆకుండి - వేంకట శాస్త్రిగారును కలిసి యాంధ్రీకరించిన 'కౌటిలీయార్థశాస్త్రము'ను కృతిగా స్వీకరించిరి. శ్రీ భోగరాజు - నారాయణ మూర్తిగారు రచించిన 'ఆంధ్రకవిత్వ చరిత్రము'నకు కృతిభర్తలైరి. విజయనగరమున పలువది యేండ్లక్రిందట నుండిన 'కవిమండలి'కి ప్రధానపోషకత్వమును వహించిరి. శ్రీ బుఱ్ఱా - శేషగిరిరావుగారు నెలకొల్పిన 'ఆంధ్రభారతీతీర్థ పరిశోధక విశ్వవిద్యాలయము'నకు బహుముఖముల ప్రోత్సాహము నొసంగుచు, ఆర్థికముగ సాయపడుచుండిరి.

శ్రీ అలక నారాయణగజపతి మహారాజుగారి పుత్రులు త్యాగమూర్తులు, ప్రజాహితైకజీవులు నగు శ్రీ విజయ రామగజపతిరాజుగారు (శ్రీ పి. వి. జి. రాజుగారు) విద్యాభివృద్ధి యొనర్చుటలో అత్యంతాసక్తి కలవారు. తమ్మూలముగా ఈయన వాఙ్మయసేవ యొనర్చుచున్నారని చెప్పవచ్చును. వీరు ఆంధ్రప్రదేశమునకు విద్యాశాఖా మాత్యులగుట దీని కెంతయు దోహదము. ఈయన శ్రీ గంటి-సూర్యనారాయణశాస్త్రిగారు రచించిన 'కళింగ విజయ నగర చరిత్ర'కుఁ గృతికర్తలైనట్లు తెలియుచున్నది. ఈ గ్రంథ మింకను ముద్రింపఁబడలేదు.

శ్రీ పి. వి. జి. రాజుగారు తమ రాజభవనములోని ప్రాచ్య గ్రంథాలయములోని అమూల్యగ్రంథములను ముద్రింపించి, వాఙ్మయసేవ చేయ సంకల్పించినట్లును తెలియు చున్నది. అయ్యది అచిరకాలములోనే కార్యరూపము వహింపఁగలదని విశ్వసింపఁదగును.

# గ్రంథములు

విజయనగరప్రభువుల ప్రోత్సాహమున రచింపఁబడిన గ్రంథములలో ఇప్పుడు ఉపలబ్ధములగువానింగూర్చిన విషయములు అకారాదిక్రమమున ఈ ప్రకరణములో తెలుపఁబడును. వీనిలో ముద్రితములు కొన్ని; అముద్రితములు కొన్ని. కొన్నింటిని ప్రభువులే రచియించిరి. కొన్నింటిని వారంకితము పొందిరి. వారంకితము పొందకున్నను కొన్నింటికి ప్రోత్సాహము నొసంగిరి.

ఈ గ్రంథములలో నొండు, రెండు సంస్థానప్రభువుల సామంతులు రచించినవియు, సంస్థానామాత్యుల కృతిగా రచింపఁబడినవియుఁ గలవు. ఆ గ్రంథముల రచనకు ప్రభువుల యామోదముద్రయు, ప్రోత్సాహమును కలవను నాశయముతో ఆ గ్రంథములు నిందుఁ జేర్పఁబడినవి.

ప్రభువుల పోషణమున వెలువడినట్టియు, రచింపఁబడినట్టియు గ్రంథములనుగూర్చిన పరిచయమే ప్రధానముగుటవలన, ఆ యా గ్రంథములలోని విశేషములను గూర్చి యిచట వివరింపఁబడలేదు. గ్రంథవిమర్శనమునకు ప్రాధాన్య మీయఁబడలేదు.

ముద్రితగ్రంథములలో అమూల్యములు చాల కలవు. అముద్రితములన్నియును అమూల్యములే! మిక్కిలి శిథిలావస్థలో నున్న ఆ గ్రంథములు శీఘ్రకాలములో ముద్రణ

భాగ్యమును పొందనియెడల, పూర్తిగ శిథిలములయి, నామమాత్రావశిష్టములు కావలసివచ్చును. వానిని సంస్థాన ప్రభువులు వీలువెంబడిని ప్రకటింపఁగలరనియును, అవి ప్రకటింపఁబడినచో, వాని నాదరింపఁగల బాధ్యతను ఆంధ్రధానికము వహించుననియును నమ్మెద.

ఆంధ్రకవిత్వ చరిత్రము

కడచిన శతాబ్ది చివరి భాగమున శ్రీ గురుజాడ-శ్రీరామమూర్తిగారును, శ్రీ కందుకూరి-వీరేశలింగపంతులు గారును కవిజీవితములను, కవులచరిత్రమును రచించి యున్నారు. అందు ప్రధానముగా కవులను గూర్చిన విశేషాంశములే ఎక్కువగాఁ గానవచ్చుచున్నవి. ఆంధ్ర వాఙ్మయపు ప్రాచీనస్థితి, వికాసము, కాలానుగుణమగు పరిణామము మున్నగు విషయములను గురించిన గ్రంథము ఆకాలమున వెలువడలేదనియే చెప్పవలసియున్నది. ఇరువదవ శతాబ్ది ప్రథమపాదమున పండిత వంగూరి - సుబ్బారావుగారు 'ఆంధ్రవాఙ్మయ చరిత్రము'ను రచించి, వాఙ్మయపరిణామ వికాసములను కొంతవఱకును తెలుఁగు భాషాభిమానులకుఁ దెలిపి భాషాసేవ యొనర్చిరి. ఆ విషయముననే ఇంకను కృషియొనర్చి శ్రీ భోగరాజు - నారాయణ మూర్తిగారు కొంత విపులముగ 'ఆంధ్రకవిత్వ చరిత్ర ము'ను వ్రాయఁబూనిరి. అందలి మొదటి భాగము మాత్రము ప్రకటితమైనది. దీని తర్వాతిభాగములు రచియింపఁబడెనో, లేదో కూడ తెలియదు.

ఈ గ్రంథము, తొలుత చెన్నపట్టణమునుండి వెలువడుచున్న 'భారతి' మాసపత్రికలో పెక్కేండ్ల క్రిందట ప్రకటింపఁబడినది. తర్వాత గ్రంథరూపమును దాల్చి విజయనగర మహారాజావారి కళాశాలా గ్రంథమండలిలో రెండవ ప్రచురణగా వెలువడినది. క్రౌనుసైజున 250 పుటల పరిమితి గల యీ గ్రంథము రాజమహేంద్రవరము నందలి సరస్వతీ పవర్ ముద్రాక్షరశాలలో 1926 సం. లో ముద్రింపఁబడినది. ఆంధ్రవాఙ్మయ స్వరూప పరిణామములను తెలిసికొనుట కిది యెంతయు నుపయుక్తమగు గ్రంథము.

శ్రీ భోగరాజు నారాయణమూర్తిగారు సహజ సరస కవులు. ప్రాచీనాధునిక సంప్రదాయములను బాగుగా నెఱింగిన విద్వాంసులు. సుప్రసిద్ధ నవలా రచయితలు. వీరు వ్రాసిన విమలాదేవి, అల్లాహో అక్బర్, అస్తమయము, చంద్రగుప్త, ఆంగ్లరాజ్యస్థాపనము, లక్షణ మున్నగు నవలలు, కృష్ణకుమారి, కంకణము, కోకిలావసంతము, పండుగకట్నము మున్నగు పద్యకావ్యములు, సుప్రసిద్ధములు. ఈయన విజయనగరమున మహారాజావారి కళాశాలకుఁ జెందిన ఉన్నతపాఠశాలలో ఆంధ్రోపాధ్యాయులుగా ఉండిరి. ఈయన కవిత్వమునకు మెచ్చుకొని విజయనగర ప్రభువులువీరిని తమ ఆస్థానకవిగా నిర్ణయించి గౌరవించిరి.

ఈ 'ఆంధ్రకవిత్వ చరిత్రము' అలకనారాయణ గజపతి ప్రభువున కంకితము. ఇందలి యంకిత పద్యము లీ క్రింది విధమున నున్నవి-

శా. శ్రీకల్యాణగుణాత్మకం బమితకీర్తిస్ఫారచంద్రాతప
వ్యాకీర్ణంబు ననంతరత్నభవనంబౌ భూషకంఠాళికిన్
రాకాచంద్రుఁడు మత్కృతీశ్వరుఁడు మీర్జా అల్కా నారాయణ
క్ష్మాకాంతాగ్రణికిన్ విరించి యొసఁగుం గాకాయురారోగ్యముల్.

గీ. ఆంధ్రకవితాచరిత్రంబునందు దీని
మొదటి సంపుటమును నీకు ముదముతోడ
నిట్టు లర్పింపఁగంటి భూమీశచంద్ర!
యమలగుణసాంద్ర! నారాయణావనీంద్ర!

శ్రీ నారాయణమూర్తిగారీ గ్రంథమునకు వ్రాసిన పీఠికనుబట్టి వారీ 'ఆంధ్రకవిత్వ చరిత్రము'ను అయిదు ప్రకరణములుగా రచింపఁదలచినట్లు తెలియుచున్నది. మొదటి ప్రకరణములో కవి, కవిత్వముల లక్షణములు, వానింగూర్చిన మహాకవుల నిర్వచనము ఉండును. రెండవ ప్రకరణములో కవిత్వమునుగూర్చి సన్నవాదుల యభిప్రాయములు, మతభేదములు, ఆ మతములలో కాలానుగుణములగు మార్పులు, ఆదికవుల పద్ధతులు తర్వాతి వారికి మార్గదర్శకములైన విధములు ఉండును. మూఁడవ ప్రకరణమున కవులు, కవిత్వము, కావ్యములు—వీనింగూర్చిన లాక్షణికుల యభిప్రాయములు, వారి శాసనములు, వాని యుపయోగములు కొంత చర్చింపఁబడును. నాల్గవ ప్రకరణమున కవులచేఁ గావ్యములను వ్రాయించిన మహారాజులను గుఱించియు, క్రమముగఁ గవిత్వము ప్రజాదరణను పొందుటనుగూర్చియు విమర్శింపఁబడును. అయిదవ ప్రకరణములో గ్రంథాధారము లేని యుగమున శిల్పవిద్యావలని

ప్రయోజనము, నన్నయకుఁ బూర్వమున జైనుల కావ్య రచన, చరిత్రకారుల ఆంధ్రవాఙ్మయముగ విభజన వివరింపఁబడును. ఇట్లు శ్రీ నారాయణమూర్తిగారు పథకము నేర్పఱచుకొన్నను, రచన సమగ్రముగ సాగినట్లు కానరాదు.

## ఆంధ్రకౌముది

ఇది యొక యాంధ్రవ్యాకరణము. దీని మూల సూత్రములు, వ్యాఖ్యానము సంస్కృతమునందే యున్నవి. ఉదాహరణము లాంధ్రమునఁ గలవు. మూల, వ్యాఖ్యానములు దేవనాగరి లిపియందును, ఉదాహరణములు తెలుఁగు లిపియందును ముద్రింపఁబడినవి. ఫూల్సు కేప్ $\frac{1}{8}$ సైజున ఇది 97 పుటల గ్రంథము. రచయిత శ్రీ మండలక్ష్మీనారాయణకవి. నాంచారాంబా, వరదయజ్వాల పుత్రుఁడు. ఈ గ్రంథము విజయనగర ప్రభువులగు శ్రీమదానందగజపతి మహారాజుగారి యాజ్ఞ ననుసరించి కూర్పఁడినది. దీని ముఖపత్ర మీ క్రింది విధముగఁ గలదు.

"ఆంధ్రకౌముదీ
మండోపనామక లక్ష్మీనరసింహకవి రచితా
మహామహిమ శ్రీమద్విజయనగరాధిప
శ్రీమదానందగజపతి మహారాజాజ్ఞయా
శ్రీమత్పరమహంసపదాంకిత శ్రీనివాసజగన్నాథస్వామినా
ఆర్యవరగురుణా సంశోధితా
విజయతే తరామ్."

ఇది 1895-వ సంవత్సరమున విశాఖపట్టణమునందలి ఆర్ష ముద్రాక్షరశాలలో ఎ. సూరన్నచే ముద్రింపఁబడి, శ్రీమత్పరవస్తు - వేంకట రంగనాథస్వామి అయ్యావారలు గారిచే ప్రకటింపఁబడినది.

సాధారణముగా ఆంధ్ర వ్యాకరణములు సంస్కృత భాషలో రచించుట తొలుతనుండియుఁ బరిపాటి యైనది. వ్యాకరణము మున్నగు లక్షణ గ్రంథములు కంఠస్థము లగునపుడే మంచి యుపస్థితిలో నుండును. దానికి గీర్వాణ భాషయే మిక్కిలి యనుకూలమైనది. తొలి వ్యాకరణ గ్రంథముగా నెన్నఁబడుచున్న ఆంధ్ర శబ్ద చింతామణియు, దాని పరిశిష్టగ్రంథ మనఁదగిన వికృతి వివేకమును సంస్కృత మున శ్లోకరూపమున రచింపఁబడినవి. చిన్నయసూరి తన బాల వ్యాకరణమును రచించుటకుఁ బూర్వము సంస్కృత ముననే వ్యాకరణమును రచించినట్లు చెప్పికొని యున్నాఁడు. శిష్టు - కృష్ణమూర్తిశాస్త్రిగారి 'హరికారికావళి' యును, భాగవతుల - రామమూర్తిశాస్త్రిగారి 'హరికారికా శేష సర్వస్వము'ను సంస్కృతమునందే రచింపఁబడి యుండుట యెల్లరకుఁ దెలిసిన యంశమే! ఈ వ్యాకరణ గ్రంథము కూడ ఆ ప్రాచీన సంప్రదాయము ననుసరించియే రచింపఁ బడినదని చెప్పవచ్చును.

ఇందు పరిభాష, సంధి, అజంతములు, హలంత ములు, కారక ప్రక్రియ, సమాసములు. క్రియలు, అవ్యయ ములు, తద్భవప్రక్రియ అను విభాగములు కలవు.

పరిభాషా ప్రకరణమున త్రిలింగభాషోత్పత్తి, తత్సమాదు లేర్పడిన రీతి, ప్రకృతి వికృతి స్వరూపము, అచ్చుల హల్లుల విభాగము, వివిధ సంజ్ఞలు, గణ యతి ప్రాస సామాన్య లక్షణము కలవు. ఇది యించుమించుగ ఆంధ్ర శబ్ద చింతామణినే యనుసరించుటవలన, అందు 'వళిరాద్య మనంతరాక్షరం ప్రాసః' అని యుండుటంబట్టి 'మాదయో గణాః, వళిరాద్య మనంతరం ప్రాసః' అని యిందును చెప్పఁబడినది. సంధి మున్నగు ప్రకరణములలో ఆ యా విషయములు కలవు. అవ్యయములనుగూర్చి చెప్పునపుడు 'అయ్యాక్కామ్మాద్యాః' అని 'అయ్య' మున్నగునవి అవ్యయములుగా గ్రహింపఁబడినవి. అవ్యయములు కొన్ని చెప్పఁబడినవి కాని, అవ్యయ లక్షణము కానరాదు.

ఇతర వ్యాకరణ విలక్షణముగా ఇందు ఒక ప్రత్యేక ప్రకరణమునందు తద్భవ ప్రక్రియ చెప్పఁబడినది. ప్రాకృత వ్యాకరణ సూత్రముల ననుసరించి యిందు కొన్ని తద్భవ రూపములు సాధింపఁబడినవి.

## ఆంధ్ర ధర్మ సింధుసారము

ధర్మసింధువు సంస్కృతమునఁగల ధర్మశాస్త్ర గ్రంథములలో అగ్రశ్రేణికిఁ జెందిన ప్రమాణగ్రంథము. సామాన్యముగ పండితులకుఁగూడ నియ్యది దుర్గ్రాహ్యము. సర్వశాస్త్రములందును గొప్ప పాండిత్యము కలిగి ధర్మ తత్త్వముల నెఱింగినవారే దీనిని అర్థము చేసికొనఁగలరు. దీని

నాంధ్రీకరించుట అసాధ్యమైన పని! సమస్తశాస్త్ర పారంగతులును, ప్రతిభాశాలురును, ఆనందగజపతి ప్రభువు నాస్థాన విద్వాంసులు నగు బ్రహ్మశ్రీ కొల్లూరు-కామశాస్త్రి గారు సంస్కృత ధర్మసింధువునందలి సారమును సర్వజనోపయోగకరముగ నేతద్గ్రంథరూపమున నాంధ్రుల కొసంగుచున్నారు.

ఇయ్యది ముద్రితము; రాయల్ సైజున 648 పుటల గ్రంథము. 1888-వ సంవత్సరము డిసెంబరు నెల ౯-వ తేదీని చెన్నపురిలోని ఎంప్రెస్ ఆఫ్ ఇండియా ముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది.

ఏతద్గ్రంథరచనావశ్యకతంగూర్చి గ్రంథకర్తయే పీఠికలో క్రింది రీతిని వివరించి యున్నాఁడు-

"లోకమునందుఁ దెలిసి యాచరించెదరేని, మనుష్యుల కందరకు నుద్ధారకములగు శ్రుతిస్మృతులచే విధించబడిన వర్ణాశ్రమ ధర్మములు విప్రకీర్ణము లగుటచే యథాకాలముగ వానిని స్మరించుట యర్వాచీనుల కెంతటివారికి నశక్యము. కనుక ప్రాచీన నిబంధకారులచే వాని వ్యవస్థలు స్పష్టముగ వివరింపఁబడినను, నవి సంస్కృతభాషావకుంఠనముచే నెల్లరకు నుపయోగింపకుండెను. మరియు నీ దేశమునకు సహజమైన యాంధ్రభాషయందలి గ్రామ్యత్వదోషము నివర్తింపఁజేయుటకు మాత్రము యత్నించి, ప్రాచీన విద్వాంసులగు నన్నయభట్టారకుఁడు, తిక్కన సోమయాజి, పెద్దనార్యుఁడు మొదలగువారు కట్టుదిట్టములచే నీ భాషకు

సంస్కృతమంత ఘనత తెచ్చియు, తమ రసజ్ఞతను, పాండిత్య ప్రకర్షమును వెల్వరించు ప్రౌఢభాషతో మహాప్రబంధంబులను జేసిరి కాని, యొకరైనను సాక్షాజ్జగదుద్ధారకమైన శాస్త్రములలో నొకటియైన దెనిగించుటకు నుత్సహింపరైరి. ఆధునికులు నట్లె గతానుగతికమార్గము ననుసరించిరి. కనుక నాంధ్రభాషయందు శాస్త్రవాణి యొకింతయు గానరాదయ్యె. ఇట్లనన్యగతికమైన జగము నుద్ధరించుటకు శాస్త్రములలో ముఖ్యమగు ధర్మశాస్త్రమును సర్వసాధారణమైన స్వభాషలో తెనిగించుటకు నుత్సహించి శ్రీమద్విజయనగర సంస్థాన నిరతిశయోదయ ప్రతిష్ఠాపన నిష్ఠాగరిష్ఠులును, వసిష్ఠగోత్ర పవిత్రీకరణధురీణ వరచరిత్రులును, నప్రతిమ ప్రతిభానికష నికషిత సర్వశాస్త్ర సిద్ధాంత విశేషులును, శ్రీ పూసపాడ్వంశపయః పారావార రాకాసుధాకరులును, శ్రీసింహాద్రి చక్రచూడామణి మహోదధీశ కళింగ దేశాధిపతి మిర్జా మన్నెసుల్తాన్ బహదూరిత్యాది బిరుద విశేష విభూషితులును, హిజ్ హైనెస్ ది మహారాజా ఆఫ్ విజయనగరం కె. సి. ఐ. ఇ. వారునగు శ్రీమదానందగజపతి మహారాజచంద్రు లాజ్ఞాపించిన, తత్సభామాన్యమానుండగు కొల్లూరు - కామశాస్త్రిచే రచింపబడిన ఈ ఆంధ్రభాషారూపమగు ధర్మసింధుసారము లోకమం దాచంద్రతారకముగ వారి యుద్దేశము ఫలింపజేయుచు, సర్వోపకారకంబై వెలుంగుగాక !

మ. క్షమయున్ సత్యము సాహసంబు దయయున్ గాంభీర్యమున్ ధైర్యమున్
శమమున్ జ్ఞానము మానమున్ సమత యైశ్వర్యాదులెల్లన్ సుమ
క్రముగాఁగం దననుండి లోకమున కెక్కన్ జెప్ప వ్యత్యస్తము
త్నమవశ్యంబ యటన్న నీతిగతు లానందేంద్ర! నీ కెఱుగన్."

## ఆంధ్ర వైశేషికోపస్కారము

షడ్దర్శనములు సంస్కృతానభిజ్ఞులకు దురవగాహములు. వానిని జనసామాన్యమునకు నర్థమగు భాషలో ఆంధ్రీకరింపఁజేయుట గత శతాబ్దముచివర విజయనగర సంస్థానమును పాలించిన ఆనందగజపతి మహారాజుగారి సంకల్పము. ప్రభువుల సంకల్పమున కనుగుణముగ, తదాస్థాన విద్వాంసులలో ముఖ్యులును, సుప్రసిద్ధ విద్వత్కవులలో నొక్కరును, శ్రీ మండ - కామేశ్వర కవి సార్వభౌముల పుత్రులు నగు శ్రీ లక్ష్మీకామేశ్వరపండితులు వైశేషిక దర్శనమును 'ఆంధ్ర వైశేషికోపస్కార'మను నామముతో ఆంధ్రీకరించిరి. ఇది అముద్రితము. ఫూల్స్కేప్ సైజు ½ న సన్నని వ్రాఁతలో 231 పుటల మహా గ్రంథము. పోషక ప్రభువుల ప్రోత్సాహమువలననే ఇది రచింపఁబడినట్లు తెలియుచున్నది.

గ్రంథారంభ మిట్లున్నది—

'ఆధ్యాత్మికాది తాపత్రయముచే బీడితులగు వివేకవంతులు, ఆ తాపత్రయము నివర్తించు నుపాయమును వెదకుచు, శ్రుతిస్మృతి పురాణేతిహాసంబులఁ బరిశీలించి, యందు నాత్మతత్త్వసాక్షాత్కారమే తన్నివర్తనోపాయముగ దెలియుచు, నట్టి సాక్షాత్కారము లభించు

వారపుణ్యోరి పరమకారుణికుడగు కణాదుడను మునివర్యు సేవించ నేతెంచిన, వారలంగాంచి తత్త్వజ్ఞానవైరాగ్యైశ్వర్యసంపన్నుండగు నమ్మునిశ్రేష్ఠుండు ఆరుపదార్థములయొక్క సాధర్మ్యవైధర్మ్యజ్ఞానములచే నగు తత్త్వజ్ఞానమే యాత్మసాక్షాత్కారము లభించుటకు మునివృత్తి లక్షణమగు ధర్మమున వీరల కనాయాసముగ నలవడునని ముందుగ లక్షణస్వరూపములచే ధర్మము నుపదేశించి, పిమ్మట నారగు పదార్థముల నుద్దేశ, లక్ష్య, లక్షణములతో నుపదేశించెదనని యూహించి, వారలు సావధానులై యుండుటకై ప్రతిజ్ఞఁ జేయుచున్నాడు.

అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః,

.......... .......... ..........

గ్రంథాంతము—

'ఇది శ్రీమదుమారమణ చరణారవింద భజనాసమాసాదిత నిఖిల విద్యావైదుష్యధురీణ, శ్రీమన్మండ-కామేశ్వర కవిసార్వభౌమపుత్ర, లక్ష్మీ కామేశ్వరనూరి విరచితమగు నాంధ్రవైశేషికోపస్కారంబున సర్వం బును దశమాధ్యాయంబున రెండవ యాహ్నికము ముగిసెను. శాస్త్రము కూడ ముగిసెను. విరోధి సంవత్సర మాఘ బ 3 బుధవారం సమాప్తము.

## ఆంధ్ర వ్రతరాజము

ఇతర ప్రాంతములలోని జనులకంటె ఆంధ్రులకు నోములపయిని, వ్రతములపైని ఆసక్తి యధికము. కావున, ఆ తెలుఁగువారి యుపయోగార్థము సంస్కృతమునందలి వ్రతరాజము శ్రీ విజయనగర ప్రభువులగు ఆనందగజపతి మహారాజులుంగారి యాజ్ఞ మేరకు తెలిఁగింపఁబడినది. అను వాదకర్త సర్వశాస్త్ర విశారదులగు శ్రీ కొల్లూరు-కామ

శాస్త్రిగారు. ఇది అముద్రితము. ఫ్రూల్స్కేప్ 1/4 సైజున 826 పుటలలో సన్నని యక్షరములలో పుట కించుమించు నలువది పంక్తులతో నియ్యది లిఖింపఁబడినది. ఇది చాల శిథిలావస్థలో నున్నది.

గ్రంథారంభము—

క. "శ్రీరాజిత దుర్గాంబా
ధీరవ్యావానందగజపతిమహా......
............కారణ ముని
వారణమాఁగఁ దెలుగు చేతు వ్రతరాజంబున్.

శ్లో. ఓంకార విఘ్నేశ గుహాన్ సరస్వతీం
గౌరీశ మార్యాంచ హరిం చ భైరవమ్,
ప్రణమ్య దేవాన్ కురుతే హి గ్రంథం
దైవజ్ఞశర్మా జగతో హితాయ."

చివఱిభాగమునందలి గద్య—

'ఇట్లు శ్రీమద్విజయనగరసంస్థాన నిరతిశయోదయ ప్రతిష్ఠాపన నిష్ఠాగరిష్ఠులు, నప్రతిమ ప్రతిభానికష నికషిత సకలశాస్త్ర సిద్ధాంత రహస్యప్రకాశకులు, ననవధి క్షమౌదార్య ధైర్యశౌర్య గాంభీర్యాది జగదుపకారక సుగుణగణ ధిక్కృత నల నహుష దిలీపాది పూర్వరాజేంద్రులును, శ్రీమదానందగజపతీంద్రులునైన హిజ్ హైనెస్ ది మహారాజా ఆఫ్ విజయనగరం కె. సి. ఐ. ఇ. వారి యాజ్ఞచే తత్సంస్థానమాన్య మానుండగు కొల్లూరు - కామశాస్త్రి రచియించిన యాంధ్రవ్రతరాజంబు సంపూర్ణమాయెను.'

ఉమర్ ఖయ్యాం—రుబాయతు

ఉమర్ ఖయ్యాం మహాకవి పారశీక భాషలో రచించిన రుబాయతున కిది యనువాదము. రచయిత శ్రీమదజ్ఝాడాదిభట్ల - నారాయణదాసుగారు. వీరి తండ్రి వెంకటచయనులుగారు. తల్లి నరసమాంబ. గొప్ప ప్రతిభాశాలి యగు నీయన సంస్కృతాంధ్రాంగ్లములలో నాశువుగను, రసవంతముగను కవిత్వము చెప్పఁగలరు. ఈయన కళాశాలలో ఎఫ్. ఎ. వఱకు మాత్రమే చదివినను స్వయంకృషివలన వివిధ భాషలలో మంచి పాండిత్యము గడించిరి. లయబ్రహ్మ, సంగీత సాహిత్య సార్వభౌమ, ఆటపాటల మేటి మున్నగునవి శ్రీ నారాయణదాసుగారి బిరుదములు.

ఉమర్ ఖయ్యాం రచించిన రుబాయతు ప్రపంచ ప్రసిద్ధినొందిన రసవత్కావ్యము. భారత దేశమునందును, దేశాంతరములందును గల వివిధ భాషలలోని కిది పరివర్తింపఁబడినది. తెలుఁగులో కూడ దీని కనువాదములు చాల గలవు. అనువాదకర్త లందరు నించుమించుగ ఎడ్వర్డు ఫిడ్జిరాల్డు పండితుఁడు వ్రాసిన ఆంగ్లానువాదముపయి నాధారపడియే తమ యనువాదములను సాగించిరి. మూలకర్త యాశయము నెఱుఁగక యనువాద రచనకుఁ బూనుకొనుట సరికాదని శ్రీ దాసుగారి యభిప్రాయము. అందులకై వీరు ఒక మున్షీ మూలమున పారశీక భాషను నేర్చుకొని, యందు చక్కని పాండిత్యమును సంపాదించి, యామీఁదనే దీనిని రచించుటకుఁ బూనుకొనిరి.

ఇందు ఉమర్ ఖయ్యాం మూలము, ఫిడ్జిరాల్డు ఆంగ్లాను
వాదము, సంస్కృతానువాదము, అచ్చాంధ్రమునఁ గల అను
వాదము ఫూల్సుకేపు 1/4 సైజులో ఆర్టు కాగితముపయి 328
పుటలలో బొంబాయిలో ముద్రింపఁబడినది. గ్రంథము చివఱ
తెలుఁగు పద్దెములకు వివరణము, అచ్చ తెనుఁగుపదముల
కర్థములు నీయఁబడినవి. 1932 లో ఇది ముద్రితమైనది.
దీనిని శ్రీ నారాయణదాసుగారును, శ్రీ విజయరామగజపతి
మహారాజుగారి దేవి శ్రీ లలితా కుమారీదేవియుఁ గలిసి
కీర్తిశేషులగు శ్రీ విజయరామగజపతి ప్రభువుగారికి అంకిత
మిచ్చిరి. దీనింబట్టి శ్రీ లలితాకుమారీదేవి మహారాణిగారికి
శ్రీ దాసుగారియెడలను, గ్రంథముపైని గల ఆదరాభి
మానములును, భర్త యగు ప్రభువుపైఁ గల భక్తి గౌరవ
ములును వెల్లడి యగుచున్నవి. ఇందలి యంకిత పత్రము
ఆంగ్లభాషలో నీ క్రింది విధముగా నున్నది---

Dedicated to the Sacred memory
of Maharaja Sri Vijayaramaraj
the Late Raja Saheb of Vizianagaram
by the author
Adibhatla Narayanadas

*Principal* :
Sri Vijayanama gana patasala
Vizianagaram

and Lalitha Kumari Devi

రుబాయతు ఆంధ్రానువాదమున మచ్చునకు రెండు పద్యములు—

క. 'తలఁపోదవిన తోడ్తోనే
తెలుపుగ నీ బొమ్మలాట చెలఁగించున్ దాఁ
జెలియుఁ దెలుపుఁ దెలిపించున్
బలుమరు నావేల్పు కాని పనిలే దెదియున్.

కానిపించవు మాటికడఁగి యందంద
యెల్లదిక్కులను నీవే యాడువటె!
కనఁగొందు నీవె నిక్కముగ నీగొప్ప
కనువాఁడు కన్న నిక్కము రెండు నీవె!'

శ్రీ నారాయణదాసుగారు దీనినే కాక నవరస తరంగిణి, సత్యవ్రతి శతకము, ధ్రువచరిత్ర, అంబరీష చరిత్ర, శ్రీకృష్ణ జననము, సీతాకళ్యాణము మున్నగు హరికథలను, సారంగధర నాటకమును, 'బాటసారి' అను పద్య కావ్యమును వ్రాసిరి. అచ్చ తెలుఁగు కూర్పులో ఆదరము గల వీరు 'ఈసబ్ నీతికథ'లను 'నూర్గంటి' గను, ఋగ్వేదములోని కొన్ని ఋక్కులను 'మొక్కుబడి'గను 'విష్ణు సహస్ర నామము'లను 'వెన్నుని వేయిపేర్లు' గను తెలిఁగించిరి. 'అచ్చ తెలుఁగు పలుకుబడి' అను లక్షణ గ్రంథమును, 'జగజ్జ్యోతి' అను వచన గ్రంథమును వ్రాసిరి. ఇవి కాక సంస్కృతమున 'తారకమ్' అను వ్యాకరణమును, 'హరి కథామృతమ్' అను హరికథా సంపుటమును కూర్చిరి. సంస్కృతాంధ్రములలో పెక్కు శతకములను రచించిరి.

వీనిలోఁ జాలవఱకును అముద్రితములు. ఆ యముద్రిత గ్రంథముల ప్రకటనమునకుఁ గేంద్ర ప్రభుత్వము, ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వము పూనుకొనుచున్నట్లు తెలియుచున్నది.

## ఉషాభ్యుదయము

ఇది యొక ప్రౌఢ ప్రబంధము. దీని రచయిత విజయనగర సంస్థాన పాలకులలో నొకఁడగు పూసపాటి వెంకటపతి మహీపాలుఁడు. బొబ్బిలి యుద్ధమున వీరస్వర్గము నలంకరించిన విజయరామగజపతి మహారాజున కీయన పెదతండ్రి. ఇతఁడు అన్నమరాజునకుఁ బౌత్రుఁడు. కృష్ణమరాజ కుమారుఁడు. తల్లి కేసమాంబ. తన తాత తండ్రులను, తల్లిని గూర్చి కవి యిట్లు వర్ణించి యున్నాఁడు—

సీ. 'లయకాల కీలి కీలాభీల మాలిక
మించి శాత్రవుల ఖండించువేళ,
స్థిరసాంద్రచంద్రికా పరిపూర్ణచంద్రుఁడై
లీల భూజనులఁ బాలించువేళ,
దళ శతవదన ప్రధాన భోగీంద్రుఁడై
లలితకళాప్రౌఢిఁ దెలుపువేళ,
బహుదళ సుమఫల భరిత మందారమై
యొనర నరులకోర్కె లొసఁగువేళ,

గీ. నీతఁడని సర్వజనులు సంప్రీతిఁ గొల్వ
నలరుచుండెడి పూసపాట్యన్వయాబ్ధి
చంద్రుఁడగు కృష్ణరాజేంద్ర చక్రవర్తి
నందనుం డన్నభూప పురందరుండు.

గీ. అమ్మహీపతి పరిణయమయ్యె వేడ్క
తనర సీపూరి వేంగళేంద్రుని సుపుత్రి
నమిత కల్యాణకలిత విఖ్యాత మహిత
విమలసద్గుణ నికురుంబ వేంగళాంబ.

గీ. ఆ వధూమణియందు నెయ్యంబుతోడ
నన్నభూపతి గాంచె విఖ్యాతులైన
సుతుల నిరువుర నత్యంత సుభగయశులఁ
గృష్ణభూపాలు, గోపాలకృష్ణవిభుని.

గీ. గోటిముఖ్యుల వంశాబ్ధి కువలయాప్తుఁ
డనఁగఁ జెన్నొందు బంగారు జనవరేణ్యు
తనయ యైనట్టి కేసమాంబను వరించె
మజ్జనకుఁడైన కృష్ణక్షమావిభుండు.

సీ. తనతండ్రి యొప్పు దప్పులను భంగము నొందఁ
గను లక్ష్మి యేపాటి కలిమిపొలఁతి ?
తనపుత్రకుని నపుత్రకునిగాఁ గనునట్టి
గంగ యే పుణ్యసంకల్పవతియొ ?
తనపతి బహుళార్తి నొనయఁ గముంగొను
రోహిణి యే యనిరుద్ధచరిత ?
తన సుతు పెండ్లిసేయను నేరక మెలంగు
పర్వతాత్మజ యే శుభప్రదాత్రి ?

గీ. యనఁగ వెలసెఁ బతిహితాయత్తయగుచు
పూసపాట్యన్నమేదినీభుజాని కృష్ణ
రాయ విభురాణి మాధుర్య రమ్యవాణి
కీర్తిసద్గుణ నికురుంబ కేసమాంబ.

ఉషాభ్యుదయము విజయనగరముచేరువ నున్న శ్రీరామతీర్థ క్షేత్రమునందలి శ్రీరామచంద్రున కంకిత మీయఁబడినది. ఉషానిరుద్ధుల వివాహ వృత్తాంత మితి వృత్తముగా, శృంగారరసము ప్రధానముగా నియ్యది మనోహరముగ రచింపఁబడినది. ఇం దయిదాశ్వాసములు కలవు. కాని, నైదవ యాశ్వాస మసమగ్రముగానే యున్నది.

మొదటి యాశ్వాసములో, కృత్యాద్యనంతరము కృతికర్త వంశావళి, పురవర్ణనాదికము, పరమేశ్వరుని గూర్చిన బాణాసురుని తపస్సు, మహేశ్వర సాక్షాత్కారము, వరప్రదానము వర్ణింపఁబడినవి. రెండవ యాశ్వాసములో వసంతర్తు వర్ణనము, ఉషాకన్యా సౌందర్య వర్ణనము, ఆమె వనవిహారము, ఉమకుఁ బార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమగుట, భావి స్వప్నవృత్తాంతాదికము వర్ణింపఁబడినవి. తృతీయాశ్వాసమునందు ఉషాకన్య స్వప్నమునందు అనిరుద్ధుని గాంచి ప్రేమించుట, విరహము, ఆమె చెలికత్తె యగు చిత్రరేఖ యుషా స్వప్న వృత్తాంతమును దెలిసికొని, తన చిత్రకళా నైపుణ్యమును జూపుచు వివిధ రాజకుమారుల చిత్రములను వ్రాయుచు, ఉష వలచిన యువకుఁడు శ్రీకృష్ణుని మనుమఁడగు అనిరుద్ధుఁడని తెలిసికొనుట, ఆమె తన యాకాశగమనశక్తివలన అనిరుద్ధుని ఉమకడకుఁ దెచ్చుట, గాంధర్వ వివాహము మున్నగునవి కలవు. అనిరుద్ధుని వృత్తాంతము బాణునకుఁ దెలియుట, అనిరుద్ధుని రాక్షసరాజు చెఱలో బంధించుట, నారదుఁడు, చెఱలో బాణునిచే అనిరుద్ధుఁడు బంధింపఁబడినట్లు శ్రీకృష్ణునకుఁ

చెల్పుట, శ్రీకృష్ణుఁడు తగిన సన్నాహముతో బాణుని పైకి దండయాత్ర వెడలుట, నాల్గవ యాశ్వాసములో వర్ణింపఁబడి యున్నది. ఐదవ యాశ్వాసమునఁ గొంచెము భాగమే కలదు. మిగిలిన కథ యీ యాశ్వాసమున వర్ణింపఁబడి యుండును. ఈ గ్రంథము పూర్తిగ లభించినఁగాని, యందలి కథాంశమును వివరముగాఁ దెలిసికొనుట కవకాశము లేదు.

ఉషాభ్యుదయము చక్కని ప్రబంధము. సంస్కృత పదములు దీనియం దెక్కువగా వాడఁబడినవి. కవి తన రచనకు వసుచరిత్ర మున్నగువానిని ఆదర్శములుగా గ్రహించినట్లు తోఁచుచున్నది.

సీ. 'లీలావలితభంగమాలాధికృత తుంగ
డోలాంచితపతంగ బాలరంగ
మారాజితపరాగ సారాభ్యలితభోగ
నీరాటనసవేగ తీరభాగ
మాలంబిత తమాల నీలచ్ఛదవిశాల
శాలత్కృతకకూల సాలజాల
మలిచుంబనవికార ఫలశోపమితసార
సలతాంతగతపారవశికసార

గీ. మనత ఘనతర విహతవరవటదచ్ఛ
మత్స్య కృత్తచ్ఛాంబు బిందుచామరవినోద
కోక జలహంస కలహంస కులవిలాస
శారదచిరంబు కేళి సరోవరంబు.'

అను నిందలి పద్యము వసుచరిత్రమునందలి—

సీ. 'అలినాజనాపాంగ జలనావసదభంగ
తులనాభికాభంగ దోః ప్రసంగ
మలసానిలవిలోల దళసాసవరసాల
ఫలసాదరశుకాలపనవిశాల
మలినీ గరుదనీక మలినీకృత ఘనేక
మలినీ సుఖితకోక కులవధూక
మతికాంత సలతాంత అతికాంతరనితాంత
రతికాంత రణతాంత సుతనుకాంత

గీ. సుకృతకామోద మరదకావికల వకుళ
ముకుళ సకల వనాంత ప్రమోదచలిత
కలిత కలకంఠ కులకంఠ కాకలీవి
భాసురము వొల్చు మధుమాస వాసరంబు.'

[ఆశ్వాసము I. ప. 128]

అను పద్యము ననుసరించి వ్రాయఁబడినట్లు తోఁచును. ఇట్లే విజయవిలాసమునందలి-

ఉ. 'రే లమృతాంశుగో శశము రెమ్ముదముఁ దలంచి జూసినా
మేలి పసిండి సోయగపు మేడల గుజ్జెన గూళ్ల చందడిన్
బాలికలుండి యావలఁ జనంగని చింతిలి 'వంట యింటి కుం
దేలిది; యెందుఁ బోఁగలదు? నేఁటికి నే'మని యాడురందులన్.'

అను గ్రంథాదిలోని ౯-వ పద్యము ననుసరించియే-

చ. 'అచటి యనంతరత్నముల హర్మ్యములొప్ప దిశాంత మెంతయున్
ప్రచురతఁ దా ననంత సుఖ పద్ధతిఁజూడఁ బురాంగనల్ సదా
రుచిఁ గని మిత్రుఁడంచు నవరోధము సేయుచుగాక 'బాలక
ప్రచరుఁడ వెందుఁ బోఁగలఁడు? పట్టెద' మందురు సౌధసీమలన్.'

అను పద్యము కూర్పఁబడినదని చెప్పవలసియున్నది. చంద్రోపాలంభన సందర్భమునఁ గల క్రింది పద్యము గమనింపఁదగినది.

గీ. 'జన్మ మమృతాబ్ధి; నమృతంబు చక్కఁదనము;
పదవి శంకరమౌళి యాబాల్యవసతి;
యిన్ని గల్గి యనాథల నేఁచెదేల?
కులము రూపంబు గొలఁది సద్గుణము వలదె?'

కన్యాశుల్కము

విజయనగర ప్రభువులకు వాఙ్మయాభివృద్ధియెడల నెట్టి యాసక్తియు, సనాతనధర్మములం దెట్టి పట్టుదలయు కలవో, సంఘ సంస్కరణమునను, దురాచార నిర్మూలమునందును అట్టి యాసక్తి కలదనుటకు వారు వివాహ సమయములలో వరుఁడు శుల్కమిచ్చి కన్యను కొనరాదని ప్రజలను ప్రబోధించుటకై యొనర్చిన ప్రయత్నమే తార్కాణము. ఈ విషయమున ఆనందగజపతి ప్రభువు చేసిన ప్రయత్నము ప్రశంసార్హము. దాని ప్రచారమునకయి రచింపఁబడిన నాటకమే కన్యాశుల్కము. దీని రచయిత శ్రీ గురుజాడ – అప్పారావుగారు. ఈయన పేరు 'వెంకట అప్పారావు'గా ఇప్పుడు వ్యవహరింపఁబడుచున్నను, కన్యాశుల్కము, నీలగిరి పాటలు' మున్నగువాని తొలి ముద్రణముల ముఖపత్రములపైని 'అప్పారావు' అనియే ముద్రింపఁబడి యున్నది.

అప్పారావుగారి జన్మస్థలము విశాఖపట్టణముజిల్లా ఎలమంచిలి తాలూకాలోని రాయవరము. ఈయన విజయనగరమునకు వచ్చి మహారాజావారి కళాశాలలో విద్యాభ్యాసము చేసి పట్టభద్రులై, ఆ కళాశాలలోనే కొంత కాలము అధ్యాపకవృత్తిని అవలంబించిరి. ఆ సమయము నందే ఆనందగజపతి ప్రభుని దృష్టి నాకర్షించి సంస్థానములో ప్రాచీన లిపి పరిశోధకుఁడుగా పని చేయసాగెను. ప్రముఖములుగా తెలుఁగు భాషను పరిశోధించుటకును, నూతన పద్ధతులలోను క్రొత్త ఛందస్సులలోను రచనలు సాగించుటకును ఆ సమయముననే ఈయనకు ఉత్సాహము కలిగెను. అప్పారావుగారు క్రమముగా ప్రభువుల కాంతరంగికులైరి. శ్రీ ఆనందగజపతి ప్రభువు సంకల్పించిన కన్యాశుల్క నిషేధ ప్రచారమున కనుకూలముగా కొంత హాస్యధోరణిలో 'కన్యాశుల్క'మను నీ నాటకమును వ్రాసి, ఆనందగజపతి మహారాజులుంగారికే అంకిత మిచ్చిరి. దీని ప్రథమ ముద్రణా ముఖపత్ర మిట్లున్నది-

"శ్రీరస్తు

కన్యాశుల్కము

ఇది విజయనగరరాజ్యమున ప్రాచీన లిపి పాఠకుఁడగు

గురజాడ - అప్పారావు పంతులు బి. ఏ., చే

రచియింపఁబడినది.

శ్రీవిజయనగరము -

శ్రీవిజయరామవిలాస ముద్రాక్షరశాలయందు

కొంకిపూడి-భద్రయ్యచే

ముద్రింపబడి, ప్రకటింపఁబడినది.
౧౯౨౭. మే. ౨౩.

 దీని వెల ౮ అణాలు,
అంచెకూలి అణా."

కన్యాశుల్కము తొలుత కొలఁది రంగములతోఁ గూడిన చిన్న నాటకము. రెండు గంటల కాలములో ప్రదర్శించుట కనుకూలముగ నుండినది. కాని, తర్వాతి ముద్రణములలో శ్రీ అప్పారావుగారే మార్పులు, చేర్పులు మున్నగువాని మూలమున గ్రంథము నెక్కువగాఁ బెంచిరి. ఇప్పుడున్న రీతిలో నీ నాటకమును పెక్కు రంగములను తగ్గించకయే ప్రదర్శించుట సాధ్యము కాదు. అయినను, ఆధునిక వ్యావహారిక దృశ్యములలో నిద్యది అగ్రస్థానమును వహించి, రచయితకు గొప్ప కీర్తిని సంపాదించి యిచ్చినది.

శ్రీ అప్పారావుగారీ నాటకమునే కాక 'పూర్ణమ్మ, లవణరాజు కథ' మొదలైన ఖండకావ్యములను, 'నీ పేరేమిటి? మెటిల్డా, సంస్కర్త హృదయము' మున్నగు కథానికలను, 'దేశమును ప్రేమించుమన్నా, లంగరెత్తుము' మొదలయిన గేయములను, ఇంకను 'కొండుభట్టీయము, బిల్హణీయము మున్నగు అసంపూర్ణ గ్రంథములను రచించిరి. నీలగిరి దృశ్యములను వర్ణించుచుఁ గూర్చిన వీరి 'నీలగిరి పాటలు' ప్రత్యేకముగఁ జెప్పఁదగినది.

ఈయన సారంగధర చరిత్రను ఆంగ్లమున ప్రదర్శన యోగ్యముగు నాటకముగా రచించినట్లు తెలియుచున్నది. ఆనందగజపతి ప్రభువునకు భారతీయ నాటకములను ఆంగ్ల భాషలో ప్రదర్శింపఁజేయుట మిక్కిలి యిష్టము. కావున, ఈయన యాంగ్ల భాషలో నాటకరచనకుఁ గడంగి యుండ వచ్చును.

## కవి జీవితములు

తెలుఁగు దేశమునందలి కవులనుగూర్చి సవిమర్శనము గను, విపులముగను వివరించు గ్రంథములలో శ్రీ కందుకూరి-వీరేశలింగము పంతులుగారు రచించిన 'కవుల చరిత్ర' యే తొలుత పేర్కొనఁదగినది. కాని, శ్రీ వీరేశలింగము పంతులుగారికిఁ బూర్వమే యిట్టి పనికిఁ బూనుకొని శ్రీ గురుజాడ - శ్రీరామమూర్తిగారు 'కవిజీవితము'లను వ్రాయఁ గడంగిరి.

శ్రీ గురుజాడ - శ్రీరామమూర్తిగారు గత శతాబ్ది మధ్యభాగమున జన్మించిరి. తండ్రి శ్రీ దుర్గాప్రసాదరావు గారు. వీరి నివాసము కాకినాడ. శ్రీరామమూర్తిగారు ఆ నగరమునందే మెట్రిక్యులేషను వఱకును విద్య నభ్యసించి, పిదప నచ్చటి సబ్ కోర్టులో ఉద్యోగిగాఁ జేరిరి. ఈయన కాంధ్రభాషా వాఙ్మయములందును, చరిత్ర పరిశోధనము నందును ఆసక్తి యధికము. అందువలన తొలుతనుండియుఁ జక్కని కృషిచేసి మంచి పాండిత్యమును సంపాదించిరి. ఉద్యోగమును చేయుచునే ఈయన కాకినాడనుండియే

'రాజయోగి' అను మాసపత్రికను ప్రకటింపసాగిరి. ఈయన తాము రచించిన 'కవిజీవితము'ల నా పత్రికయందే ప్రకటింప నారంభించిరి.

ఆ సమయముననే విజయనగర సంస్థానమును శ్రీ ఆనందగజపతి ప్రభువు పాలించుచుండెను. ఆయన తెలుఁగుదేశములోని విద్వద్రత్నములను సంపాదించి తమ యాస్థానమునఁ గూర్చుచుండిరి. శ్రీరామమూర్తిగా రా ప్రభువు దృష్టి నార్షించిరి. తమ యాస్థానమున నుండవలె నని ఆనందగజపతి ప్రభువు కోరఁగా శ్రీరామమూర్తిగారు తమ యుద్యోగమును విడిచిపెట్టి విజయనగరమునకు వచ్చి, ఆనందగజపతి ప్రభుని యాదరాభిమానములకుఁ బాత్రులైరి. ప్రభువుల ప్రోత్సాహముననే శ్రీరామమూర్తిగారు 'విజయనగరం హిస్టారికల్ సీరీజ్' అను గ్రంథమాలను ప్రారంభించి తన్మూలమున గ్రంథ ప్రకటనమునకుఁ బూనుకొనిరి. అందు మొదటి గ్రంథముగాఁ దాము వ్రాసిన 'కవి జీవితము'లను ప్రకటించిరి.

'కవిజీవితములు' తొలుత 'రాజయోగి' పత్రికలోఁ బ్రకటింపఁబడెను. ద్వితీయ ముద్రణము 1893–వ సంవత్సరమున చెన్నపట్టణమునందలి 'ఎంప్రెస్ ఆఫ్ ఇండియా' ముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది. గ్రంథమంతయు నొక్క సంపుటముగాఁ గాక నాలుగయిదు చిన్న సంపుటములుగాఁ బ్రకటింపఁబడినట్లు తెలియుచున్నది. ఆ సంపుటములలో 'పురాణకవుల జీవితములు' మాత్రము ప్రకటింపఁ

బడినవి. అప్పటి పద్ధతి యిప్పుడున్న 'కవిజీవితము'లలో ఉన్నట్లు కానరాదు. అప్పటిది అయిదు భాగములుగను, పదునైదధ్యాయములుగను వెలువడినది. ఈ గ్రంథము ఆనందగజపతి ప్రభువునకే అంకిత మీయఁబడినది. అంకిత పత్ర మిట్లున్నది-

"Dedicated to
H. H. Sri Rajadhiraja Maharaja
Sri Pusapati Mirza Ananda Gajapatiraj
Padshah Kalinga, Manya Sultan
The Maharaja of Vizianagaram."

కవిజీవితములను కూర్చిన యీ కవి 'చిత్ర రత్నాకరము, కళాపూర్ణోదయ కథా సంగ్రహము' అను వచన గ్రంథములను కూడ వ్రాసి ప్రకటించెను. శ్రీ పూసపాటి-తమ్మిరాజుగారు రచించిన 'శ్రీకృష్ణవిజయము' ను విశేషాంశములతోడి పీఠికతోఁ బ్రకటించెను. 'అప్పయ్య దీక్షిత చారిత్రము, తిమ్మరుసు చారిత్రము' మున్నగు చరిత్ర గ్రంథములను రచించెను. తెలుఁగుభాషలో చరిత్ర గ్రంథ రచన కీయనయే మార్గదర్శకుఁ డయ్యెను. సర్వవిధముల ఆనందగజపతి ప్రభువు లిచ్చిన ప్రోత్సాహమే యిట్టి భాషా సేవ చేయ నీయన కవకాశము కలిగించెను.

## కౌటిలీయార్థ శాస్త్రము

చాణక్యుఁడను నామాంతరము గల కౌటిల్యుఁడు రచించిన అర్థశాస్త్రము సంస్కృత వాఙ్మయమునందు

ప్రసిద్ధమై యున్నది. మిగిలిన శాస్త్రములకు తెలుఁగున అనువాదములు వెలువడినవి. కాని, ఈ శతాబ్దిలో రెండు దశాబ్దులు గడచువఱకును అర్థశాస్త్రమునకు మాత్రము అనువాదము వెలువడలేదు. ఈ లోపమును తీర్చుటకయి సుప్రసిద్ధ చరిత్రకారులు, అర్థశాస్త్రవేత్తలు నగు ఆచార్య శ్రీ మామిడిపూడి - వేంకటరంగయ్యగారును, శ్రీ ఆకుండి-వేంకటశాస్త్రిగారును కలిసి యథామూలముగ వచనమున దీని నాంధ్రీకరించి ప్రకటించి యున్నారు. శ్రీ వేంకట రంగయ్యగారు విజయనగరమున మహారాజావారి కళాశాలలో చరిత్రోపన్యాసకులుగా ఉన్నప్పుడు దీని రచన సాగినది. సంస్కృత మూలము నర్థము చేసికొనుటలో ఆయనకు శ్రీ వేంకటశాస్త్రిగారు మిక్కిలి తోడుపడిరి. ఆ యుభయుల పరిశ్రమ ఫలితముగా చక్కని అర్థశాస్త్ర మాంధ్రానీకమునకు లభించినది.

డెమ్మీ సైజున 480 పుటలలో చక్కగా ముద్రింపఁబడిన యీ గ్రంథము క్యాలికో బైండుతో ఆకర్షణీయముగ వెలువడినది. ఇది అప్పటి విజయనగర ప్రభువగు శ్రీ అలక నారాయణగజపతి మహారాజుగారికిఁ గృతి యీయఁబడినది. ఆ మహాప్రభుని కోరికపైనే ఈ యనువాదము జరిగినది. ఈ విషయములు గ్రంథారంభమునందలి క్రింది కృత్యాదిని బట్టియే స్పష్టమగుచున్నవి.

"శ్రీశ్రీశ్రీ విజయనగర సామ్రాజ్యాధిపత్య విరాజితు లును, వాసిష్ఠ గోత్రకుల రత్నాకర పూర్ణిమా సుధాకరు

లును నగు శ్రీ పూసపాడలక నారాయణ గజపతి మహా రాజాధిరాజులవారి యాజ్ఞానుసారంబుగాఁ గాటిల్యార్థ శాస్త్రంబు శ్రీవారి కంకితంబుగా సమర్పింపఁబూని...

క. క్షీరవిహారునకున్ బహు
పారయశఃకాంతి విజిత శరదభ్రసుధా
ధారాహారునకు, అలక
నారాయణ గజపతీంద్ర నరనాథునకున్."

## గాయక సిద్ధాంజనము

గత శతాబ్దిలో సంగీత శాస్త్రమును గురుముఖమున నేర్చుకొనవలసినదే గాని, పిదప అభ్యసించిన పాఠములను క్రమపద్ధతిలో మననము చేసికొనుటకు మార్గదర్శకములగు గ్రంథములు తెలుఁగుభాషలో ఉన్నట్లు కానరాదు. ఆ లోపమును తీర్చుటకు విజయనగర ప్రభువులగు శ్రీ ఆనంద గజపతి మహారాజుగారు, తక్కిన శాస్త్రములందువలె సంగీతమునందును గ్రంథ రచనకుఁ బ్రోత్సహించి, విద్వాంసులు రచించిన గ్రంథములను ముద్రించుచుండిరి. అట్టి గ్రంథములలో ఈ 'గాయకసిద్ధాంజన' మొకటి. దీనిని చెన్నపురి నివాసులును, ప్రభువుల యాశ్రితులును నగు శ్రీ తచ్చూరు-సింగరాచార్యులుగారును, ఆయన సోదరులు శ్రీ చిన్నసింగరాచార్యులుగారును రచించి శ్రీ మహారాణీ గారికే కృతి యిచ్చిరి. ఇందు శ్రీవారి పేరు లేదు. కాని, ఆమె శ్రీ ఆనందగజపతి ప్రభుని జనయిత్రి యగు శ్రీ అలక రాజేశ్వరీదేవి అయి యుండును. దీని ముఖపత్ర మిట్లున్నది-

# గాయక సిద్ధాంజనము

(మొదటిభాగము)

# Gayaka Siddhanjanam

(The fifth book in the art of Music)

First Part

ఈ గ్రంథము సంగీత విద్యార్థుల యుపయోగార్థము
తచ్చూరు - సింగరాచార్యులచేతను, తచ్చూరు-
చిన్న సింగరాచార్యులచేతను ఏర్పరుపబడినది.

చెన్నపురి
కళారత్నాకర ముద్రాక్షరశాలయందు
అచ్చు కూర్పించి ప్రచురింపబడియె.
1890 సం.



దీని అంకితపత్రము క్రింది విధమునఁ గలదు-

To

Her Highness The Maharani Saheb
of Sri Vixianagaram

This iittle volume is most respectfully dedicated
(with permission) by the authors

T. Singaracharyulu and brother

Madras,
Ganollasini Office,
May, 1890.

శ్రీ ర స్తు

శ్రీ విజయనగరము మహారాణీ సాహేబుగారికి
ఈ కృతి మిగుల వినయపూర్వకముగ
అంకితము గావించినారము.

చెన్నపురి,
గానోల్లాసినీశాల,
వికృతి సం. వైశాఖ
మాసము 1890 మేనెల

తదాశ్రిత
విధేయులు
త. సింగరాచార్యులు
త. చిన్నసింగరాచార్యులు

ఈ సోదరులీ గ్రంథమునేగాక, 'స్వరమంజరి' యను మఱియొక సంగీత శాస్త్ర గ్రంథమునుకూడ రచించిరి. అదియును శ్రీ ఆనందగజపతి ప్రభుని యౌదార్యమువలననే ముద్రింపఁబడినది.

## తులసీ రామాయణము

సుప్రసిద్ధ భక్త శిఖామణి యగు తులసీదాసు హిందీ భాషలో రామాయణ కథను 'రామచరితమానస' మను పేర రచించియున్నాఁడు. 'తులసీదాసు రామాయణ' మను పేరితో అది జగత్ప్రసిద్ధమై యున్నది. దీనిని భారతీయులే కాక విదేశీయులును మిక్కిలి ప్రశంసించుచుందురు. ఇట్టి గ్రంథమును తెలుఁగుభాషలోనికి మార్చుట ఎంతయు నావశ్యకమని తలంచి సమర్థులగు విద్వాంసులచే ఆనందగజపతి మహారాజుగా రాంధ్రీకరింపఁజేసిరి. ఆంధ్రీకర్తలలో ఒకరు శ్రీ మండ-కామేశ్వరశాస్త్రిగారు. ఈయన అరణ్యకాండమును తెలిఁగించినట్లు తెలియుచున్నది. కిష్కింధా

కాండను మండ - నరహరి యను కవి యాంధ్రీకరించెను. ఇతఁడు రాజాస్థానములోని ఆస్థాన విద్వాంసుఁడగునో, కాఁడో తెలియదు. కాని, శ్రీ కామేశ్వరకవిగారి సమీప బంధువర్గములోనివాఁడై యుండును. అయోధ్యాకాండ మును శ్రీ శిష్టు - కృష్ణమూర్తిశాస్త్రిగారు రచించినట్లు తెలియుచున్నది. ఈయన అనందగజపతి ప్రభుని ఆస్థాన విద్వాంసులు కారు. కాని, ఆ కాలములో సుప్రసిద్ధులైన విద్వాంసులు; సంస్కృతాంధ్రములలో విద్వత్కవులు; లక్షణ వేత్తలు; సంగీతమున అసమాన ప్రతిభ కలవారు. శ్రీ ఆనంద గజపతిప్రభువు రామాయణాంధ్రీకరణమున ఈయన తోడ్పాటును కూడ అభిలషించి యుండవచ్చును. తక్కిన కాండముల నెవ్వరు తెలిఁగించిరో నిర్ణయించి చెప్పలేము.

ఈ రామాయణమునందలి కాండములచివఱ అను వాదకర్తల పేర్లు - ఒక్క మండ-నరహరి కవిది తప్ప-లేవు. కాని, యీ ప్రతిని వ్రాసిన శ్రీ ముక్కామల - రుక్మేశ్వర శాస్త్రిగారు మాత్ర మా యా కాండముల చివఱ, అవి యెవరి యనువాదములో తెలుపుచుండిరి.

హిందీలోని రామాయణము దోహా - చౌపాయీ - సొరఠా మున్నగు ఛందోరీతులలో జరిగియున్నందున - ఆంధ్రీకరణమునందును ఆ పద్ధతియే అనుసరింపఁబడినది.

గ్రంథారంభము - బాలకాండము :—

శ్రీ గణేశాయనమః. గురుభ్యో నమః.

శ్లో. వర్ణానా మర్థ సంఘానాం రసానాం ఛందసామపి,
మంగళానాం చ కర్తారౌ వన్దే వాణీ వినాయకౌ.

(తెలుఁగు) ఆ. వర్ణములకు నర్థవారములకు రస
మలకు నన్నిఛందములకు మంగ
ళౌఘములకుఁ గర్తలైన వాణీగణే
శ్వరులకే నొనర్తు వందనములు.

శ్లో. భవానీ శంకరౌ వందే శ్రద్ధా విశ్వాసరూపిణౌ,
యాభ్యాం వినా న పశ్యన్తి సిద్ధాః స్వాన్తఃస్థ మీశ్వరమ్.

(తెలుఁగు) క. కరమా శ్రద్ధా విశ్వా
సరూపులను గొలుతు శైలజా శివులను యు
ద్వ్యరహామున సిద్ధులును స్వాం
తరస్థు నీశ్వరుని జూడ శక్తులు కారో.

ఉ. ఆయతమై పురాణ నిగమాగమ సమ్మతమైనయట్టి రా
మాయణమందు నన్యములయందుఁ బుదితంబగుదాని నాత్మసౌ
ఖ్యాయతిఁ గోరి రామచరితాఖ్యప్రబంధము నైజభాషచే
శ్రీయుతిగా నొనర్చెఁ దులసీవరదాస సమాహ్వయుం డిలన్

సోరఠా. కరిముఖుఁడగు నే దేవు
స్మరణ కార్యము లిచ్చుండు,
ఎవనికృపను మూకుండు
భువి వాచాలుండై యలరు,
జవము గల్గి పంగుండు
నవనీధ్రము లెక్కుఁదనరు

..............................

సీతారామవివాహ క్షేమయశము వినువారలకు
న్నాతతసంపద లిచ్చు నరఘురామయశము జనులకు.

ఇది శ్రీ సకలకలుష విధ్వంసకరంబగు రామచరితమానస సరో వరంబున బాలకాండంబను ప్రథమసోపానము సంపూర్ణము.

## అయోధ్యాకాండము :—

దోహా. శ్రీగురుపదజలజరజమునం, జేతోఽజ్ఞబహుదిఁజేసి,
శాగా రఘుపతియశమెంతున్, ఫలచతుష్కకృతి భాసిల.

చౌపాయీ. కాంతతోడ రఘురాముఁడరుదేరన్
సంతతంబు శుభసంతతి మీరన్
ప్వాంతజానంగనగతి సుకృతిఘనం
బెంతయు పదజలమెలయింపన్.

..........................

సోరఠా. భరతచరిత మెవరైనా – నిరతి వినినవారికి రామా
పరమానుభవమగునూగా – భవులకైన వైరాగ్యము.

ఇది శ్రీ తులసీదాసకృత రామాయణే ఆంధ్రకవితాయా మయోధ్యాకాండ స్సమాప్తః. ముక్త్యామల – రుక్మిణీశ్వరశాస్త్రి వ్రాసినది. ఆయ మయోధ్యాకాండః శిష్టకృష్ణమూర్తినా కృతః.

## అరణ్యకాండము :—

దోహా. గిరిజా రామగుణాళి... పరతత్వము నిరతముగను
మారిప కీహిమడుం దా, నరయు మెంరకు ధర్మమెరుగు.

..........................

దోహా. దీపశిఖవంటిదవగా – నోపు శలభమగు చిత్త
మ్మాపగిదిని గని రామ భజింపు మగతు లిగురొత్త.

ఇది శ్రీ సకలకలుష విధ్వంసకరంబగు రామచరిత మానససరో వరంబున నారణ్యకాండంబను తృతీయసోపానము, మండ - కామేశ్వర శాస్త్రి చెప్పిన కవిత్వ మిది, ముక్కామల - రుక్మేశ్వరశాస్త్రి వ్రాసినది.

కిష్కింధాకాండము :—

చౌపాయి. శ్రీమత్సత్కాశీ నగరీశా !
శ్యామాభవిశాలాక్షీశా !
సామాదిసుగుణ సహితగిరీశా !
ప్రేమన్ వినుమిది శ్రీ విశ్వేశా !

..................................

దోహా. ధర తులసీదాసకృతేంద్రు - స్థానిరామకథ ప్రీతి
పరగ మండ-నరహరి తెల్గు-భాష రచియించెను రీతి.

ఇది శ్రీ సకలకలుష విధ్వంసకరంబగు రామచరిత మానససరో వరంబున కిష్కింధాకాండంబను చతుర్థసోపానము.

సుందరకాండము :—

శ్రీమద్రవికులసింధు శశాంకా !
కామితదాయక గతమదశంకా !
నామది నిల్వు మనఘగుణధామా !
వేమరు విను వేడెద శ్రీరామా !

..................................

ఘనుడైన తులసీదాసు డిట్టులు గానమున్ గావింపగా
తనరార గనుగొని మండ-కామయ తగ తెనుం గొనరించెను.

ఇది శ్రీ సకలకలుష విధ్వంసకరంబగు రామచరిత మానససరో వరంబున సుందరకాండంబను పంచమసోపానము. సౌమ్యసంవత్సర భాద్రపద శుద్ధ 3 రోజున ముక్కాల - వుక్కేశ్వరశాస్త్రి వ్రాసినది.

## యుద్ధకాండము :—

దోహా. అవని మేమయాగాని ప్రమాణమొకని ప్రమాణమెవ్వని శరంబు
యచ్ఛ్రేష్ఠమైన మహాకాలంబు యతని గనుము చిత్తంబు,

..............................

## ఉత్తరకాండము :—

దోహా. శ్రీరాముఅవనవాస మవ_శిష్టమొకదినంబు గాంచ
రాకేమొకో యనుకొని కృశు_లగుచు వారు విలపింప.

..............................

నరులలోన పామరులు మనో_హరరామకథను విన్న
పరితోషింతురు కర్ణములన్_బరగిన పూరుషులెన్నన్.
శ్రీకంఠుడు దయచే హరియశమున్
ప్రాకటముగ వినసాగెను ముదమున్
కాకభుశుండియు గరుడున కొప్పగ
నీకథ చెప్పెను ఆ కథ గొప్పగ
ఘనముగు మోదయుకల్మిని వింటిన్
తనవారగ కంతసముసు గంటిన్
వినవలయు నెన్ని విధములైనన్
గన రామచరిత్రము తమి బూనన్.

శ్రీ మహాగణాధిపతయే నమః.

ఇందు కాండారంభములందు వేర్వేరు విధముల సంబోధనలు కానవచ్చుచున్నవి. కవులు విభిన్నులగుట దానికి కారణమయి ఉండవచ్చును. అచ్చటచ్చట వ్యావహారిక పదములును కానవచ్చును. భాషాంతరములలోని ప్రసిద్ధ గ్రంథముల నాంధ్రీకరింపఁజేయుటకు శ్రీ విజయనగర ప్రభువు లొనర్చిన ప్రయత్నము శ్లాఘ్యము. అందు తులసీ రామాయణమునకుఁ జేయించిన యీ తెలిఁగింపు ప్రశంసాపాత్రము.

ఇందు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు తెలిఁగించిన భాగము చివరిగద్య మిగిలిన గద్యలకంటె విభిన్నమై యుండుట గమనార్హము.

## త్రిలింగ లక్షణ శేషము

ప్రౌఢవ్యాకరణ మను నామాంతరమునఁ బ్రసిద్ధి కెక్కిన యీ గ్రంథము శ్రీ బహుజనపల్లి - సీతారామాచార్యులుగారిచే రచింపఁబడినది. శ్రీ పరవస్తు - చిన్నయ సూరి రచించిన 'బాలవ్యాకరణము'న కియ్యది శేష గ్రంథము. ఆంధ్ర వ్యాకరణమునఁ బాండిత్యమును సంపాదింపఁగోరువారికి బాలవ్యాకరణముతోఁ బాటిదియు నవశ్య పఠనీయము. ఇందును బాలవ్యాకరణమునందువలెనే పరిచ్ఛేద విభాగము కలదు. బాల వ్యాకరణమునందలి తత్సమ పరిచ్ఛేదము, ఆచ్ఛిక పరిచ్ఛేదమును కలిసి శబ్ద పరిచ్ఛేదముగాఁ జూపఁబడుట యిందలి విశేషము.

శ్రీసీతారామాచార్యులుగారీ గ్రంథమునేగాక 'ఆంధ్ర శబ్ద రత్నాకర'మను పెద్ద తెలుఁగు నిఘంటువును, వైకృత దీపిక, పదార్థనామకోశము, బాలచంద్రోదయము, ఆలఘుకౌముది, నీతిమాల, సతీధర్మ సంగ్రహము, ప్రపన్న పారిజాతము మున్నగు గ్రంథములను రచించిరి. అవి యన్నియును ముద్రితములే! కాని, వానిలోఁ జాలవఱకు నిప్పుడు లభ్యములుకావు. శబ్దరత్నాకర, త్రిలింగ లక్షణ శేషములు రెండును శ్రీసీతారామాచార్యులుగారి కీర్తిపతాకలై వెలయుచున్నవి.

త్రిలింగలక్షణశేషము విజయనగర ప్రభువులగు శ్రీ ఆనందగజపతి మహారాజుగారి కంకితము. ప్రథమ ముద్రణమునందలి అంకితపత్ర మాంగ్లభాషలో నిట్లున్నది-

"To
His Highness The Honourable Maharajah
Mirja Sri Vijaya Ananda Gajapathi
Maharajah Mannya Sultan Bahadur of
Vizianagaram, K. C. I. E.
This book is respectfully dedicated
By kind permission
By the author."

ఈ గ్రంథము మొదటి ముద్రణ 1885–వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో జరిగినది. ఇయ్యది చెన్నపురిలోని విద్యా వివేక కళానిధి ముద్రాక్షరశాలయందు ఎనమదల–అనంతా

చార్యులచే ముద్రింపఁబడినది. తర్వాత వెలువడిన కొన్ని ముద్రణములలో అంకితపత్రము లోపించినది. 1947 నుండియు శ్రీవావిళ్ల సంస్థవారు ప్రకటించు కూర్పులలో నీ లోపము సవరింపఁబడినది.

నవరసతరంగిణి (Beauties of Shakespeare and Kalidasa)

సుప్రసిద్ధ విద్వత్కవియు, లయబ్రహ్మయు, హరికథా పితామహుఁడును అగు శ్రీ ఆజ్జాడాదిభట్ల-నారాయణదాస పండితుఁడు దీనికిఁ గర్త. సంస్కృతాంధ్రాంగ్లాది వివిధ భాషా వేత్త యగు ఆ మహనీయుఁడు షేక్స్పియరు, కాళిదాస మహాకవుల సూక్తి రత్నములను పెక్కింటి నేర్చి కూర్చి, ఆ యా రసముల కనుగుణముగా తొమ్మిది భాగములుగా విభజించి, చక్కని యాంధ్రానువాదములతోను, వివరణ ములతోను, కఠినపదముల కర్థములతోను కూర్చి ప్రక టించెను. దీనిని 1922-వ సంవత్సరమున అప్పటి విజయ నగర ప్రభువులు శ్రీ అలకనారాయణ గజపతి రాజుగారు తమ కోటలో ఉన్న శ్రీ విజయరామవిలాస ముద్రాక్షర శాలలోనే ముద్రింపించి రచయితను సత్కరించిరి. ఇది ఫూల్స్కేప్ సైజున 813 పుటల యుద్గ్రంథము. శ్రీ అలక నారాయణగజపతిప్రభువునకే యిది అంకిత మీయఁ బడినది. అంకితపత్ర మాంగ్లభాషలో నిట్లున్నది-

Dedicated by
Generous permission to Sri Sri Sri Raja
Mirza Sri Pusapati Alaka Narayana Gajapatirarj
Maharaja Manya Sultan Bahadur
Maharaja of Vizianagaram
by
His Highness's Most loyal servant
A. Narayanadas
Principal, Sri Vijayarama Gana Pathasala,
Vizianagaram

ఆంధ్రమునను క్రింది కృతిభర్తృ ప్రశంసాపద్యములు
కలవు-

సీ. సాత్త్వికతపము యుష్మత్ప్రపితామహుం
డలన నీకలదుఁ బావనచరిత్ర!
శౌర్యపరాక్రమ చాతుర్యముల్ నీకుఁ
దాతస్వభావమో ధర్మమూర్తి!
బహుజనపోషణ పరత నీతండ్రిదై
జను నీకు వచ్చెనో సదయహృదయ!
సకలజనప్రియ చాటు ధోరణి నీకు
సహజసిద్ధమ్ము రాజకులదీప!

గీ. పూర్వభాగ్యములనుఁ దొల్లి పొడమినటుల
నీకలరె సద్గుణంబులప్రోవు, ధీర!
తగును నీసేవ నీకు; మాధవుని కృపను
విజయమందుము నారాయణ గజపతీంద్ర!

గీ. శ్రీ విజయరామ గజపతి జ్యేష్ఠపుత్ర !
వీర ! లలితాకుమారీకుమార ! శూర !
ధీర ! సుకుమార ! విద్యావతీకళత్ర !
రాజకులముఖ్య ! అలకనారాయణాఖ్య !

గీ. కాళిదాస షేక్స్పియరుల కవితలపయి
ప్రేమపడెదవుగాన, నర్పించినాఁడ;
ఈకృతిన్ దయతోడ నంగీకరించు
మలకనారాయణగజేంద్ర ! అధిపచంద్ర !

శ్లో. తవ దాసాత్మసంభూతాప్యనవ్యసులభాకృతిః,
నారాయణగజపతే ! పాహ్యాంధ్రకృతికన్యకామ్.

మూలానువాదములు మచ్చునకు : మూలము :—

Past and to come, seems best.
Things present worst.

అనువాదము :—

కడచిన వస్తువుల్ కాఁబోవునవియుఁ
గడుమంచి; యిప్పుడు గలయవి చెడ్డ.

మూలము :—

శ్లో. సుభగసలిలావగాహాః
పాటలసంసర్గ సురభివనవాతాః,
ప్రచ్ఛాయసులభనిద్రా
దివసాః పరిణామ రమణీయాః.

అనువాదము :—

క. చల్లని నీరాటములన్
మెల్లఁగఁ బాదిరులతావి మెలఁగెడు గాలుల్

మెల్లపు నీడలపడకలు
నెల్లెడ ముగిసినకొలంది నింపగు పవళుల్."

## నీలగిరి పాటలు

దక్షిణదేశములోని నీలగిరులపైఁ గల ఉదకమండలములోని దృశ్యములను వర్ణించు గేయములే నీలగిరి పాటలు! వీని రచయిత శ్రీ గురజాడ-అప్పారావుగారు. ఒకప్పుడు ప్రభువుల కుటుంబముతోఁ గూడ వేసవిలో ఉదకమండలమునకు వెళ్లినపుడు, అక్కడి దృశ్యములం గాంచఁగా కలిగిన మనోభావములను ఆయన 'నీలగిరి పాట'ల రూపమున వెల్లడించినారు. ఈ పాటలను విని మెచ్చుకొని శ్రీ అప్పలకొండయాంబా మహారాణి చక్కని నునుపు కాగితముపై వీనిని అందముగా ముద్రింపించెను. ఇది శ్రీమదానందగజపతి మహారాజులుంగారికే అంకితము. అంకితపత్ర మాంగ్లభాషలో "To the loved memory of Prince Charming" అని యున్నది. ఆనందగజపతి ప్రభుని చక్కఁదనమును చూచి ఆంగ్లేయులు ఆ ప్రభువును "Prince Charming" అనెడివారఁట! దీని ముఖపత్ర మిట్లున్నది—

"నీలగిరిపాటలు
శ్రీ శ్రీ శ్రీ హెర్ హైనెస్ శ్రీ మహారాజకుమారికా సాహెబా
శ్రీ అప్పలకొండయాంబ ఆఫ్ విజయనగరం
మహారాణి ఆఫ్ మఝోగడ్ (రీవాస్టేట్) వారి యనుజ్ఞను
గురజాడ – అప్పారావుచే రచింపఁబడినది.

చెన్నపట్టణము
జి. రామసామి శెట్టిగారి ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియెను.
1907"

ఈ చిన్న పుస్తకములో ఆరు పాటలు కలవు. అన్నింటికిని శ్రీ అప్పారావుగారు స్వయముగా చేసిన యాంగ్లానువాదములును కలవు. తొలి కూర్పులో పాటలన్నింటికిని స్వరకల్పనకూడ చేయఁబడి యున్నది. ఈ నడుమ విజయవాడయందలి విశాలాంధ్ర ప్రచురణాలయము వారు ప్రకటించిన పుస్తకములో ఈ స్వరకల్పన మాత్రము విడువఁబడినది. అట్లు చేయుటకుఁ గారణాము మృగ్యము. ఈ పాటలు రెండు మచ్చున కీయఁబడుచున్నవి—

రాగము సురట – తాళము ఆది.

పల్లవి. సుందరతర మీ నీలనగము; దీని
యందము హృదయానందకరము; దీని
చందము హృదయానందకరము.

అనుపల్లవి. నందనవనమిదె నాతిరో! వింటివె!
బృందారకమునిబృందసేవితము.

చరణములు. ఎచ్చటఁ జూచినఁ బచ్చికపట్టులు
పొదపొద రొదనిడు – పొలుపగు పిట్టలు
వింతవాసనలఁ – వీచెడి చెట్టులఁ
కుదురుగ రథ్యగల – కొలఁకులగట్టులు.
నిచ్చలు నగముల – నీటగు తోఁటల
విచ్చలవిడి చను – నచ్చపు వెంగిలిల

నచ్చరగేరెడు - మచ్చెకంటులిట
మించుతీవలన - మించి చరింతురు.

పాదఘట్టనకుఁ బర్వు చక్రములు
మంత్రమహిమనగు జంత్రపురథములు
పందెమువారెడు - పటుజవనాశ్వము
లందముగానిటు - గ్రందయి దోఁచును.

గట్టుల లోయల - గాజుచప్పరల
మట్టిగోలెముల - మడువుల నడవుల
నెల్లెడ విరియుఁగ - వెల్లువలై విరు
లిట్లుధన్యదౌన - లక్ష్యయమయ్యెను.

తప్పక భృత్యుల - నెప్పుడుఁ బ్రోచెడి
యప్పలకొండయ - మాంబాదేవిని
గొప్పఁగఁ బ్రోచుత - నప్పురదమనుఁడు
మెప్పుగ వరముల - విప్పుగఁ గురియుచు.

ఇయ్యదియే తొలి పాట. ఇందుఁ గవి తన పోషకురాలగు మహారాణి అప్పలకొండయాంబాదేవిని స్తుతించుట గమనింపఁదగినది.

పాట—చిత్తరువనిచూడ :

రాగము శంకరాభరణము — తాళము మిశ్రజాతి చాపు.

పల్లవి. చిత్తరువనిచూడఁ - జిత్తముగొంటివి
చిత్తము నపరంజి - చిలుక యెవ్వతెవే?

అనుపల్లవి. మత్తుతో సామ్రోల - వలరాజు వేఁడిన
మత్తకాశిని నీవు - మనసైన నీగదె.

చరణములు. ఇచ్చి పుచ్చుకొంట - యిలలోని మర్యాద
మచ్చిరిమానము - మెచ్చుదురటవే !
వచ్చి చూచినంత - వంచనచేయుదె ?
పచ్చిదొంగతనము - పడఁతిరో పదవె ?
మనసులేని తనువు - మరి యేలనే సాక ?
చెనఁటి దీనిఁగూడ .. చేకొనఁదగవె ?
వానికి బహులొక్క - వాక్కునే వేఁడెద
మానిని ! యీపాటి - మన్నింపఁజెల్లనె ?
విలువ చాలదన్న - విరివిల్తుపై నాన
కలుగు జన్మమ్ములఁ - గానుక కొనవె ?
ఎలమి నానందేంద్రు - నేలిన వెన్నుఁడు
పలుతెఱంగుల మేలు - పడఁతి నీకిచ్చునే !

ఈ పాటలోఁ గృతిభర్తయైన ఆనందగజపతిప్రభువు నామము కూర్పఁబడుట గమనింపఁదగినది.

## పద్మనాభ యుద్ధము

ఇయ్యది చట్రాతి - లక్ష్మీనరసకవి ప్రణీతమని ప్రసిద్ధము. ఉపలబ్ధమగు ప్రతిలో కృత్యాదికము గాని, ఆశ్వాసాంతగద్యము కాని కానరాలేదు. కావున, గ్రంథ కర్తృత్వ విషయమున నిదమిత్థమ్మని నిర్ణయించుట యసాధ్యమే! అయినను సుప్రసిద్ధ విద్వత్కవులు, ప్రాచ్య లిఖిత గ్రంథ సంగ్రాహకులు, వాఙ్మయ విమర్శకులు నగు కీర్తి శేషులు శ్రీ నిడుదవోలు-సుందరము పంతులుగారు (విద్యారత్న శ్రీ నిడుదవోలు-వేంకటరావు (ఎం: ఏ.) గారి పితృపాదులు) 'చట్రాతి లక్ష్మీనరసకవి 'విజయరామ చరిత్ర'

మని చెప్పఁబడు నీ గ్రంథమును, భండనారాతి భీమ శతక మును రచించెను' అని తమతోఁ జెప్పినట్లు వితగ్రంథ సంపాదకులు శ్రీ బుఱ్ఱా-శేషగిరిరావు పంతులు (ఎం. ఏ.) గారు ముద్రితప్రతి యవతారికలోఁ దెల్పి యున్నారు. చట్రాతివారి వంశస్థులలోఁ గొందఱు మాత్ర మియ్యది లక్ష్మీనరసకవి పుత్రుఁడగు కనకయ్యచే రచింపఁబడినట్లు చెప్పెదరు. కాని, యట్లనుటకుఁ దగిన యాధారము మృగ్యము. తగిన ప్రమాణములు లభించువఱకును దీనిని లక్ష్మీనరసకవియే రచించెనని చెప్పవలసి యున్నది.

ఈ ప్రబంధమునందలి యొక్క యాశ్వాసము మాత్రమే యింతవఱకును లభించినది. దీనిని సమగ్రముగఁ బరిశీలించినయెడల, గ్రంథ మసమగ్రమని తెలియక మానదు. విజయనగరమునందలి ఆంధ్ర భారతీ తీర్థ పరి శోధక విశ్వవిద్యాలయము (Andhra Research University) వారికిని ఈ మాత్రపు గ్రంథమే లభించినదఁట ! 'ఆంధ్రకవిజీవితము'లను రచించిన సుప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ గురుజాడ - శ్రీరామమూర్తి పంతులుగారు కడచిన శతాబ్ది చివఱ తాము కాకినాడనుండి ప్రకటించుచుండిన 'రాజయోగి' పత్రికలో ఇందలి కొంత భాగమును ప్రకటించి నట్లును, గ్రంథనామము 'విజయరామ యశోభూషణ'మై యుండినట్లును తెలియుచున్నది.

సమగ్రముగా నుండిన యీ గ్రంథమున విజయరామ గజపతి ప్రభుని చరిత్రము సంపూర్ణముగా నుండి యుండును.

అప్పుడు దీని పేరు 'విజయరామచరిత్ర' యని కాని, 'విజయ రామ యశోభూషణ' మని కాని యుండుట యుచితమే! ఉపలబ్ధ గ్రంథ భాగమున గ్రంథనామము లేకుండుట వలనను, పద్మనాభమున విజయరామగజపతి ప్రభువునకును, ఆంగ్లేయులకును జరిగిన యుద్ధమువృత్తాంతమున్న భాగమే లభించుటవలనను, ఆ కథాంశమునుబట్టియే యిది 'పద్మనాభ యుద్ధ'మను నామమునఁ బ్రకటింపఁబడినట్లు తెలియుచున్నది. గ్రంథ సంపాదకులు, శ్రీ సుందరము పంతులుగారు తెలిపిన 'విజయరామచరిత్ర' మను నామమునఁగాని, శ్రీ గురుజాడ-శ్రీరామమూర్తిగారు ప్రకటించినట్లు 'విజయ రామ యశోభూషణ'మను నామమునఁగాని దీనిని ప్రకటించిన మేలయియుండెడిది. 'పద్మనాభ యుద్ధ'మని పేరు మార్చుట యనావశ్యకమని తోఁచుచున్నది.*

లభించిన యొక్క యాశ్వాసమున విజయనగర ప్రభువులగు శ్రీవిజయరామగజపతి మహారాజుగారు పద్మనాభమున విడియుట, కుంఫిణీవారి రాయబారము, కుతంత్రములు, యుద్ధసన్నాహము, రాత్రి సమయమునందు ముట్టడి,

* పద్మనాభయుద్ధము, క్రౌను సైజు 80 పుటలు. దీనికి శ్రీ బుట్టా-శేషగిరిరావుగారు రచించిన 20 పుటల యుపోద్ఘాతము కలదు. 1934లో ప్రకటించిన నాల్గవ ముద్రణపు ప్రతియే లభించినది. వెల రు 0-12-0. ప్రకాశకులు శ్రీ వత్సవాయి-రాయజగపతివర్మగారు, హావేలీ, పెద్దాపురము, తూర్పుగోదావరిజిల్లా.

యుద్ధము, విజయరామగజపతిప్రభుని నిర్యాణము వర్ణింపఁ బడి యున్నవి. వీరరస ప్రధానమగు నీ ప్రబంధమున రచన రసానుగుణముగ కొనసాగినది. ధార యనర్గళము. రచయిత రణరంగమున వీర వ్యాపారమును స్వయముగఁ జూచిన వానివలెఁ గన్నులకుఁ గట్టినట్లు వర్ణించి యున్నాఁడు.

మనకు లభింపని గ్రంథభాగములో యుద్ధకారణము, విజయరామ ప్రభువుల చరిత్ర కొంతవఱకు వివరింపఁబడి యుండును. అయ్యాది విజయనగర ప్రభువుల చరిత్రను వివరించు సందర్భమునఁ గొంత చెప్పఁబడి యున్నది.

క్రీస్తుశకము పదునెనిమిదవ శతాబ్ది మొదటి పాదమున విజయనగర సంస్థానమును పాలించుచుండిన శ్రీ (పెద) విజయరామగజపతి మహారాజునకు పరాసు సేనాధిపతి బుస్సీదొర మిత్రుఁడు. అతని కీ ప్రభువుపయి అపారమగు గౌరవము! బుస్సీదొర సహాయముననే విజయనగర ప్రభువు బొబ్బిలిపైకి దాడివెడలి రావు - రంగారాయప్రభృతులను సంహరించెను. కాని, యచ్చటనే యొక రాత్రి శత్రువులచేఁ జంపఁబడెను. ఆ విజయరామప్రభువునకు సంతానము లేదు. కావున, ఆయన భ్రాతృపుత్రుఁడగు ఆనందరాజు రాజయ్యెను. అతఁడు మహాశూరుఁడు, గొప్ప బలవంతుఁడు. బుస్సీదొర యిదివఱకు విజయరామగజపతి ప్రభువుపైఁ జూపుచుండిన గౌరవ మిప్పుడు పూర్తిగ క్షీణించినది. అందువలన ఆనందరాజు బుస్సీపైని, ఫ్రెంచివారిపైని పగ సాధించుటకు నిశ్చయించి, వారిని దేశము

నుండి తఱుమఁగొట్టి, ఆంగ్లేయుల మైత్రిని, ఆదరాభిమాన ములను చూఱఁగొనెను. కాని, అత్యల్పకాలములోనే ఆయన మరణించెను. పిదప పెద విజయరామగజపతి భార్య దగ్గఱి బంధువుల పుత్రుని దత్తత చేసికొనెను. ఆయనయే చినవిజయరామగజపతి మహారాజు. ఆయన బాలుఁడై యున్నందున, అతని సోదరుఁడు సీతారామరాజు సర్వాధి కారములను వహించెను. అతని యేలుబడిలో ప్రజలకుఁగాని ప్రభువునకుఁగాని సుఖము లేకుండెను. పయి అధికారులకుఁ గట్టవలసిన పన్ను లక్షలకొలఁది బకాయిపడి యుండెను. సీతారామరాజు చెన్నపురికిఁబోయి, అచటి కుంఫిణీ యధి కారులతో సోదరునిపయి లేనిపోని తప్పులను, లోపములను కల్పించి చెప్పి, వారి కాతనిపై ఆగ్రహమును కలిగించెను. 'కొంతకాలము రాజ్యమును విడిచి మచిలీపట్టణము'న ఉండ వలెనని కుంఫిణీవారు విజయరామగజపతి కాజ్ఞ యిచ్చిరి. ఆయన విధిలేక ప్రయాణమై కొలఁది దూరము పోయి, పద్మనాభమున నిలిచిపోయెను. ముందున కడుగిడ నిచ్చగింప లేదు. అచట ఆంగ్లేయులతో జరిగిన యుద్ధములో ఆ ప్రభువు వీరస్వర్గము నలంకరించెను. ఈ వృత్తాంతమే యీ ప్రబంధ మున కితివృత్తము.

విజయరామగజపతి యనంతరము రాజ్య మాతని కుమారుఁడగు నారాయణగజపతి ప్రభువునకు సంక్ర మించెను. అతని కాలముననే యీ ప్రబంధము రచింపఁ బడి, అతనికే అంకిత మీయఁబడినది. ఆశ్వాసమునందలి

తొలి పద్యమున కృతిపతి ప్రశస్తి కలదు. ఆశ్వాసాంతము శిథిలమై యున్నది. కృతిపతి నామాంకితమగు గ్రంథభాగములు నష్టమైపోయినది.

ఆశ్వాస ప్రారంభము —

క. 'శ్రీ రవికుల కలశాంబుధి
తారాధిప! నవకళింగధరణీశ! మహో
దారయశ! పూసపాటి
నారాయణగజపతీంద్ర! నరనాథేంద్రా!

ఆశ్వాసము చివరిభాగము :—

'వ. తదనంతర......నరేంద్రునకు దేవర్షి పుంగవుం డిట్లనియె.

మ. పరభూనాథ మృగావళీహరణ! శుంభద్భీమశార్దూలబం
ధురశుభ్రా.................................కీ
ల! రమానాథ పదారవింద భజనాలాలిత్య సంశీల! భా
స్కరవంశాబ్ధి నిశానృపాలక! కళింగ శ్రీ నృపాపాలకా!'

ఆశ్వాస కథారంభములోని పద్యము :—

శా. '......ము రాజసింహము సమద్యద్ఘోరశుభ్రానవా
నీకంబున్ వెగడొందఁ దర్పలము లెంతే మోదముం బొంద లో
కైకత్రాణగరిష్ఠుఁడై బహునృపాధ్యక్షుల్ దనుం గొల్వఁగా
శ్రీకంఠాత్మునిఁ బద్మనాభుఁ గన వచ్చెం బద్మనాభం బొగిన్.'

ఆశ్వాస మధ్యభాగములోని పద్యము :—

ఉ. 'అన్నమరాజుపేటఁ జని యచ్చటఁ గాంచిరి వీతసత్య సం
పన్నుని పూసపాటి కులపావనునిం గరుణాంబురాశి నా
పన్నశరణ్యునిం గమలబాంధవకోటి సమానతేజునిం
గ్రన్నన నొప్పు శ్రీ విజయరామనృపాగ్రణి బాలకాగ్రణిన్.'

పద్మనాభ యుద్ధము జరిగిననాఁటికి యువరాజగు నారాయణగజపతి ప్రభువు బాలుఁడు. అయినను సాహసించి తానును శత్రువులపై కురుకుటకు సిద్ధపడెను. కాని, విజయరామగజపతి యతనిని వారించెను. పితృాజ్ఞ నుల్లంఘింపని యువరాజు చేయునది లేక వెనుకకుఁ బోవలసి వచ్చెను. ఈ యంశె మీా క్రింది పద్యమున నెంతో హృద్యముగఁ గూర్పఁబడినది-

సీ. 'పిడుగు సర్కారున చిక్కు భీమావనిపతి
 కడుపైన మనుమఁడ నగు చుండి,
కనకంబు వర్షంబుగాఁ జేయు మాధవ
 వర్మాన్వయమున నేను జనించి,
అల గోలుకొండ తల్పుఁ వేయు నానంద
 గజపతి పేర విఖ్యాతిఁ గాంచి,
నిత్యగంగాస్నాన నిర్మలుండవు భవ
 ద్గర్భవాసమ్మునఁ గలిగియుండి,

గీ. అహహా! శత్రుభాస్య సమరభయంబు నాకు
కలదె? మృగలోకభీతి వ్యాఘ్రంబుపిల్ల
కేల? తమయాజ్ఞ కోడితి; నింతె కాక!
యనుడు తనయునిమాట కయ్యవనివిభుఁడు.'

ఈ గ్రంథములో ఆ యా సందర్భములలో హిందూస్థానీ, ఉరుదు, ఆంగ్ల భాషా పదములు స్వేచ్ఛగా వాడఁబడినవి. 'చలో చలో, ఫౌజు, సైదు, హవాలుదారులు, దుబాసి, కనోడు, బేజారు, జమాదారు, ముస్తాజరులు, తాలూకాల్, వాయిదా, సాలు, చెలాయించు, రసీదు,

గీ. పాదభక్తజనస్వాస్థ్య! బాధ పొడమి
నప్పుడారకయుంట న్యాయంబె నీకు?
నీవు కనిపించుకంటె దిక్కే విధాన?
ఖండనారాతిభీమ! కోదండరామ!

[ఖండనారాతిభీమశతకము]

'విశేషాంధ్రము, ఈశ్వరీ పరిణయము' అను గ్రంథములనుకూడ ఈ కవి రచించినట్లు కొందరు చెప్పుచున్నారు. అవి అలభ్యములు.

పాకశాస్త్రము

నిత్యము గృహములందు వండుకొనుచుండు కూరలు, చారులు, తప్పళములు మున్నగునవి రుచికరముగా పచనము చేయు విధములు, వానిలోని వేర్వేఱు రకములు విపులముగ నీ గ్రంథమున వివరింపఁబడినవి. రచయిత చెన్నపురి-తిరువల్లిక్కేణిలో నివసించుచుండిన శ్రీ కంది-సుబ్బారావుగారు. గవర్నమెంటు ఆఫీసులో ఈయన లైబ్రేరియనుగా పనిచేయుచుండిరి. ఇయ్యది 1890 లో మద్రాసులోని వి. ఎన్. జూబిలీ ముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది.

గత శతాబ్ది చివరివఱకును తెలుఁగుభాషలో జనసామాన్యమున కుపయోగించు గ్రంథములు వెలువడినట్లు కానరాదు. సర్వజనోపయుక్తమగు గ్రంథమును సర్వజనసులభగ్రాహ్యమగు భాషలో వ్రాయు సంకల్పముతోనే రచయిత దీనిని కూర్చెను. సుఖజీవనమునకు బలమే

ప్రధానమనియు, మానవుల కా బలము అన్నాదులను బట్టియే లభించుననియు, అందువలన సర్వ ప్రయత్నముల బలమును కాపాడుకొనుటకే యత్నింపవలెననియుఁ జెప్పుచు, రచయిత పయి యాశయమునకు సమర్థకముగ-

శ్లో. 'అన్నమూలం బలం పుంసాం
బలమూలం హి జీవనమ్,
తస్మాద్యత్నేన సంరక్షేత్
బలం చ కళలో భిషక్.'

అను శ్లోకముఁ నుదాహరించెను. మఱియు గ్రంథ పీఠికలో భాషావిషయమును బ్రస్తావించుచు నిట్లు వ్రాసెను-

"ఆ యా దేశంబుల నా యా భాషలు వ్యవహరింపఁబడుచుండినను, నా భాషల నంటము నొక్కటిగన మాటలాడక వారి వారి భాషల యందు ననేకవిధంబులగు భేదంబులు గలిగియుండుట యెల్లవారు నెఱింగిన యంశమే! అట్లనే తెనుఁగుభాష యని యొకటి యుండినను, సర్వజిల్లాలయందలి జనులు వివిధసంపర్కములవలనఁ గొన్నిమాటలు దేశస్థితి ననుకూల మగునట్టుల మార్పుంజెంద, బలుతెఱంగుల మాటలాడు చున్నారు. ఒక్కజిల్లాయందలి తెలుగునుమాత్ర మనుసరించి వ్రాయఁ బూనిన నందరికి నత్యావశ్యకంబగు నీ శాస్త్రంబును బెక్కండ్రు గ్రహింపఁజాల రను భయంబున సాధ్యమగునంతవఱకు నన్నిజిల్లాల తెలుఁగు ననుసరించి, ఎల్లరకు సులభముగఁ దెలియునట్టుల సాధారణముగ నింటి వాడుకొను తేటతెనుఁగుపదముల నుపయోగించుచు, నావశ్యక మైన చోటులఁ బర్యాయపదములఁగూడ వ్రాసినాఁడ. ఇదియునుంగాక యీ శాస్త్రమును పాఠశాలలయందు బాలికలకు గఱప, వారల కర్థంబగునట్లు సులభముగాను, పదంబుల వర్ణక్రమముగాని చదువ వారికి బిడ్డలకు సులభముగాఁ దెలియుటకు, దీర్ఘసమాసంబు

లను, గూఢములగు పదసంధులను మాని, చూచినతోడనే యర్థమగు నటులఁగూడ వ్రాసినాఁడను. తెనుఁగుభాషలో నిది మొదటిశాస్త్రమగుటచే నన్నియంశములను బోధించునటుల సాధ్యమగునంత శ్రద్ధ వహించి దీనిని వ్రాయఁబూనితిని. ఐన నీ శాస్త్రంబున నచ్చటచ్చటఁ బొరపాటు లుండవచ్చును. బుద్ధిమంతులగువారలు, వారికిఁదోఁచిన నూతనవిషయముల వెలిగింతురేని మిగుల వినయపూర్వకంబుగ వానిం గ్రహించి రెండవ కూర్పునందు తప్పులు సవరించి, నూతనాంశములఁ జేర్చి యచ్చువేయించి కృతార్థుఁడ నయ్యెదను.”

పయి యంశములనుబట్టి శాస్త్ర గ్రంథములను సర్వజనులు గ్రహింపఁదగు భాషలో వ్రాయుటకు గత శతాబ్ది చివఱ నెట్టి ప్రయత్నములు జరిగినవో విశదమగుచున్నది.

ఈ గ్రంథము విజయనగర ప్రభువు శ్రీ ఆనందగజపతి మహారాజుగారి జనయిత్రి హెర్ హైనెస్ శ్రీ అలకరాజేశ్వరీ మహారాణి సాహెబావారి కంకిత మీయఁబడినది. ఆ మహారాణి యౌదార్యమే యీ గ్రంథము వెలువడుటకుఁ బ్రధాన కారణము. ఈ గ్రంథమునందలి అంకితపత్ర మీ క్రింది విధముగ నున్నది.

“Dedication

to

Her Highness Sri

Alakarajeswari Maharani

Saheba Garu

of Vizianagaram.

This little work

is most respectfully dedicated
With permisson
by

Triplicane,
Madras, Dec. 1890 } K. Subba Rao.

పార్థసారథి శతకము

ఇది శ్రీమదానందగజపతి ప్రభుని యాస్థాన విద్వత్కవులును, పేరి-వేంకటశాస్త్రిగారి పుత్రులును, వైయాకరణ సార్వభౌములు నగు కాశీనాథశాస్త్రిగారిచే రచింపఁబడినది. చెన్నపట్టణము తిరువళ్లిక్కేణిలో వెలసియున్న శ్రీ పార్థసారథిస్వామి స్తుతి యీ శతకమునందలి వస్తువు. ఫూల్సుకేప్ 1 సైజున 21 పుటలు గల యీ శతకము 1855-వ సంవత్సరము జూలై నెలలో విశాఖపట్టణమునందలి ఇండియన్ లా పబ్లికేషన్ ముద్రాక్షరశాలలో ఆ. వెంకటరెడ్డిగారిచే ముద్రింపఁబడినది. గ్రంథము చివర నిట్లున్నది-

"ఇది శ్రీమద్రాజాధిరాజ పూసపాడ్వంశ పయఃపారావార రాకాసుధాకర శ్రీమదానందగజపతి మహారాజశ్రీమండనగు శ్రీమత్పేరి-వేంకటశాస్త్రి పుత్రుఁడగు కాశీనాథకవిచే ప్రణీతంబగు పార్థసారథి శతకము సమాప్తము."

శతకమునందలి తొలి పద్యము-

చ. సరసిజనేత్ర ! నీలఘనసన్నిభగాత్ర ! విరించి వాసవే
శ్వరముఖ నిర్జరప్రణుత ! సత్యచరిత్ర ! శరత్సుధాంశుసుం
దరశుభవక్త్ర ! శత్రుశరదాత్ర ! మనోహర ! చెన్నపత్తన
స్థిరవసతీ ! దయాజలనిధీ ! మమఁ బ్రోవుము పార్థసారథీ !

నడుమనున్న యొక పద్యము—

చ. 'హరుఁడవు నీవె ! యచ్యుతుఁడ; వబ్జభవుండవు నీవె !' యంచు నీ
వరులం నరాధిపున్ మధురనవ్యరసోక్తుల సంస్తుతింప నీ
యురమున నున్న లచ్చికృప యుండనిచో వృథ కాదె? చెన్నపూ
స్థిరవసతీ ! దయాజలనిధీ ! మమఁబ్రోవుము పార్థసారథీ !

తుదిపద్యము—

చ. వరకరుణాబ్ధివేల ! నతపాలనశీల ! వినీలమేఘభా
స్వరతనుకాంతిజాల ! మదవారణరక్షణలోల ! వల్లవీ
స్మర ! మురకాల ! పారెపను మమ్ములఁబ్రోవుము చెన్నపత్తన
స్థిరవసతీ ! దయాజలనిధీ ! మమఁబ్రోవుము పార్థసారథీ !

శ్రీ కాశీనాథశాస్త్రిగారు సంస్కృత సాహిత్య వ్యాకరణములలో నుద్దండ పండితులు! చాలకాలము వఱకును వీరి కాంధ్రభాషా పరిచయము లేదు. కాని, ఆనందగజపతి ప్రభుని ప్రోత్సాహమున వారము దినముల లోనే కృషిచేసి, ఆంధ్ర వ్యాకరణచ్ఛందో రహస్యముల నెల్లఁ దెలిసికొని తెలుఁగు కవిత్వము చెప్పుటకుఁ బూను కొనిన విద్వద్వతంసులలో వీ రొకరు. వీరి రచన సరళము గను, రసవంతముగను ఉండును. కాని యెడనెడ 'విహిత పద్ధతి జేయక నైహికంబె'వంటి ప్రయోగములు—కళలపై

ద్రుతము కలవి కానవచ్చుచున్నవి. "చెన్నపురీ స్థిర వసతే!" అను సంబోధనము వీరి సంస్కృత వ్యాకరణాభిమానమును చాటుచుండును.

శ్రీ శాస్త్రిగారి గ్రంథాంతరము లేవియో, ఎన్నియో తెలియదు. కాని, వీరు 'ఉత్తర శాకుంతల నాటకము' నాంధ్రమున రచించి ప్రకటించినట్లు తెలియుచున్నది.

ఈయన 'గోదావరీలహరి'యను స్తుతిని సంస్కృతమున రచించినట్లు ప్రసిద్ధము.

**పూర్వ మీమాంసా దర్శనము.**

[జైమినీయ న్యాయమాలా సహితము]

న్యాయ వైశేషికములు, సాంఖ్యయోగములు, పూర్వోత్తర మీమాంసలు అను షడ్దర్శనములలో కర్మ ప్రధానమగు పూర్వ మీమాంసాదర్శన మొకటి. దీని మూలసూత్రములు జైమినిముని ప్రణీతములు. వాని వ్యాఖ్యానరూపమగు న్యాయమాల సుప్రసిద్ధము. ఆ గ్రంథము ననుసరించి యియ్యది వ్రాయబడినది. దీని రచయిత శ్రీ గొల్లాపు-కామశాస్త్రిగారు. ఇది అముద్రితము. ఫూల్స్కేప్ సైజు $\frac{1}{4}$ కాగితములపై చిన్న యక్షరములతో పుటకు రమారమి నలువది పంక్తుల వ్రాతలో గ్రంథము లిఖింపబడి యున్నది-

గ్రంథారంభ మిట్లున్నది—

క. 'శ్రీ విజయనగర సంస్థా
నావిరతాభ్యుదయకర మహాగుణ సాంద్రా
జీవిత నిజా విపులజ మ
హావిభుఁ డానందగజపతీంద్రుం డలరున్.

క. ఏ విభుని శీలగుణ స
ద్భావము జీవులకెల్ల బహిరంతస్సం
భావిత రిపులం జంపి మ
హావిభవము గలుగఁజేయు నవ్విభునాజ్ఞన్.

క. కేవిఫలముల యథామతిఁ
బూని నడఁచు సాంఖ్యయోగముల నర్వాఁడగున్
నే నట్టి పూర్వ మీమాం
సా నామకదర్శనంబు సరి తెనిగింతున్.

...... ..............

గ్రంథాంత భాగమున నిట్లున్నది—

"ఇట్లు హిజ్ హైనెస్ ది మహారాజా ఆఫ్ విజయనగరం కె. సి. ఐ. ఇ. వారి యనుజ్ఞనుబట్టి మౌద్గల్యగోత్రపవిత్రుఁడైన కొల్లూరు - శామశాస్త్రిచే రచియింపఁబడిన జైమినీయ న్యాయమాలా సహిత పూర్వమీమాంసాదర్శనభాష్యార్థమందు ద్వాదశాధ్యాయంబు.

గ్రంథము చివఱ నీ క్రింది పద్యము లున్నది—

మ. హరిచే వేదము లుద్ధరింపఁబడియెన్ వ్యాసావతారంబునన్
వరుసన్ జైమినిసూత్రభాష్యములచే వర్ణింపఁబెంపయ్యె, న

కర్తగా బుక్కమహీశమాధవకృతిన్ గావించె నభ్యాభవ్యమం
దరహన్ జెల్లమునా మహోత్సుకత నానందేంద్రు నాజ్ఞారతిన్.

క. పదునెన్మిది నూరుల తొం
బదియొకటవ వత్సరమునఁ బరఁగెడు నేప్రిల్
పదునెన్మిది తేదికిన్
బదిలముగాఁ బూర్ణమయ్యె భాష్యార్థమిలన్.

పయి పద్యములలో మూలానువాదముల విషయము, ఆంధ్రీకరణము ముగింపఁబడిన కాలము (18 ఏప్రిల్ 1891) వివరింపఁబడినవి.

## మనుధర్మ శాస్త్రము

గతశతాబ్ది చివర ఆంధ్రభాషలో వెలువడిన శాస్త్ర గ్రంథములలో నిది యొకటి. ఇదియును మిగిలిన శాస్త్ర గ్రంథములతోఁబాటు విజయనగర ప్రభువులగు శ్రీమదానంద గజపతి మహారాజులుంగారి ప్రోత్సాహమువలనను, సమాదరణవలనను వెలువడినదే! ఆనందగజపతి మహారాజులుంగారికి ధర్మశాస్త్రములయెడల ఆసక్తి యధికము. కావుననే శూద్ర కమలాకరము నాంధ్రీకరించుటకుఁ దామే పూనుకొనిరి. బృహద్గ్రంథమగు ధర్మసింధువును తెలుఁగులోనికి మార్పించి ప్రకటించిరి.

ధర్మశాస్త్రములలోనెల్ల మానవ ధర్మశాస్త్రము సుప్రసిద్ధమై, బహుజనోపయోగకరమై యున్నది. న్యాయస్థానములలో హిందూధర్మములను గూర్చినచర్చ యావశ్యక

మగునపుడు మనుధర్మశాస్త్రమునే ముఖ్యమైన ప్రమాణముగా గ్రహించుచున్నారు. ఇది భృగు మహర్షి ప్రోక్తమని ప్రసిద్ధి. 'ఆంధ్ర మన్వర్థదీపిక' అను వ్యాఖ్యానముతో కూడ దీనిని శ్రీ మండ-కామేశ్వరశాస్త్రిగారు కూర్చిరి. రమారమి 700 పుటలు రాయల్ సైజులోఁ గల యీ బృహద్గ్రంథము 1893-వ సంవత్సరమునఁ బ్రకటింపఁబడినది. దీని ముఖపత్ర మీ క్రింది రీతిని కలదు-

"భృగుమహర్షి ప్రోక్తంబగు మనుధర్మశాస్త్రము
ఆంధ్రమన్వర్థదీపికాసహితము
శ్రీమద్రాజాధిరాజ మహారాజ శ్రీమదానందగజపతి
మహారాజులుంగారి ఆజ్ఞ చొప్పున
సర్వజన సాధారణమగు ధర్మరహస్యం బెల్లవారికిం దెల్ల
మగునట్లు—తన్మహారాజ సంస్థానాస్థానస్థిత పండిత
వర్యులగు బ్రహ్మశ్రీ మండ-కామేశ్వశాస్త్రులవారిచే
తెలిఁగింపబడిన ఆంధ్రమన్వర్థదీపికా సహితముగ
చెదలువాడ - సుందరరామశాస్త్రులవారి
శారదాంబా విలాస ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి
ప్రకటింపఁబడియె. చెన్నపురి"

## మార్కండేయ పురాణము

సంస్కృతమునందలి మూలము ననుసరించి సకల జనోపయోగముగఁ బద్యకావ్యముగ రచింపఁబడిన యీ గ్రంథము రాయల్ సైజున 503 పుటలలో 1886-వ సంవత్సరమున ముద్రింపఁబడినది. రచయిత విజయనగర

సంస్థానాస్థాన విద్వాంసులు శ్రీ మండ-చిట్టికామశాస్త్రి గారు. ఇది శ్రీ మదానందగజపతి ప్రభుని మాతృదేవి శ్రీ అలకరాజాంబా మహారాణిగారికి అంకితము. దీని ముఖపత్రిక మీ క్రిందివిధమున నున్నది-

"శ్రీమత్త్రిభువనమండల మండనాయమాన శ్రీ విజయనగర సంస్థానాధిష్ఠాన పరదేవతలగు హెర్ హైనెస్ శ్రీమదలకరాజాంబా మహారాణీ సాహెబావారికృతిగా – తత్సంస్థానపండితులగు మండ_చిట్టి కామశాస్త్రులవారిచే సర్వజనోపకారంబుగ రచియించి సమర్పింపఁబడిన

శ్రీమదాంధ్ర మార్కండేయపురాణంబు

లేఖన ప్రమాదాది దోషంబులు లేకయుండ శోధించి వైశాఖ పట్టణము శ్రీ వేణుగోపాల ముద్రాక్షరశాలయందు ముద్రించి ప్రచురింపఁ బడినది"

ఇందు కథాప్రారంభమునకు ముందు విజయనగర ప్రభువుల వంశ వృత్తాంతము సమగ్రముగ వర్ణింపఁబడినది. దాని చివర ఆనంద గజపతి ప్రభువును వర్ణించిన పిదప, శ్రీ అలకరాజాంబా మహారాణినిగూర్చి ప్రస్తావించునెడల నిట్లున్నది-

గీ. "అట్టు లానంద గజపతీంద్రావనీశు
లనాదిహంబున సేవింప నాత్మపుత్రి
శ్రీమదప్పలకొండయాంబామతల్లి
చే శ్రీరమణుఁడు విశేషమహిమ."

అంకిత పద్యము-

క. శ్రీమద్విజయనగర రా
జ్యామిత లక్ష్మీవిరాజితాఢ్య మహారా
జ్ఞీ మణికి శ్రీమదలకాం
బామాన్యాగ్రణికి సతత భద్రసరణికిన్.

న. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన మార్కండేయ పురాణంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన-

..........................

గ్రంథాంతము-

క. కనకమణి భూషణాంబర
ధనధాన్య విచిత్రవస్తుతతి మణిమయవా
హన కరి హరి రథ భట సా
ధన గోధన సౌధముఖ వితత సంపత్తీ!

భుజంగ ప్రయాతము—

సదాచార సంపత్తి సంభావనీయా!
సదా సర్వ దిగ్రాజ సమ్మాననీయా!
సదోషారిలోక ప్రకాశత్ స్వసైన్యా!
చిదానందరూపేశ సేవాతిధన్యా!

గద్యము. ఇది శ్రీమదఖిల విబుధజన వి[illegible]ండ [illegible] నామధేయ ప్రణీతంబైన మార్కండేయ[illegible]ణంబునందు సర్వం[illegible] నగు నిది యష్టమాశ్వాసము."



సకల జనోపయోగంబుగ రచియింపఁబడిన దగుట నిందలి శైలి సులభగ్రాహ్యమై యున్నది. సంస్కృత భాషానభిజ్ఞులకు మూల మార్కండేయ పురాణమునందలి విషయమును 'తు, చ'లు తప్పకుండ సమగ్రముగ గ్రహించుట కిది యెంతయు నుపయుక్తము. శైలిని తెలిసికొనుట కుదాహృత పద్యములు గమనార్హములు.

రఘునాయక శతకము

ఇయ్యది శ్రీ రఘురాముని స్తుతించుచుఁ జెప్పిన వృత్త శతకము. రచయిత శ్రీ ఆనంద గజపతి ప్రభువుల యాస్థాన విద్వాంసులగు శ్రీ కొల్లూరు-కామశాస్త్రిగారు. ఇప్పుడియ్యది అలభ్యము. ఇందలి పద్యమొక్కటి మాత్రమే లభించుచున్నది.

ఉ. 'శ్రీకమనీయపుణ్య శబరీ కబరీ నిబిరీసమాలికా<br>
శీ కబళీకృతాంఘ్రి యయుగళీ యుగళీ యుగళీశ! లోకపా<br>
శీక! బలానిలాప్తకదలీ కదలీ కదలీక వైరిసే<br>
నాకలి రుద్ధనాక! రఘునాయక! భక్తవరప్రదాయకా!'

పయి పద్యమునుబట్టి యీ శతకము ప్రౌఢశైలిలో రచింపఁబడినట్లు తెలియుచున్నది.

శ్రీ శాస్త్రిగారు రచించిన గ్రంథాంతరములంగూర్చి స్థలాంతరముల విపులముగా వివరింపఁబడినది.

## రామకథాసార సంగ్రహము

మూఁడాశ్వాసముల యీ ప్రబంధమునకుఁ గర్త శ్రీ మండ-కామేశ్వరశాస్త్రిగారు. ఈయన ఆనంద గజపతి మహారాజుగారి పితృపాదులగు శ్రీ విజయరామ గజపతి మహారాజుగారి యాస్థానమునందును, పిదప శ్రీ ఆనంద గజపతి మహారాజుగారి యాస్థానమునందును విద్వత్కవులుగా ఉండి పెక్కు గ్రంథములను రచించిరి. ఒకప్పుడు శ్రీ విజయరామ గజపతి మహారాజుగారివద్ద ప్రధానామాత్యులైన శ్రీ పెనుమత్స-జగన్నాథరాజుగారి కోరికపయి రామాయణకథను సంగ్రహముగా నొక చిన్న ప్రబంధముగా రచించి, శ్రీ జగన్నాథరాజుగారికే అంకితమిచ్చిరి. ఇది డెమ్మీసైజున 68 పుటల గ్రంథము. ఇది 1885-వ సంవత్సరమున విజయనగరమువందే ముద్రింపఁబడినది. దీని ముఖపత్ర మిట్లున్నది-

" శ్రీరస్తు

శ్రీమదఖిలధాత్రీమండల మండనాయమాన

శ్రీ విజయనగర సింహాసనాధీశ్వర శ్రీముద్రాజాధిరాజ మహన్నెసుల్తాన్

కె. సి. ఎస్. ఐ. ప్రముఖ బిరుదావళీసహిత

సకలరాజన్యమాన్యయశఃప్రతాపపరిపూర్ణులైన

శ్రీ విజయరామగజపతి మహారాజ రాజరాజేంద్రుల

ప్రధానమంత్రిశ్వ సకలప్రయోజనధుర్యులగు

శ్రీ పెనుమెచ్చ - జగన్నాథరాజవర్యుల యాజ్ఞచే

శ్రీమన్మహారాజరాజేంద్ర దయాపాత్రుండగు

మండ - కామేశ్వరశాస్త్రిచే రచియింపఁబడిన
రామకథాసారసంగ్రహంబను గ్రంథంబు
శ్రీ విజయనగరవాస్తవ్య శ్రీమద్విజయరామవిలాస
ముద్రాక్షరశాలయందు
పార్థివ సం॥ర మార్గశిర మాసంబున ముద్రింపబడియె.
క్రీ. శ. 1885 సం॥రం డిశంబరునెల."

శ్రీ కామేశ్వరశాస్త్రిగారు మహారాజుగారికిని, మహారాణిగారికిని కూడ తాము వ్రాసిన గ్రంథముల నంకితమిచ్చిరి. ఆ రీతినే శ్రీ మహారాజుగారి కత్యంతాప్తులు, హితులు, రాజ్యకార్య ధురంధరులు, ప్రధానామాత్యులు నగు జగన్నాథరాజుగారికి కృతిని సమర్పించి యుందురు. ఆ కాలమున శ్రీ జగన్నాథరాజుగారి ప్రతిభ మిక్కిలి ప్రసిద్ధము. ప్రభువులు, ప్రభు కుటుంబమువారును, సామంతులును గాక గవర్నరు, కలెక్టరులు మున్నగు రాజకీయోన్నతోద్యోగులు కూడ ఆయనను ఎక్కువ గౌరవించుచుండిరి. కావున రాజాస్థానకవి యగు శ్రీ కామేశ్వరకవి యీ కృతి నొసంగి ఆయనయెడలఁ దనకుఁ గల భక్తి గౌరవములను వెల్లడించెను.

గ్రంథారంభము—

శా. 'శ్రీ పద్మాపతిబింబ మాంతరకృపా శ్రీమూర్తిగా రక్షణ
వ్యాపారాశ్యమరక్తిమై ప్రకటమా స్వాంతంబునా కౌస్తుభం
శోభాంతం దగు వక్షమొప్పఁ గమలాధీశుండు రక్షించుతన్
దా నెమ్మెచ్చుకళాబ్ధిచంద్రుని జగన్నాథావనీంద్రుం గృపన్.'

షష్ఠ్యంతములలో నొక పద్యము—

క. 'సాధుపెనుమెత్స వంశాం
బోధి సుధాఘృణికి ఘృణికి బుధజనసేవా
బోధితనయగుణికి జగ
న్నాథనృపాగ్రణికి సజ్జనస్వర్ణణికిన్.'

ప్రథమాశ్వాసాంత గద్యము-

'ఇది శ్రీరామచంద్ర చరణారవిందవందన సమాసాదిత కవిత్వ కళావిశాల మనీషిజనానుకూల సేవితవిశ్వేశ్వర మండ - కామేశ్వర ప్రణీతంబైన రామకథాసారసంగ్రహంబను ప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.'

అన్ని యాశ్వాసముల గద్యలు నిట్లే యున్నది.

గ్రంథాంతము.

మ. 'హృదయస్థోజ్జ్వలరామచంద్ర పదసేవేచ్ఛా విశేషాత్తసం
పదుదారత్వ నిరూఢకీర్తి ఖధునీ పర్యాప్తలోకత్రయీ
విదితాశ్చర్య సమస్త సద్గుణగణావిర్భూత తేజో నిర
స్తదురాచార తమఃప్రసారణ! జగన్నాథావనీంద్రాగ్రణీ!'

## విజయనగర విజయయాత్ర

శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతులగు జగద్గురు శ్రీ శంకర భగవత్పాదుల విజయయాత్ర యీ గ్రంథమున వర్ణింపఁబడినది. తమ పితృపాదుల దినచర్య పుస్తకము లోని విషయము ననుసరించి శ్రీ ద్వారకా భమిడిపాటి-వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు దీనిని కూర్చిరి. ఇది

రాయల్ సైజున 63 పుటల గ్రంథము. ఫెదర్ వెయిటు కాగితముపయి 1937-వ సంవత్సరమున ఛాయా చిత్రములతో కూడ, విజయనగరమునందలి శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది. ఇది యమూల్యము.

డెబ్బది యెనిమిదేండ్లకుఁ బూర్వము శ్రీ కాంచీ కామకోటి పీఠమునకు జగద్గురు శ్రీ మన్మహాదేవేంద్ర సరస్వతీ స్వాములవారు పీఠాధిపతులుగా ఉండిరి. శ్రీవారు దక్షిణాపథమునుండి ఉత్తరప్రాంతములకు మతప్రచారార్థము పోయి, వివిధ స్థలములందు ఘన స్వాగతములను గ్రహించుచు, మతబోధల నొనర్చుచు, 1885 మధ్యభాగమున విజయనగరమునకు విజయముచేసి, చాతుర్మాస్యదీక్ష నచటనే నిర్వర్తించిరి. విజయనగరప్రభువులు వైష్ణవ సంప్రదాయమునకుఁ జెందినవారైనను, సర్వమతములయెడలను సమపక్షపాతము కలిగి యుండుటవలన అద్వైత మతాచార్యులగు శ్రీశంకరాచార్యస్వామివారిని, సకుటుంబముగఁ బెక్కువిధముల సమ్మానించిరి. అప్పటి విశేషముల నన్నింటిని రాజపురోహితులగు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి పితృపాదులు తమ దినచర్యపుస్తకములో వ్రాసి యున్నారు.

ప్రస్తుత కామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వాములవారును 1936-వ సంవత్సరమున తమ యుత్తర దేశప్రచారయాత్రను ముగించుకొని విజయనగరమునకు విజయముచేసి, యచట ఘన సమ్మానములను పొంది, కొన్నాళ్లచ్చటనే యుండి పురజనులకు వైదికమతము

మతము, స్త్రీ ధర్మములు, శ్రీమదాద్య శంకరాచార్య నామస్మరణము మున్నగు విషయములనుగూర్చి యుపన్యాసము లొసంగి యుత్తేజము కలిగించిరి,

పయి పీఠాధిపతు లిద్దరియొక్కయు విజయయాత్రా విశేషములను విపులముగా వివరించుచు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారీ గ్రంథమును కూర్చిరి. ఇందు శ్రీమ పిత్రుపాదుల దినచర్య పుస్తకములోని విషయములను యథాలిఖముగ నిచ్చుటయే కాక, అప్పటి విశేషముల నన్నింటిని కన్నులకుఁ గట్టినట్లు వర్ణించిరి. శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి పాదులు ఉత్తరదేశమునుండి విజయనగరమునకు వేంచేయు వఱకును గల విషయము లన్నియు రాష్ట్రేతరుల యుపయోగార్థమై ఆంగ్లభాషయందే కూర్పఁబడెను. తర్వాతి భాగముమాత్ర మాంధ్రభాషయందుఁ గలదు. యాత్రా చరిత్రచివఱ శ్రీశ్రీశ్రీ జగద్గురువు లొసఁగిన యుపన్యాసముల సారము కూడ నీయఁబడినది.

ఈ గ్రంథమును చదివినవారికి, భారతదేశమందంతటను శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతులగు శ్రీ శంకరాచార్యచరణులయెడల ఎట్టి గౌరవము కలదో వివిధ ప్రాంతములందలి విద్వద్వరేణ్యు లొసఁగిన సమ్మానపత్రముల వలనఁ దెలియఁగలదు. మతమునందును, శ్రీ శంకరాచార్యపాదుల ధర్మోపదేశములయెడను ఆసక్తి కలవారి కందరికిని ఈ యాత్రా చరిత్రగ్రంథము ఉపాదేయము.

ఈ గ్రంథము శ్రీ శంకర భగవత్పాదులయెడల భక్తి ప్రపత్తులును, సనాతనధర్మప్రచారమున అసక్తియుఁ గల డవేజర్ మహారాణీ శ్రీ లలితాకుమారీదేవిగారి పోషణ మున ప్రకటితమైనది. ఉదార స్వభావము కల యీ మహా నీయురాలు ప్రస్తుతపు విజయనగరప్రభువులు శ్రీవిజయరామ గజపతిరాజుగారి పితామహి యగుట ఎల్లరకును సువిదితము.

విజయరామశతకము

బొబ్బిలి యుద్ధమున వీరస్వర్గము నలంకరించిన శ్రీవిజయరామగజపతి మహారాజుగారి కాలములో నుండిన గోగులపాటి-కూర్మనాథకవి దీనిని రచించెను. ఈ కవి జన్మ స్థలము విశాఖపట్టణ మండలములోని గజపతినగరమునకు సమీపమున నున్న దేవుపల్లి గ్రామము. అయినను ఈతఁడు విద్యాభ్యాసార్థము స్వగ్రామమును విడిచి విజయనగర సమీపమునఁ గల శ్రీరామతీర్థ క్షేత్రమునకుఁ బోయి, అచటనున్న విద్వద్వరేణ్యులు శ్రీమత్తిరుమల పెద్దింటి-సంపత్కుమార వేంకటాచార్యులవారికి శిష్యుఁ డయ్యెను. ఉదారహృదయులగు నా విద్వద్వరేణ్యులు మిక్కిలి వాత్స ల్యముతో నితనికిఁ దమ గృహమునందే భోజనము పెట్టుచు, సంస్కృతాంధ్రములను బోధించిరి. కుశాగ్రబుద్ధియగు నీ కూర్మనాథకవి చక్కని పాండిత్యమును, కవిత్వము చెప్పఁ గల శక్తిని సంపాదించి గురువుగారి యభిమానమునకుఁ బాత్రుఁడయ్యెను.

శ్రీ అయ్యవార్లంగారు విజయనగర ప్రభువులకు గురువులు. కావునఁ దఱచుగ ప్రభువులవద్దకుఁ బోవుచుండిరి. అట్టి సమయములలో కూర్మనాథకవి కూడ గురువుగారితో విజయనగరమున కేఁగుచు. వారితోఁబాటు ప్రభువును దర్శించుచుండెను. గురువుగారి మూలమున శ్రీవిజయ రామగజపతిప్రభువు కూర్మనాథకవి శక్తి సామర్థ్యములను, పాండిత్యమును దెలిసికొని సంస్థానమునకుఁ జెందిన దేవ స్థానములలో నతనిని సంకీర్తనాచార్యునిగ నియమించెను. కూర్మనాథకవి శ్రీరామతీర్థమునందే స్థిరనివాసము నేర్పఱచుకొనినను, ఉత్సవాది సమయములలో సింహాచల, పద్మనాభాదిక్షేత్రములకుఁ బోవుచుఁ దన విహిత కృత్యముల నొనర్చుచుండెను. ఈయన ఆ యా క్షేత్రములయందలి దేవతలపై రసవంతములగు పెక్కు కీర్తనలను రచించెను.

శ్రీ కూర్మనాథకవి దేనిని రచించినను, దానిని భగవంతునికే అంకితము చేయుచుండెడివాఁడు. ఈ పద్ధతిలోనే ఇతఁడు లక్ష్మీనారాయణ సంవాదము, మృత్యుంజయ విలాసము అను గ్రంథములను రచించెను. ఇతని రచనలను గురువులగు సంపత్కుమార వేంకటాచార్యులవారేకాక విజయరామగజపతి ప్రభువువారుకూడ మెచ్చుకొనుచుండిరి.

కూర్మనాథకవి యిట్లు ప్రభువుల గౌరవాదరములను పొందుచుండుటవలన కొందఱు విద్వాంసుల కసూయ జనించెను. ఎట్లయినను ఇతనిపై ప్రభువుల కనుగ్రహము తప్పి పోవుటకుఁ దగిన మార్గములను వా రన్వేషింపసాగిరి. కూర్మ

నాథకవి యే రచననైనను భగవంతునికిఁ దప్ప యితరుల కంకిత మీయఁడని వారికిఁ దెలియును. వారు ప్రభువువద్దకుఁ బోయి "కూర్మనాథకవి తమ భృత్యుఁడై యున్నను, ఏ గ్రంథమును ప్రభునామాంకితముగ రచింపలేదు. రచింప సంకల్పమున్నట్లును కానరాదు. అతఁడు నరాంకితముగ ఎట్టి రచనను సాగింపఁడఁట!' అని చెప్పిరి. అంత ప్రభువు కూర్మనాథకవిని పిలిపించి తమ భోగకాంత యగు 'సుందరీ మణి' పయి నొక శతకమును రచింపవలెనని కోరెను.

అట్టి రచన చేయుటకుఁ గవి కిష్టములేకున్నను, ప్రభువు కోరికను తిరస్కరింపఁజాలక – తన నియమమునకు భంగము కలుగదని తలంచి– 'సుందరీమణీ!' అను సంబోధన మకుటముతో నొక శతకమును చెప్పెను. అది యెవ్వరికిని అంకితము కాదనియు, 'సుందరీమణి' అనునది స్త్రీ సామాన్య విశేషణము కాని, ఒక యువతి నామమని చెప్ప సాధ్యము కాదనియు స్పష్టమయినది. అందువలన అసూయాగ్రస్తుల సంకల్పము సఫలము కాలేదు. పిదప వారు మరల ప్రభువును దర్శించి 'ప్రభువుల పేరు వచ్చునట్లు ప్రతి పద్యమును చెప్పుచు శతకము రచింపవలెనని కూర్మనాథకవిని కోరవలె'నని ప్రార్థించిరి. ప్రభు వట్లే కవిని కోరెను.

అసూయాపరులు పన్నిన పన్నాగమును కూర్మనాథకవి గ్రహించెను. ప్రభుని యాజ్ఞను తిరస్కరించుట తప్పనియు, తన నియమమును త్రోసిపుచ్చుట అంతకంటె పెద్ద తప్పనియు నతఁడు గ్రహించెను. తుదకు 'విజయరామా!'

రామతీర్థాశ్రయా!' అను మకుటముతో శతకమును వ్రాయ నీతఁడు నిశ్చయించెను. 'విజయరామ' శబ్దము ప్రభువునకే కాక భగవంతుఁడగు శ్రీరామునికిని సమన్వయించును. 'ఇట్టి రచనవలనఁ దన నియమమునకు భంగము కల్గదు. ప్రభువునకును సంతృప్తి కలుగును' అని కవి యాలోచించెను.

శతకము పూర్తియైనది. దానిని సమగ్రముగా విని ప్రభువు మిక్కిలి సంతోషించెను. కూర్మనాథకవికి నియమ భంగము కలిగినదని ప్రత్యర్థులు సంతోషమును పట్టలేక పోయిరి. కాని, వారు తలఁచినట్లు కవి ఖిన్నుఁడు కాలేదు. పైపెచ్చు సంతుష్టుఁ డయ్యెను, పిదప కూర్మనాథకవి 'విజయరామ' శబ్దమును శ్రీరాముని పరముగా గ్రహించి శతకమును చెప్పినట్లు ప్రత్యర్థులు తెలిసికొనఁగలిగిరి. తా మొనర్చిన యీ ద్వితీయ ప్రయత్నముకూడ వ్యర్థమైన దని వారు సంతాపము చెందిరి.

కూర్మనాథకవి గ్రంథాంతరము లన్నియు ముద్రితము లైనవి. కాని 'విజయరామ'శతకము మాత్రము ముద్రింపఁ బడలేదు. అందులోని మూఁడు పద్యములుమాత్ర మింత వఱకును లభించినవి. అవి యీ క్రింద నీయఁబడుచున్నవి-

శా. స్వామిన్ గన్నది పూట; పుణ్యనదిక్రేవం జన్నదే బాట; మీ
ధామం బున్నది పేట; ధర్మసభ పత్యంబున్నదే మాట; యే
మేమన్ వస్తుసమృద్ధిచే భటులచేఁ జెల్వైనదే కోట; పెన్
బ్రామిష్టున్నదె కోఁట; శ్రీ విజయరామా! రామతీర్థాశ్రయా!

మ. సముద్రైనది వారు; మీ భజనచే జాగ్రైనదే వారు; శ్రీ
ష్మములోఁ బాతిన దేరు; సజ్జననివాసంబున్నదే యూరు; రా
గము బాగైనది వేరు; మీ పదపరాగంబున్నదే నీరు; ధ
ర్మముచేఁ గన్నది పేరు శ్రీ విజయరామా! రామతీర్థాశ్రయా!

మ. ఘనరోషం బతిలోభికే; పరుషవాక్య ప్రౌఢతుల్ పండకే;
ధనకార్పణ్యము పాపశీలునకే; కాంతాబద్ధమోహంబు జా
ఱునకే; నిర్మలసాధు వంచనవిధుల్ మూర్ఖాళికే యిమ్మహిన్
మనుజస్వామికి ధర్మమహా! విజయరామా! రామతీర్థాశ్రయా!

## విశాఖపట్టణముజిల్లా వృత్తాంత సంగ్రహము

జిల్లాలలోని పాడి పంటలు, అటవీసంపద, సహజ సంపద, జనులంకూర్చిన విశేషములు, ప్రాచీన-నవ్య పరిపాలన మున్నగు పెక్కు విషయములఁ జేర్చి గ్రంథరూపమునఁ బ్రకటించుట పాశ్చాత్య ప్రభుత్వాధికారుల పద్ధతి. ఇది 'డిస్ట్రిక్టు మాన్యూయలు' నామమున ఆంగ్ల భాషలో వ్రాయఁబడును. ఆ పద్ధతి ననుసరించియే 1865-వ సంవత్సరములో అప్పటి విశాఖపట్టణముజిల్లా గవర్నర్ ఏజెంటు డి. ఎఫ్. కార్మైకిల్ దొరగారు వ్రాసిరి. దీనిని 'విశాఖపట్టణము జిల్లా వృత్తాంత సంగ్రహ' మను పేర విజయనగరము మహారాజావారి రివిన్యూ ఆఫీసులో హెడ్ మున్షీగా పని చేసిన శ్రీ విజాపురపు-వెంకట కోదండరావు పంతులుగారు ఆంధ్రీకరించి ప్రకటించిరి. క్రౌను ¼ సైజున 638 పుటల గ్రంథము. దీనిం జేర్చి 36 పుటల అనుబంధములు, వివిధ విషయముల లెక్కలను తెలుపు పట్టికలును

కలవు. ఇది 1888-వ సంవత్సరమున విశాఖపట్టణ. శ్రీ వేణుగోపాల ముద్రాక్షరశాలలో శ్రీ శ్రీరం రామయ్యగారిచే ముద్రింపఁబడినది. ఇది, మూలగ్రంథ కర్తలగు శ్రీ కార్మైకిల్ దొరగారికే అంకిత మీయఁబడినది. ఇందలి అంకితపత్రి మిట్లున్నది-

"Dedication

ది హానరేబిల్ డి. ఎఫ్. కార్మైకిల్ దొరవారు - వారికిని సర్వాధిపత్యయందును, విశేషించి విశాఖపట్టణజిల్లాయందును విశేష ప్రీతియు, నాంధ్రగీర్వాణభాషలయందును, హిందూసంప్రదాయము లందును విశేషప్రజ్ఞ గలవారై, యీ దేశమునకు విశేషోపకారక లగుటచే నీ గ్రంథమును కృతజ్ఞతతో వారి కంకితముగ రచియించుట నైనది.

విశాఖపురపు-వెంకటకోదండరావు,
ట్రాన్సులేటరు"

ఇందు ఏడు అధ్యాయములు కలవు. మొదటి యధ్యాయమున జిల్లా వైశాల్యము, సహజసంపద. నైసర్గిక పరిస్థితులు, రేవులు. అడవులు మున్నగు విషయములు కలవు. రెండవ యధ్యాయమున జాతి మతములను గూర్చియు, భాషలు, వ్యవసాయము, వస్తువులు. వర్తకము. విద్య మున్నగువానినిగూర్చియుఁ గలదు. మూఁడవ యధ్యాయమున జిల్లా రాజకార్య చరిత్రాంశములు వివ రింపఁబడినవి, నాల్గవ యధ్యాయములో న్యాయ విచారణను గూర్చియు, ఐదవ యధ్యాయమునందు రెవిన్యూను గురిం చియు, ఆఱవ యధ్యాయములో పట్టణములను, మ్యునిసి

పాలిటీలనుగూర్చియు, ఏడవ యధ్యాయమున స్థల సంబంధములగు ఖండములనుగూర్చియు వివరణలు కలవు. వివిధ విషయములను గూర్చిన అనుబంధములు, పట్టీలును ఈ యధ్యాయము ననుసరించియే యున్నవి.

శ్రీ కార్మైకిలు దొరగారు హంపి విజయనగరమును పాలించిన శ్రీకృష్ణదేవరాయలవారు, ఈ విజయనగర సంస్థానమునకుఁ జెందినవా రనెడి భ్రాంతితోఁ గాబోలు— వారి శాసనము నొకదానిని రెండవ యనుబంధములో ఉదాహరించి యున్నారు. ఆ శాసనము విజయనగర సంస్థానమునకుఁ జెందిన సింహాచల దేవాలయములోని యొక స్తంభముపయి చెక్కింపఁబడి యుండుటయే యీ భ్రాంతికిఁ గారణమై యుండును.

ఈ గ్రంథము శ్రీమదానంద గజపతి మహారాజులుంగారి యాజ్ఞ మేరకు శ్రీవారి సమాదరణమువలన జరిగినది. భాషాంతరీకర్త వ్రాసిన పీఠికవలన దీనింగూర్చిన వివరములు తెల్లమగును. అయ్యది యిట ఉదాహరింపఁబడుచున్నది—

"విశాఖపట్నం డిస్ట్రిక్టు మాన్యూయలను వృత్తాంతసంగ్రహము ౧౮౬౯ సం॥ లో అప్పటి విశాఖపట్నం జిల్లా గవర్నరు యేజెంటువారయిన దీ హానరెబిల్ డి. ఎఫ్. కార్మైకిల్ దొరవారివలన వ్రాయఁబడి యున్నది.

ఆ గ్రంథ మాంగ్లేయభాషను రచియింపఁబడి యుండుటచే నా భాషయందు ప్రవేశము లేనివారలకీ జిల్లాయొక్క భూములు, పంటలు,

వన్యవిశేషములు, పూర్వప్రభుత్వ వృత్తాంతములు, వ్యవహారస్థితులు మొదలగు విశేషముల నందువలన దెలిసికొనుట యశక్యముగ నుండెడిని.

ఆ గ్రంథము తెలిగించబడువెడల విశేష లోకోపకారముగ నుండునని వర్తమాన విజయనగర రాజ్యాధిపతులగు శ్రీ ఆనందగజపతి రాజు మహారాజులుంగారికి తాత్పర్యము కల్గియుండెను.

అంతట ౧౮౭౧ సం॥లో శ్రీ గవర్నమెంటువారి కార్యములపైని మె. కార్మైకిల్ దొరవారు విశాఖపట్టణమునకు వచ్చినప్పుడాయనవలన ననుజ్ఞ యివ్వబడినందున శ్రీ మహారాజావారి ప్రేరణ ననుసరించి విజయనగరరాజు రివిన్యూ ఆఫీసులో హెడ్డుమునిషీయైన విజాపురపు - వెంకట కోదండరావువలన నీ గ్రంథము రచియింపబడినది.

ఈ ట్రాన్సులేటరుయొక్క తండ్రియైన విజాపురపు - వెంకట రావుపంతులుగారు విశాఖపట్నం గొర్నమెంటు యేజెంటు కోర్టు మేనేజరుగా వుండి సదరు మాన్యాయులు వివరములై కావలసిన కొన్ని వృత్తాంతముల సంగ్రహించి యాయన యజమానులగు మె. కార్మైకిల్ దొరవారికొద్ద మెహనతుచేసి యుండుటచే నా గ్రంథమునే తన ప్రభువులైన శ్రీ మహారాజావారి కటాక్షమువలన తాను తెనిగించునట్టి భాగ్యము కల్గెనని సంతసించుచు, నిట్టి ప్రేరణకు కారణమగు దైవకృపకీ ట్రాన్సులేటరు మిక్కిలి కృతజ్ఞత గలిగి యుంటున్నాడు.

విజయనగరం<br>
౧౮౭౬ సం॥ మే ౨౪ తే } ”

ముఖపత్రమున ‘౧౮౭౮ జనేవరు’ అని యున్నందున, ఇది ముద్రణము నొంది ప్రకటింపఁబడుటకు 20 నెలలు పట్టినట్లు తెలియుచున్నది.

ఈ గ్రంథమునందు జిల్లా వృత్తాంతమే విశేషముగా నున్నను, సంస్థానముల యుదంతమును వివరించునపుడు విజయనగర ప్రభువులకును, విజయనగర సంస్థానమునకును ప్రాధాన్య మీయఁబడినది. దీని యనువాదమునకును, ప్రభువుల సమాదరమునఁ బ్రకటింపబడుటకును ఇది ముఖ్య కారణము యుండనోపును. విజయనగర సంస్థాన చరిత్రమును తెలిసికొనుటకుఁ దగిన యవకాశములు లేని సమయములో – ఈ గ్రంథము ప్రకటింపఁబడుట సంస్థాన ప్రజలకును, చరిత్రకారులకును మహోపకారకము.

విషభక్తి సుధాకరము

విజయనగర సంస్థానమును పాలించిన ప్రభువులవలెనే వారి కుటుంబములోనివారును, సామంతులును అయిన పాలకులు కూడ విద్వత్కవులయి, గ్రంథములను రచించి భాషా సేవ యొనర్చిరి. అట్టివారిలో ప్రభువుల జ్ఞాతివర్గములోని వాఁడును, సగోత్రుఁడును, రేగులవలస నరిపాలకుఁడు నగు శ్రీ పూసపాటి-విజయరామరాజు ముఖ్యుఁడు. పద్మనాభమునందు పరస్వర్గము నలంకరించిన శ్రీ విజయరామగజపతి ప్రభువునకు సామంతుఁడు. ఇతఁడు 'విషభక్తి సుధాకర' మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి, శ్రీరామతీర్థమున వెలసియున్న శ్రీరామునకుఁ గృతి యిచ్చెను. ఈ యంశము నాశ్వాసములయందలి తొలి పద్యములును, 'రామునకున్ రామతీర్థ రఘురామునకున్' మున్నగు

మధ్యాంత పద్యభాగములును, ఆశ్వాసాంత గద్యలును విశదము చేయుచున్నవి.

ఈ ప్రబంధమున విష్ణుభక్తుఁడగు కులశేఖరప్రభుని భక్తి ప్రపత్తులు వర్ణింపఁబడినందున దీనికి 'విష్ణుభక్తి సుధాకర' మనెడి పేరు కలిగినది. కులశేఖరుఁడు విష్ణుభక్తుఁ డగు పన్నిద్దఱాళ్వారులలో నొకఁడు. అతని చరిత్ర మిందు వివరింపఁబడినందున దీనికి 'కులశేఖరాళ్వారు చరిత్ర' మను నామాంతరము వాడుకలో నున్నది.

కవితాప్రౌఢిమను, భావాంతర కల్పనను నాలోచించినచో నీ 'విష్ణుభక్తి సుధాకరము' శ్రీకృష్ణదేవరాయల 'ఆముక్తమాల్యద'ను పోలియుండునని చెప్పవచ్చును. కులశేఖరుఁడును విష్ణుచిత్తునివలెఁ బరమ వైష్ణవభక్తుఁడు. పెరియాళ్వారు పుత్రిక యగు గోదాదేవివలెనే కులశేఖరుని పుత్రిక 'నీలాంశజ'యు శ్రీరంగనాథునే పరిణయ మయ్యెను. భక్తులిరువురును గొప్ప ప్రభావము కలవారు. కవు లిరువురును ప్రభువులు!

ఈ ప్రబంధపు వ్రాఁతప్రతులు లోకమున రెండు మాత్రమే కానవచ్చుచున్నవి. చెన్నపట్టణమునందలి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో దీని ప్రతి లేదు. ఎంతో శ్రమపడి, ముప్పది యేండ్లకు మునుపు ఆనంద ముద్రణాలయమువారు సంపాదించిన ప్రతిని నే నొకప్పుడు పరిశీలించు నవకాశము కల్గినది. ఆ ప్రతిలో నయిదాశ్వాసములు నున్నవి. కాని, ద్వితీయాశ్వాసములోఁ గొంత

భాగము లోపించినది. ప్రథమాశ్వాసారంభమున ఇష్ట దేవతా స్తుతిలోఁ గొంచెము భాగము లుప్తమైనది. తక్కిన మూఁడాశ్వాసములును సమగ్రముగనే యున్నవి. గ్రంథారంభ మిట్లున్నది—

'.............................

వల్లకీపుస్తక వనజపాణి
కుచకుంభసంభృత గుణమౌక్తికశ్రేణి
మంజుల కోకిలా మధురవాణి
విమల పాదాంబుజ వినమిత గీర్వాణి
యరవిందభవుని మోహంపురాణి

గీ. ప్రకట వినమిత మకరంద పానవివశ
నవమిళిందాయమాన మానస మనోజ్ఞ
వరశశిద్యుతి శర్వాణి నిరుపమాన
పరమకల్యాణి వాణిని ప్రస్తుతింతు.'

షష్ఠ్యంతము—

క. రామునకు నాప్త సీతా
రామునకు సురారిచయ విరామునకును హృ
ద్రామునకు సకల జగదభి
రామునకును రామతీర్థ రఘురామునకున్.

కథాప్రారంభము—

సీ. హారికరాకృతిని బాణాసన రమ్యమై
శ్రుతిగతి గాయత్రి నతిశయిల్లి,
నందనవనరీతి మందారమహితమై
కోలాహలోలికఁ దమ్మికులమున నలరి,

దివిభాతి రంభనదీర్ణమై వైకుంఠ
పురిభాతిని ముకుంద గరిమ మెఱసి
దండుకైవడి వీరతతుల నత్యుత్కృష్టమై
మంథరపగిదిని మావులందగి

గీ. విపులకావ్యంబు తెఱఁగున వృత్తజాతి
సముదయోద్దామమై బకసద్మపగిది
విలసితాయుధ పున్నాగ వితతి వానరి
నైమిశారణ్య మనని విన్నాణమగును.

ఇందలి శ్లేషయు, నుపమయు మిగుల హృదయంగమములయి, సులభ పద్ధతిని వివరింపఁబడి యున్నవి.

ఆశ్వాసాంతపద్యము—

క. 'జనకసుతా హృన్మోహక!
కనకమృగ ప్రహరణ ప్రకటదోస్సారా!
.........................
దినకరకులవీర! రామతీర్థవిహారా!

ఆశ్వాసాంతగద్యములు - ప్రథమాశ్వాసము-

'ఇది శ్రీరామతీర్థ సీతారామ కరుణామసృణ కటాక్షలబ్ధ సుధా మధురిమ ధురీణామల కవితాభివేద్య సరససాహిత్య మృదుమధుర వచన రచనా ప్రకటిత సత్య శ్రీమన్మహామండలేశ్వర మహీమండలరాయ. మన్యసుల్తానాది బిరుదాంక శ్రీ పూసపాటి వంశజలధి రాకామృగాంక శ్రీమద్వసిష్ఠగోత్రపవిత్ర శ్రీ కృష్ణమరాజపౌత్ర శ్రీ భూపాలరాజపుత్ర వితరణజిత సురభూజ శ్రీ విజయరామరాజ ప్రణీతంబైన శ్రీ విబుధ శ్రీ సుధాకరంబను మహాప్రబంధంబునందు ఇష్టదేవతాప్రార్థనంబును, తద్వంశ్య పూర్వరాజవర్ణనంబును, పురవర్ణనంబును, వైష్ణవరాజ విభ

వాతిశయంబును, కుల శేఖరజననంబును, తదీయాభ్యుదయంబు నను కథలు గల ప్రథమాశ్వాసము.

తృతీయాశ్వాసగద్యము—

ఇది...మహాప్రబంధంబునందు వసంత ఋతువర్ణనంబును, నీలాంశజా విరహావర్ణనంబును, శృంగారవనవిహారంబును, మదనచంద్రాద్యుపాలంభ నాయకి చాతుర్యంబును, మధుపానోత్సవంబులును, క్రీడావిలాసంబును, గ్రీష్మ ఋతువానియకథనంబును, వర్షాగమంబును నను కథలు గల తృతీయాశ్వాసము.

చతుర్థాశ్వాసగద్యము—

ఇది...మహాప్రబంధంబునందు ప్రధానాధీనరాజ్యభారకులశేఖరానంతర భాగవతపూజామాహాత్మ్యంబును, శ్రీవైష్ణవ నిందార్థ మంత్రిజన ప్రయుక్త రాజభూషణాపహరణంబును, తదీయాపవాదపరిహారక కేరళనృపకృష్ణసర్పప్రమాణీకరణంబును, శ్రీరంగనాయక సాక్షాత్కారంబును, నీలాంశజారంగనాయక పరిణయప్రసంగ కులశేఖరాంగీకారంబును నను కథలు గల చతుర్థాశ్వాసము.

పంచమాశ్వాసగద్యము—

ఇది.........మహాప్రబంధంబునందు శ్రీరంగనాయక వివాహ సుముహూర్త నిశ్చయ తద్వర విష్వక్సేనానీత బృహస్పతి సమాగమంబును, చోళపట్టణముఖ్య నానాపురాష్ట్రదిక్ఛిఖిలలోక శుభలేఖాప్రేషణ ప్రయత్నంబును, బ్రహ్మేంద్రాద్యమరనాయక సహిత శ్రీ రంగేశ చోళ నగరాగమన వైభవంబును, వివాహోత్సవానంతర నవవధూయుత రంగవల్లభ పునర్నిజపురీప్రవేశంబును, నవోఢాసంగమవర్ణనంబును, కులశేఖర శ్రీమద్రామాయణ కథాశ్రవణమాహాత్మ్యంబును......నను కథలు గల పంచమాశ్వాసము.

ఈ మీఁది యాశ్వాసాంత గద్యములనుబట్టి యుందలి కథ తెలియుచునే యున్నది. ద్వితీయాశ్వాసములో నీలాంశజ ఘట్టిక. ఆమె సౌందర్యము, శ్రీరంగనాథునిపయి ఆమెకుఁగల భక్తి, ప్రేమ వర్ణితములయి యున్నవి.

విష్ణుభక్తి సుధాకరమునఁ గవిత్వ గౌరవముకంటెను కథా గౌరవమే యధికము. రచనయందు సంస్కృతముల పద్ధతులు, వర్ణనలు సర్వవిధములను ప్రాచీన ప్రబంధములను దలఁపించుచున్నవి. ఆశ్వాసాంతములయందు దఱుచుగ గర్భకవిత్వము కానవచ్చుచున్నది. మచ్చునకు ఆయా ఆశ్వాసములనుండియు నొక్కొక్క పద్యము—

మ. సుమనశ్శ్రేణుల తావులొలిఁగని మెచ్చుంగూర్చి దివ్యాస్త్రపగా
సముదగ్రోర్మి పరంపరం దనిసి భాస్వద్వ్యక్తరం గాత్తమా
ద్యమ నీలాంచిత భూస్థలిన్ నిలిచి భక్త్యుంజేర్చుడెన్ దస్యరం
దమ...మకల్లలానుమ సదానంద క్రియాశంవనై.

[ప్రథమాశ్వాసము]

చ. పొలఁతి మెఱుంగు పెందొడల పోలికఁ దెలిక చొప్పునంగ నే
వలనను జెందలేక మదవారణరాజకరంబు లేర్పడన్
జలగుణమెల్ల కాలము నిజంబుగఁ దాల్చినదై మనుంగుపా
టలవడ నెంతయున్ విరసులై పొరలెత్తుచునుండు నెచ్చటన్.

[ద్వితీయాశ్వాసము]

గీ. వాఁడి దంష్ట్రిలు దట్టమై వరలు ఘోర
విషధరాననములఁబడి విలయ మెనయ

కీవు మంటివిగ ! వియోగినీ వరిష్ఠ
పాపవశమునఁ జేసి యేర్పడఁగ నిపుడు.

[తృతీయాశ్వాసము]

చ. వినుమిఁక మౌనవేంద్ర ! కదివేలన నేటికి శ్రీ నీదుపాలికిన్
జనవున వేళపాళఁ గనఁజాలక లోపలికేటికెప్పుడున్
మునుకొని వచ్చు వైష్ణవుల మొత్తము దక్కను, వింతలెవ్వ రీ
ఘనమణి భూషణప్రతతిఁ గైకొనఁగాచుకవచ్చి యుండిరే శ్రీ

[చతుర్థాశ్వాసము]

మ. చిగురుంబోండ్లు కడానిపైఁడి వనటుల్ చెల్వంబుగా వంచి మె
చ్చుగు నీహారపయఃప్రపూరములఁ గన్యన్ మంగళస్నాన మిం
పుగఁ జేయించిరి కమ్మఁదావులు హరిద్రాభ్యంతరిక్షంబులన్
సిగుడన్ గంకణ విస్ఫురత్ప్రిభలు నిర్నిద్రంబులై రాణిలన్.

[పంచమాశ్వాసము]

పయి పద్యములు, పత్రములు తిరుగ వేయఁగాఁ గంటికిఁ గనఁబడినవి. ఏర్చి కూర్చినవి కావు. కావున ఇంచు మించుగఁ గవిత్వ మంతయు నీ రీతినే యుండునని నిశ్చయింప వచ్చును.

ఏతద్గ్రంథకర్త యగు శ్రీ విజయరామరాజుగారు ఈ ప్రబంధమునే కాక హోరా లక్షణమను జ్యోతిష గ్రంథమును కూడ వ్రాసిరి. అది ముద్రితము.

## శూద్రకమలాకరము

ఇది యొక ధర్మశాస్త్ర గ్రంథము, చతుర్థవర్ణము వా రవలంబించు ధర్మములను తెలుపునది. ఆంధ్రీకర్త శ్రీ ఆనంద

గజపతి ప్రభువుల యాస్థాన విద్వత్కవి శ్రీ కొల్లూరు - కామశాస్త్రిగారు. ఇది రాయల్ సైజులో 202 పుటల గ్రంథము. దీని ముఖపత్ర మిట్లున్నది-

"శ్రీమద్రాజాధిరాజ మహారాజ శ్రీమదానంద గజపతి మహారాజాలుంగారి ఆజ్ఞ చొప్పున సర్వజన సాధారణముగ శూద్ర ధర్మరహస్యమెల్లవారికిం దెల్లంబగునట్లు తన్మహారాజ సంస్థానాస్థాన స్థిత పండిత వర్యులగు బ్రహ్మశ్రీ కొల్లూరు - కామశాస్త్రులుంగారిచే సంపూర్ణముగ తెనిగింపఁబడి చెదలువాడ - సుందరరామశాస్త్రిగారిచే పరిష్కరింపబడి శా. శ. 1809 సర్వజిద్వత్సర మాఘశుద్ధ సప్తమీ స్థిరవాసరంబున ఆదిసరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె. చెన్నపురి."

ఈ గ్రంథమును శ్రీమదానందగజపతిమహారాజులుంగారు స్వయముగనే యాంధ్రీకరింపఁబూనుకొనిరి. కాని, యింతలో మిల్లుదొరగారి తర్కశాస్త్రము నాంధ్రీకరింపఁ దలంపు కలుగుటవలన దీని యాంధ్రీకరణ భారమును శ్రీకొల్లూరు-కామశాస్త్రిగారి కప్పగించి, తా మాంగ్లతర్కశాస్త్రానువాదమునకుఁ బ్రారంభించిరి. ఆ గ్రంథము సమగ్రముగఁ దెలిఁగింపఁబడెనో, లేదో కూడ తెలియదు. అది యలభ్యముగా నున్నది. ఆనందగజపతి ప్రభువుల యనువాదములంగూర్చి దీని యుపోద్ఘాతములో నిట్లున్నది-

"...ఇట్లనన్యగతికమైన జగము నుద్ధరించుటకై సర్వసాధారణమైన స్పష్టభాషలో దానిని తెలిగించుటకు నుత్సహించి శ్రీమద్విజయనగర సంస్థాన నిరతిశయాభ్యుదయ ప్రతిష్ఠాపన నిష్ఠాగరిష్ఠులును, వసిష్ఠ గోత్ర పవిత్రీకరణ ధురీణ వరచరిత్రులును, నప్రతిమప్రతిభావికసిత సర్వశాస్త్ర సిద్ధాంత విశేషులును, శ్రీ రామవాద్యంశ పయఃపారావార

రాకాసుధాకరులును, శ్రీ మహేంద్రాద్రి చక్రచూడామణి మహోదధీశ, కళింగదేశాధిపతి మీర్జా మన్నెసుల్తాన్ బహుదూరిత్యాది బిరుదవిశేష విభూషితులును, హీజ్ హైనెస్ ది మహారాజా ఆఫ్ విజయనగరం, కె. సి. ఐ. ఇ. వారు నగు శ్రీమదానందగజపతి మహారాజచంద్రు లారంభించియు, నంతటమాన్నె మిస్టర్ మిల్ దొరగారు చేసిన ఆంగ్లేయ తర్కశాస్త్రమును దాము తెనిగించుటకు బూనియున్నందున నవకాశము దయచేయించి..."

## శ్రీ కూర్మ పురాణము

ఇది యొక పద్యకావ్యము. మండ-కామేశ్వర కవిచే సంస్కృత మూలానుసారముగ రచింపఁబడినది. రాయల్ సైజున 316 పుటల గ్రంథము. ఇది శ్రీమదానంద గజపతి మహారాజుగారి పితృపాదులగు శ్రీ విజయరామ గజపతి మహారాజులుంగారికి అంకిత మొనర్పఁబడినది. మార్కండేయ పురాణమునందువలె నిందును విజయనగర ప్రభువుల వంశ వృత్తాంతము సమగ్రముగా వర్ణింపఁబడి యున్నది. దీని ముఖపత్ర మీ క్రింది రీతి నున్నది-

"శ్రీమదఖండ ధాత్రీమండల మండనాయమాన కళింగ రాజ్య మహామహైశ్వర్య మహేశ్వర శ్రీ విజయనగర సింహాసనాధీశ్వర శ్రీమద్రాజాధిరాజ శ్రీ విజయరామ గజపతిరాజ మహారాజాంకితంబుగ. శ్రీమదఖిల విద్వజ్జన శ్లాఘ్యమానానూన మనీషా విశేష షడ్భాషాకవితా చాతుర్య విజ్ఞాన సకల సద్గుణమణిభూష. శ్రీమదానంద గజపతిరాజ మహారాజానుమతంబున -

మండ-కామేశ్వర కవివరునిచే
ఆంధ్రకావ్యంబుగ రచింపబడిన
శ్రీ కూర్మ పురాణము
ఎంప్రెస్ ఆఫ్ ఇండియా ప్రెస్.
1888 జూలై 20. సర్వధారి ఆషాఢ శుద్ధ ౧ ప్రకటింపబడినది."

సంస్కృతమునందలి కూర్మపురాణము యథామాతృకముగ ఎనిమిది యాశ్వాసములలో ఆంధ్రీకరింపఁబడినది. షష్ఠ్యంతములకు ముందు, ఆనందగజపతి మహారాజుగారిని వర్ణించు-

"సీ. ఇనశశాంకులరాక యెంతకాలముదాఁక
జగముల వృద్ధినొందఁగ నొనర్చు
శేషాహిపై నిల్చి క్షితి భూతములఁ దాల్చి
యెంతకాలము చరియించుచుండు,
ఔత్తానపాది తా నన్నింటికిని మీఁది
చక్రంబు కెందాక జరుపుచుండు
నజహరీశులు దేని కాద్యంతములు పూని
యెంతకాలముదాఁక నెసఁగుచుండు

గీ. నంతవనుకను సర్వాంసహాధిరాజ్య
పూజ్య నిజవంశ్యవృద్ధి ప్రభూతసిద్ధి
యందఁదగు పూసపాటి వంశాబ్జహేళి
శ్రీమదానందగజపతి క్షితిపమౌళి"

అను పద్యమునుబట్టి ఆయన రాజ్యమును పాలించు కాలమునందే ఇది యాయన తండ్రిగారి కంకిత మీయఁబడినట్లు స్పష్టమగుచున్నది.

షష్ఠ్యంతములలోని రెండు పద్యములు—

'క. దేవహితాహితవిజరిపు
సేవన నిపుణ 'ద్వైశిష్ట' విబుధసమాస్వ్య
తాప్రిత ఖడ్గగ్నర్జనకు
మోదిత సకల[illegible]జన కమోఘభుజనకున్.

క. భూరిగుణ [illegible] హారా [illegible]
పావన్షిత విబుధ సంపదు [illegible]ష్ణనకున్
శ్రీవిజయ రామరాజపతి
భూవిభు విష్ణునకు జైవిప్రరజిష్ణునకున్.'

ప్రథమాశ్వాసగద్యము—

'ఇది శ్రీరామచంద్ర చరణారవింద వందన సమాసాదిత కవితా భాగధేయ విబుధజనవిధేయ మండ - కామేశ్వర నామధేయ ప్రణీతంబైన కార్తంబను మహాపురాణంబునందు ప్రథమాశ్వాసము.

ఇట్లే తక్కిన యాశ్వాసముల గద్యలును కలవు.

గ్రంథముచివరిపద్యము—

'పుత్రదారాది సంపూర్ణ భాగ్యోదయా!
శత్రుమిత్రాది సంశస్త భాస్వద్దయా!
జైత్రయాత్రాది రాజస్తుతోద్యన్నయా!
పాత్రదానాది శుంభత్ప్రపుణ్యాశ్రయా!

## శ్రీకృష్ణ విజయము

విజయనగర సంస్థానాధీశులు రచించిన ప్రబంధములలో శ్రీ కృష్ణవిజయము తొలుత పేర్కొనదగినది. దీని

రచయిత శ్రీ పూసపాటి-తమ్మ భూపాలుఁడు. విజయవాడ యందలి కనకదుర్గాదేవి సాక్షాత్కారము పొందిన సాటి లేని తపస్వి, తమ్మిరాజనియు నితనిని పేర్కొందురు. సుప్రసిద్ధుఁడగు రాచిరాజన కైదవ పురుషుఁడగు కృష్ణమరా జీతని తండ్రి. తల్లి జగ్గమ్మ.

ఇయ్యది రాయల్ $\frac{1}{4}$ సైజులో 168 పుటలలో ముద్రింపఁబడినది. దీనికి 15 పుటల పీఠిక—విశేషాంశము లతోఁగూర్పఁబడినది కలదు. పూసపాటిరాజుల వంశ వృక్షమును వివరించు పట్టికయు దీనితోఁ జేర్పఁబడినది. దీనిని శ్రీమదానంద గజపతి మహారాజులుంగారు ముద్రింపించిరి. దీని ముఖపత్ర మీ క్రిందిరీతిని కలదు—

"శ్రీరస్తు

శ్రీమన్మహామండలేశ్వర, మహీమండలరాయ, మన్నెసుల్తాన్
శ్రీ పూసపాటి-తమ్మభూపాల ప్రణీతంబగు

శ్రీకృష్ణవిజయము

ఇది

శ్రీ విజయనగర సింహాసనస్థులగు హిజ్ హైనెస్ ది మహారాజా
శ్రీ పూసపాటి-మీర్జా ఆనందగజపతిరాజు పాద్షా కళింగ
మన్నెసుల్తాన్, జి. సి. ఐ. ఇ. మహారాజులుంగారి అనుజ్ఞను పొందిన
గురుజాడ-శ్రీరామమూర్తివలన

తన్మహారాజ వంశ సంభవ ప్రసిద్ధరాజచారిత్రాంశాదికములతో
ప్రచురింపబడినది.

MADRAS

Printed at the Scotish Press, by Groves Cookson And Co.

1893."

శ్రీ తమ్మ భూపాలుఁ డీ ప్రబంధమును క్రీ. శ. 1540 ప్రాంతమున రచించినట్లు విశాఖపట్టణము జిల్లా వృత్తాంత సంగ్రహము నాంగ్లభాషలో రచించిన కార్మైకిల్ దొరగారు వ్రాసి యున్నారు. కాని, యీ కాలము సరికాదనియు, తమ్మ భూపతికాలము క్రీ. శ. 1640 ప్రాంతమనియు శ్రీగురుజాడ-శ్రీరామమూర్తిగారు తెలియఁజేయుచున్నారు.

కవులు కొందరు తాము రచించిన గ్రంథముల కర్తృత్వమును ధనాశచేఁ గొందరు ప్రభువుల కారోపించుట పరిపాటి యనియు, అచలాత్మజా పరిణయము, బృహన్నారదీయము మున్నగు గ్రంథములను రచించిన కొత్తలంక-మృత్యుంజయకవియే యీ గ్రంథమును విజయనగరరాజ కృతిగా రచించెననియు సుజనరంజనీ ముద్రాశాలలో ముద్రితమైన అచలాత్మజాపరిణయపుఁబీఠికలోఁ గలదు. అంతేకాక మృత్యుంజయకవియే ధరాత్మజా పరిణయమును అల్లూరి - అప్పలరాజుకృతిగాను, షట్చక్రవర్తిచరిత్రను మల్లారెడ్డి కృతిగాను రచించినట్లు ఆ పీఠికయందే చెప్పఁబడినది. కాని యిట్లూహించుటకుఁ దగిన యాధారములు మాత్రము కానరావు. కావున, శ్రీ కృష్ణవిజయము తమ్మ భూపాలుని కృతియే యని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఒకనాఁడు తమ్మభూపాలుఁడు కొలువు తీర్చియుండగా సభాసదు లాతనిం జూచి—

చ. 'హరివివిధావతారములయందుఁ బ్రశస్తము కృష్ణమూర్తి; య
క్కరివరదుండు లోకములఁగావ, సురేంద్రుఁడు విన్నవింపఁగా
నరకుని సంహరించి అలనామణులన్ బదియాఱువేల మున్
బరిణయమైన యక్కథ ప్రబంధముగా నొనరింప గాఁ దగున్.'

అని ప్రోత్సహించుటచే నీ ప్రభువు శ్రీ కృష్ణవిజయ మను నీ ప్రబంధమును రచించుటకుఁ బూనుకొనెను. పిదప 'చికీర్షిత కావ్యం బను మౌక్తికహారంబునకు నే దేవతా రత్నంబు నాయకరత్నంబగునో?' అని తలంచుచున్న సమయములో వతని యిష్టదేవత యగు బెజవాడ కనకదుర్గాదేవి ప్రత్యక్షమయి తనకుఁ గృతి నీయవలెనను కోరికను వెల్లడింపఁగా, ఆ దేవికే కృతి నొసఁగెను.

గ్రంథారంభమున ఇష్టదేవతాస్తుతి యిట్లున్నది—

శా. 'శ్రీవాణీవనితాది దేవరమణీ సీమంత సంసక్తమా
ల్యాదామంబు పదారవిందనఖ చంద్రశ్రేణి ధారావధూ
టీవృత్తిం గడియం దనర్చు జయవాటీస్థాన దుర్గామహా
దేవిన్ భక్తి భజింతుఁ దన్నతదయా దృష్టి ప్రసారార్తికిన్.'

షష్ఠ్యంతములలోని యొక పద్యము :—

క. 'నగరిపు పట్టణ సన్నిభ
జగదాశ్చర్య ప్రదానచణ జయవాటీ
నగరవర కనకదుర్గా
భగవతి శాశ్వత వితీర్ణ భాగ్యోన్నతికిన్.'

ప్రథమాశ్వాసాంత పద్యము :—

మాలిని— భువననిచయరక్షీ ! పుండరీకాయతాక్షీ !
దివిజనికరనేత్రీ ! దివ్యసౌందర్యగాత్రీ !
వివిధ విభవధాత్రీ ! విశ్వమాయావిధాత్రీ !
శివతను ధృతనారీ ! శీతభూభృత్కుమారీ !

ప్రథమాశ్వాసాంత పద్యము :—

'ఇది జయవాటికా కనకదుర్గా మహాదేవీ ప్రసాద లబ్ధ నిరర్గళ కవితా చమత్కార, మాధవవర్మ వంశాలంకార, శ్రీమన్మహామండలేశ్వర, మహీమండలరాయ, మన్నె సులతాను శ్రీ వూసపాటి-గోపాల కృష్ణరాయ పుత్ర వసిష్ఠగోత్ర పవిత్ర, నిశ్శంక వితరణ క్రీడాసంతోషితాశేష విద్వత్కవిజాల, తమ్మభూపాల ప్రణీతంబైన శ్రీ కృష్ణ విజయంబను మహాప్రబంధమునందు ప్రథమాశ్వాసము.

ఆశ్వాసాంత గద్యము లన్నియు నొక్కరీతినే యున్నవి.

శ్రీకృష్ణవిజయ మైదాశ్వాసముల ప్రబంధము. తొలి యాశ్వాసమున-ఇష్టదేవతాస్తుతి, గ్రంథ రచనా సందర్భము, దుర్గా సాక్షాత్కృతి, కృతిపతి వంశవర్ణనము, షష్ఠ్యంతములు, కథాంశమున ద్వారకానగర వర్ణనము మాత్రము కలవు. ద్వితీయాశ్వాసములో-శ్రీకృష్ణుఁడింద్రుని ప్రార్థనపయి నరకాసురునిపయికి యుద్ధమునకుఁ బోవుట, దుర్నిమిత్తములు వర్ణింపఁబడినవి. తృతీయాశ్వాసమున-శ్రీకృష్ణుఁడు పాంచజన్యమును పూరించి, యుద్ధమునకుఁ గడంగుట, యుద్ధము, శ్రీకృష్ణుని విజయము వర్ణితములు. చతుర్థాశ్వాసమునందు-శ్రీకృష్ణుఁడు నరక

పుత్రుని యాతిథ్యమును స్వీకరించుట, ఇంద్రుని జూడఁ బోవుట, అతిథి మర్యాదలు మున్నగునవి కలవు. పంచమాశ్వాసమునందు–దేవకన్యల విరహము, శ్రీకృష్ణుఁడు వారిని వివాహమాడుట కలవు. నారదప్రవేశము, పారిజాతాపహరణ వృత్తాంతమును ఇందు లేవు.

ఈ ప్రబంధమునందలి పద్యములు ప్రౌఢరచనతో విలసిల్లి హృదయరంజకములై యుండును. మచ్చునకుఁ గొన్ని పద్యములు–

సీ. 'తన మహా ప్రాసాద ఘనత యశ్రాంతంబు
 విబుధలోకముమీఁద సన్తరిలఁగఁ,
దన సదాక్రీడావిధానంబు శుకముఖ్య
 నానా ద్విజానందనంబుగాఁగఁ,
దన యనల్పాకార తల్ప కల్పనలీల
 యహితాతివర్ణితంబై చెలంగఁ
దన గృహౌదార్య ముత్తమరత్నయుత శాత
 కుంభ జృంభణయుక్తిఁ గొమరుచూపఁ,

గీ. దవ సుదర్శన మురుపుణ్య జననికాయ
ముక్తి సంధాయకాపూర్వశక్తి దనరఁ
దనకుఁ దన నాయకునకు భేదంబు లేక
ప్రాభవము గాంచి యొప్పు నప్పట్టణంబు.'

[ద్వారకావర్ణనము – ప్రథమాశ్వాసము]

ఉ. ఉత్తరపూర్వ యేలెడు మహోత్తర శౌర్య కళా సమగ్రు లా
చిత్తజవైరి కింకరులు చిత్తజవైరి భయంబు పూనఁగా

నిస్తేజి రిత్తలయ్యెను తదీక్షణవహ్నిశిఖానికాయముల్
క్రొత్తగఁ బూనెఁ గేవలము కుంకుమరేణు కృతాంకకార్యముల్.

[శివకింకరుల భీతి వర్ణన - ద్వితీయాశ్వాసము]

సీ. బహుళ ధారావళి ప్రౌఢ నృత్యత్తరం
గము లుత్పత తరంగములు గాఁగఁ,
బర్వతోపమగర్వ దుర్వారవారణో
త్తమ సమూహములు గ్రావములు గాఁగ,
కుటిలదానవ నవక్రోధారుణిత నేత్ర
లీల బాడబవహ్నికీల గాఁగ
భాసమాన మహాట్టహాస రోచి ప్రకాం
డములు డిండీరఖండములు గాఁగ

గీ. భైరి భీకరభేరి భాంకార హృద్య
వాద్యరావం బఖండ రావంబు గాఁగ
విలయసమయ పయోధి యుద్వేల మైన
కరణి దానవసైన్యంబు కానవచ్చె.'

[నరకసేనావర్ణనము - తృతీయాశ్వాసము]

సీ. కుంతలంబులకు నత్యంత కౌటిల్యంబు
ఘటనచేసిన జట్టు గట్టుపడఁగ,
కుచకుంభములకు నెక్కుడు కర్కశత్వంబు
నొందఁజేసిన నింద మందగఁగన
మధ్యభాగములం దమంద దారిద్ర్యంబుఁ
గీలించినట్టి దుష్కీర్తి యణఁగ
నాభీకుహరయందు నాభీల నిమ్నతా
రీతిఁగూర్చిన యపఖ్యాతి చెదర,

గీ. మివులఁ దిన్నని బాహువుత్ మెత్తని తను
లతలు గొప్ప పిరుందు లున్నతి దనర్చ
ప్రపదములు వీరి కొనరించెఁ బద్మసూతి;
యతని చాతురి వర్ణనీయంబుగాదె !

[రాజకుమారికల సౌందర్య వర్ణనము - చతుర్థాశ్వాసము]

చ. 'ఉపలముఁ ద్రొక్కఁ జేయఁగఁ దలోదరిపాదము శౌరి యంటుచో
నుపగత మందహాసముల నొయ్యనఁ బత్నులు పల్కఁ రక్తతం
'గుపిత మనస్కయైనదిరొయి కోమలి, వందన మాచరించెఁ దా
నిపుడు యదూద్వహుం'డనుచు నెంతయునుం బరిహాసవైఖరిన్.

[వివాహవర్ణనము - పంచమాశ్వాసము]

తమ్మభూపాలుఁ డీ ప్రబంధమును ద్రాక్షాపాకమున నలంకార శోభితముగఁ గూర్చెను. బెజవాడను 'జయ వాటిక'గఁ జాలచోట్ల పేర్కొనెను. పదునేడవ శతాబ్దిలో వెలువడిన యుత్తమ ప్రబంధములలో నిది యొకటి యని చెప్పవలసి యున్నది. ఇందలి కృష్ణానదీ వర్ణనము, సంస్కృత మయమగు కనకదుర్గా దండకము ప్రత్యేకముగఁ బ్రశంసింపఁదగినవి.

## సత్యవ్రతి శతకము

ఒకప్పుడు నిండుకొలువు తీర్చియున్న ఆనంద గజపతి ప్రభువు విద్వత్కవులకు "సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్" అను సమస్య నిచ్చి, అది నాల్గవ చరణముగా ఉండునట్లు శతకమును రచింపవలెనని కోరెను. ఆస్థాన విద్వాంసులే కాక యితరులుకూడ శతకమును వ్రాయవచ్చు

ననియు, ఆ శతకము లన్నింటిలోను సర్వోత్తమమైనదానికి గొప్ప బహుమాన మీయఁబడుననియు కూడ ప్రకటించెను. కేవలము పారితోషికమును బడయవలయునను ఆశయ ముఁగాక–ప్రభుని ప్రశంసను పొందవలెనను నభిలాషతో పెక్కుమంది విద్వాంసులు 'సత్యవ్రతి శతకము'ను రచించిరి. ఎవ్వరెవ్వరు రచించిరో, వానిలో ఎన్ని ముద్రితములైనవో, ఎన్ని అలభ్యములో వివరములు తెలియలేదు. విద్వత్కవుల దురదృష్టమువలన, ఎట్టి పారితోషికము నీయకమునుపే ఆనందగజపతి ప్రభువు కీర్తిశేషుఁడయ్యెను.

ఈ శతకమును రచించునప్పుడు కొందరు విద్వాంసులు తమ ప్రతిభను వెల్లడించుచు బంధకవిత్వమును, చిత్ర కవిత్వమును చెప్పినట్లు తెలియుచున్నది. విజయనగరము నందలి సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ భాగవతుల–లక్ష్మీ నారాయణశాస్త్రిగారు, తాము రచించిన శతకములో–మిగిలిన మూఁడు పాదములలో ఒక్క తకారమును మాత్ర ముపయోగించి రచించిన పద్యము ప్రసిద్ధమై యున్నది. అది–

క. 'ఋత తితఊత్తీతా
తతేతి తాతేతతాత తత్తైతత్తా
తత తత్తా తతి తత్తిన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్.'

[దీని యర్థము—ఋత = సత్యమనెడు, తితఊ = జల్లెడవలన, ఊత్తి = జల్లించుటచే, ఇత = పొందఁబడిన, ఆతత = విస్తారమైన, ఇతి = జ్ఞానముచే, తాత = తండ్రివంటి పరమేశ్వరునియొక్క, ఇత = పొందఁబడిన, తాత = దయచేతను, తత్తైతత్తా = ఆది యిది అను విభేద

జ్ఞానముచేతఁ గలిగిన, తత = అధికమైన, తుత్త్రాతతి = బాధల సమూహ మును, తుత్త్రిన్ = పోఁగొట్టుటచే, సత్యవ్రతికిన్ = సత్యనియమము కలవానికి, సతతము = ఎల్లప్పుడును, సంతసము, ఒసంగున్.]

సుప్రసిద్ధ విద్వత్కవులగు శ్రీ కొల్లూరు-కామశాస్త్రి గారును, 'పంతుల బ్రహ్మన్నవంటి పండితుఁడేఁడీ?' అను ప్రసిద్ధిని పొందిన శ్రీ పంతుల - బ్రహ్మదేవకవియుఁగూడ 'సత్యవ్రతి శతకము'ను వ్రాసినట్లు తెలియుచున్నది.

శ్రీ అజ్జాడాదిభట్ల-నారాయణదాసుగారు కూడ దీనిని రచించిరి. అది వెంటనే ముద్రణభాగ్యమును పొందినదఁట! దాని ప్రతి యిపుడు లభింపలేదు. ఒక్క పద్యము గ్రంథాంతరమున నుదాహృతమైనది మాత్రము లభించినది.

క. 'చతురకళా విద్యాసం
గతికిన్ స్థిరధృతికిఁ బ్రకట కరుణామతి కీ
కృతి యానందగజపతికి
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్.'

## సుగుణమంజరి

ఆనందగజపతి మహారాజుగారి సతీమణి యగు వన కుమారీదేవి స్మృతిరూపముగా రచింపఁబడిన చిన్న పద్య కావ్య మిది. దీని రచయిత (శ్రీ) కె. ఎన్. జి. రాజామణి సెట్టి. ఇతఁ డానందగజపతి ప్రభుని దర్బారులో ముఖ్యుఁడు. 'క్రికెట్' ఆటలో గొప్ప నైపుణ్యము కలవాఁడు. స్వాభావిక ముగ నితఁడు కవి కాఁడు. కాని, ప్రభువుల యాస్థాన విద్వత్కవులతోడి సాహచర్యమువలన నితనికిఁ బాండిత్యముతోఁ

బాటు కొంత కవిత్వమును అబ్బినది. ఇతఁ డీ గ్రంథమునే కాక 'గణికామణీ విలాసము, సొడ్డుకత, విజయరామ చరిత్రము' అను గ్రంథములను కూడ వ్రాసెనఁట! 'వనకుమారీ మహిమ' అను గ్రంథములో వనకుమారీదేవి గుణగణముల నీతఁడు వర్ణించినట్లు కొందరి యభిప్రాయము. ఈ 'సుగుణ మంజరి'నే యా గ్రంథమని వా రనుకొనిరేమో! అట్టి గ్రంథ మున్నట్లు తోఁచదు. తక్కిన గ్రంథములు కూడ నిపుడు లభించలేదు.

శ్రీ వనకుమారీదేవి 'ఛోటా మహారాణీ సాహెబా' (చిన్న మహారాణిగారు) అని ప్రసిద్ధి పొందినది. ఉత్తమ సతీమణి యగు నీమె కాశీపట్టణమున అకాలమృతిని పొందఁగా ఆనందగజపతి ప్రభుని మనస్సు విషాదపూరితమై మిక్కిలి కలఁతఁ జెందెను. మహారాజుగారి మనోవైకల్యమును పోఁగొట్టుటకును, వనకుమారీదేవి యాత్మశాంతికిని, ఆమె స్మృతి చిహ్నముగ డెమ్మీ సైజున 8 పుటలు కల యీ చిన్న గ్రంథము కూర్పఁబడి 1896–వ సంవత్సరములో చెన్నపట్టణము పాఫమ్సు బ్రాడ్వేలోని శ్రీహరి ముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది. ఇందలి విషయమును, రచనా పద్ధతిని క్రింది పద్యములు తెలుపఁగలవు.

సీ. శ్రీ జయపూర్వర సీమంతినీమణి
కే వరారోహ జనించి మించె,
విజయరామగజపతి జనాధిపునకు నే
యనఘాత్మ కోడలై యశమునించె,

నలకాంబ సేవలు సలుపుచునుండి యే
సాధుచరిత బుధ స్తవముఁ గాంచె,
నానందగజపతి మానవేంద్రునకు నే
విమలాంగి పాయని వేడ్కఁ గాంచె,

గీ. రాణిమీఁదు 'ఛోటామహారాణి సాహె
బా విజయనగరమకట ! ప్రాణవిభుఁడు
వంతఁ గృశియింపఁ గాశికా పట్టణమున
వల్లభు నెడందఁ నిలిపి జీవంబు వదలె.

ఉత్సాహము—

అందకత్తెయౌచు సుశీలయైన సతిని బాసి యా
నందముం దొలంగి పోరె నలగుచున్న శ్రీమదా
నందగజపతిక్షితీంద్ర ! నాదు లోననందగం
గొందలంబు మాని యుండఁ గోరి వేఁడెదం గడున్.

క. రాజేశ్వరి నెల్లప్పుడు
పూజించుచు నృపుల మైత్రిఁ బొలుపారుచిలన్
రాజిల్లెడు కే. ఎన్. శీ
రాజామణిశెట్టి దీని రచియించె నొగిన్.

## స్వరమంజరి

ఇది సంగీతశాస్త్రము నభ్యసించువారి కత్యంతావశ్యక మగు చిన్న గ్రంథము. శ్రీ ఆనందగజపతి మహారాజుగారి యాశ్రితులును, గానవిద్యావేత్తలును అగు శ్రీ తచ్చూరు-సింగరాచార్యులుగారును, వారి సోదరులగు శ్రీ చిన్న సింగరాచార్యులుగారును దీనిని రచించిరి.

ఆ కాలమున గ్రంథములు ముద్రణ భాగ్యము నొందుటయే యరుదు. అట్టి స్థితిలో ఇయ్యది 1891-వ సంవత్సరమున తృతీయ ముద్రణమును పొందియున్నట్లు ముఖపత్రమునుబట్టి తెలియుచున్నది. దీనింబట్టి యిది ఎట్టి యాదరణ పొందినదియు, ఎంత యుపయోగకరమైనదియు స్పష్టమగుచున్నది. దీని ముఖపత్ర మీ క్రింద నీయఁబడుచున్నది-

'స్వరమంజరి

సంగీతవిద్య నభ్యసించువారల యుపయోగార్థము
తచ్చూరు - సింగరాచార్యుల చేతను, తచ్చూరు -
చిన్న సింగరాచార్యుల చేతను ఏర్పరుపబడినది.

మూడవ కూర్పు

(Swaramanjari of the first book in the art of Music)
Published by order of
the Maharaja of Sri Vizianagaram



Madras

Printed at K. R. Press,
289, Thamboo Chetti's Street
1891

Regd. Copy-right
Price 4 annas

# అనుబంధము

విజయనగర సంస్థానప్రభువులు సాటిలేని యాంధ్రసారస్వత సేవ యొనర్చినట్లు ఇదివఱలో వివరింపఁబడినది. ఆ ప్రభువులు సంస్కృతాంధ్రములు రెండింటను విద్వాంసులగుటవలన తెలుఁగుతో పాటు సంస్కృతమునందును పెక్కు గ్రంథములను రచింపఁజేసిరి. వారి పోషణ వలన విజయనగర సంస్కృత గ్రంథావళియందును, వేర్వేఱుగను ముద్రింపఁబడిన సంస్కృతగ్రంథము లిచట తెలుపఁబడుచున్నవి.

## 1. ఋగ్వేదభాష్యము

జర్మనీదేశస్థుఁడగు మాక్సుముల్లరు పండితునిచే సంపాదింపఁబడినది. శ్రీ ఆనందగజపతి మహారాజుగారి ధనసాహాయ్యమున దీని ద్వితీయ ముద్రణము కొనసాగినది.

## 2. గోదావరీ లహరి

గోదావరీనది స్తుతిరూపమగు చిన్న పద్యకావ్యము. రచయిత ఆనందగజపతిప్రభువుల ఆస్థాన విద్వాంసులగు శ్రీ పేరి - కాశీనాథ శాస్త్రిగారు.

## 3. దేవీవిలాస తరంగిణి

దేవీస్తోత్రరూపమగు పద్యకావ్యము. రచయిత ఆనందగజపతి మహారాజుగారి ఆస్థాన విద్వాంసులు శ్రీ మండ-కామేశ్వరశాస్త్రిగారు.

## 4. నృసింహదేవ కరనఖస్తోత్రము

శ్రీ నరసింహావతారమూర్తి కరనఖములను వర్ణించు స్తోత్ర గ్రంథము. కర్త - శ్రీ ఆనందగజపతిప్రభుని ఆస్థానమున నుండిన శ్రీ కొల్లూరు - కామశాస్త్రిగారు.

5. నిశ్చయచింతామణి

బ్రహ్మయజ్ఞభాష్యము. రచయితలు శ్రీ నేమాని - కోదండరామ యజ్వయును, శ్రీ ఇవటూరి - నందికేశ్వరశాస్త్రిగారును.

6. న్యాయవార్తిక తాత్పర్యటీక

న్యాయశాస్త్రగ్రంథము. వాచస్పతి మిశ్రవిరచితము. విజయనగర సంస్కృత గ్రంథావళీ ప్రచురణ.

7. న్యాయమంజరి

న్యాయశాస్త్రగ్రంథము. విజయనగర సంస్కృత గ్రంథావళిలో ప్రకటింపఁబడినది.

8. న్యాయసూత్రములు

న్యాయశాస్త్రగ్రంథము. గౌతమమహర్షి ప్రణీతము. భాష్యముతోఁ కూడ ముద్రితము. ఇది విజయనగర సంస్కృతగ్రంథావళిలోని గ్రంథముగా ప్రకటింపఁబడినది.

9. పంచపాదిక

ఇది పంచపాద విరచితము. వేదాంతగ్రంథము. విజయనగర సంస్కృత గ్రంథావళిలో ప్రకటితము.

10. పంచపాదికా వివరణము :—

పయి పంచపాదికకు వివరణ గ్రంథము. ప్రకాశాత్మ విరచితము. విజయనగర సంస్కృత గ్రంథావళీ ప్రచురణము.

11. ప్రశస్తపాద భాష్యము :—

న్యాయశాస్త్ర గ్రంథము. విజయనగర సంస్కృత గ్రంథావళీ ప్రచురణ.

**12. బృహత్సంహిత :—**

జ్యోతిషగ్రంథము. వరాహ మిహిర కృతము. విజయనగర సంస్కృత గ్రంథావళిలో ప్రచురింపబడినది.

**13. రామచంద్ర కథామృతము :—**

పద్యకావ్యము. కర్త భగవత్కవి శ్రీ ముకుంబై నరసింహాచార్య స్వామిగారు. ఇది రామాయణ కథను విపులముగా వివరించు బృహత్కావ్యము. విజయనగరము కోటలోని శ్రీ విజయరామ విలాస ముద్రాక్షరశాలయందు తెలుఁగు లిపిలో ముద్రింపఁబడినది.

**14. వాచస్పత్యము :—**

బృహద్విజ్ఞాన సర్వస్వము. తారానాథ తర్క వాచస్పతి పండిత సంకలితము. శ్రీ ఆనందగజపతిప్రభుని ధనసాహాయ్యమున నియ్యది ముద్రింపఁబడినది.

**15. వాసంతికాస్వప్నము :—**

ఇది యొక నాటకము. ఆనందగజపతిప్రభుని యాదరమున ప్రకటింపఁబడినది.

**16. వివరణ ప్రమేయ సంగ్రహము :—**

వేదాంత గ్రంథము. మాధవ విద్యారణ్య ప్రణీతము. విజయనగర సంస్కృత గ్రంథావళిలో ప్రకటితము.

**17. వేదాంత కల్పతరువు :—**

వేదాంతగ్రంథము. అమలానంద పరివ్రాజకాచార్య ప్రణీతము. విజయనగర సంస్కృత గ్రంథావళిలో ప్రకటితము.

18. వేదాంత కల్పతరు పరిమళము :—

వేదాంతగ్రంథము. పయి వేదాంత కల్పతరువునకు వ్యాఖ్యానము. అప్పయదీక్షిత విరచితము. విజయనగర సంస్కృత గ్రంథావళిలో ప్రకటితము.

19. వైద్యశబ్ద నిఘంటువు :—

వైద్యులకుపయోగించు శాస్త్రనిఘంటువు. శ్రీఆనందగజపతి ప్రభుని సహాయమున ప్రకటితమైనది.

20. వాక్యార్థచంద్రిక :—

వ్యాకరణ శాస్త్ర గ్రంథము. శ్రీ ఆనందగజపతి ప్రభువు పితృపాదులు విజయరామగజపతి మహారాజాగారి యాస్థాన విద్వాంసులగు భాగవతుల-హరిశాస్త్రిగారిచే రచింపఁబడినది. పరిభాషేందుశేఖర వ్యాఖ్యానము.

సప్తపదార్థి :—

న్యాయశాస్త్ర గ్రంథము. శివాదిత్యకృతము, విజయనగర సంస్కృత గ్రంథావళిలో ప్రకటితము.

22. సిద్ధాంత లేశ సంగ్రహము :—

వేదాంతశాస్త్ర గ్రంథము. అప్పయదీక్షితకృతము. కృష్ణానందతీర్థ వ్యాఖ్యాసహితము. విజయనగరసంస్కృత గ్రంథావళిలో ప్రకటితము.

23. శ్రీ కాశీ స్తవము :—

కాశీస్తుతి రూప పద్యకావ్యము. ఆనందగజపతి మహారాజుగారి ఆస్థాన విద్వాంసులు శ్రీ కొల్లూరు-కామశాస్త్రిగారు రచించినది.

24. శేఖరగురుప్రసాదము :—

వ్యాకరణశాస్త్రగ్రంథము. లఘుశబ్దేందుశేఖరవ్యాఖ్యానము. రచయిత మహామహోపాధ్యాయ శ్రీ తాతా-సుబ్బారాయశాస్త్రిగారు. శ్రీ లలితాకుమారీదేవి మహారాణిగారి ధనసాహాయ్యమున ముద్రింపఁబడినది.